


294.5922
వీరాం - ఎమె
71,166

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ

Cat-2921

# ఎమెస్కో వచన రామాయణం

(ఆరవ సంపుటం)

రచన:

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



194

యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM - Vol. 6

SATAVADHANI KOTA VEERANJANEYA SARMA

*First Edition :*
DECEMBER 1980

Cat - 1226 294.5922

*Publishers :*
M. SESHACHALAM & Co.,
Machil patnam - Secunderabad.

*Cover Design :*
B A P U

*Printers :*
PRASAD PROCESS,
Machilipatnam




**Price : Rs: 5-00**

*Distributors :*
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237-Rashtrapathi Road, Secunderabad-500 003.




194

# ద్వాదశాదిత్యమండలం వలె ప్రకాశించే

# 12 సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం

ఏనాడు వాల్మీకి మహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుండి అవిచ్ఛిన్నంగా శాఖోపశాఖలతో బహు నామాలతో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహా కార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం త్రొక్కటం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర కావ్యం వలే చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులు వున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కథలేవస్తై. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కులన్నీ ఇందులో విశదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుంటే చవిటి నేలలు, కేదారఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు, విస్తార విరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంత తామే కోరి వరించి వస్తై. ఈ రచనా విన్యాసం సరికొత్తది. పండిత పామరభేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూసుకుంటే తెలుస్తుంది. ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గు భాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్యఅయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకా ఎన్నో ఎన్నో. ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాక్షులు గండి.

స్వామి! భవత్కృపాప్రదీపసంగతి యైదవసంపుటంబునన్
భూమి భవాత్మదేవు పదమ్ము స్పృశియింపఁగనుంచినాను శ్రీ
శ్యామయసూనమట్లుగను, పావని! ఆదవ సంపుటంబునున్
బామర పండితాళి భవబంధహరంబుగ వ్రాయఁజాముమా.

# లక్ష్మణుడు అయోముఖిని విరూపను చేయుట

అవసరం ముందుకు ఆకర్షిస్తున్నా, మనస్సు మాత్రం మాటి మాటికి వెనక్కు లాగుతుంటే తిరిగి తిరిగి పక్షిరాజు మరణించిన చోటువైపు చూస్తూ పోసాగారు. తాము వదలిన ప్రదేశానికి పడమరగా పోయి, తర్వాత దక్షిణ దిశగా చని మూడు కోసుల విస్తీర్ణం కల "క్రౌంచం" అనే పేరు గల ప్రదేశం చేరుకున్నారు. మధ్య మధ్య దుర్గమకంటక శిలా ప్రదేశాన్ని గమిస్తూ, మధ్యందిన మార్తాండ చండ కిరణ తాపతప్త సర్వాంగులవుతూ, విశ్రాంతి నిమిత్తం వృక్షాలను ఆశ్రయించుకుంటూ, దాహశాంతికి నీటిపడియల నర్థించుకుంటూ, క్రౌంచంలో ప్రవేశిస్తూ, రెండు గడియల కాలం చల్లని వటవృక్షచ్ఛాయలో కూర్చున్నారు. అనంతరం ఆ ప్రదేశాన్ని దాటి మరి మూడుకోసుల దూరం నడిచి రసాతల సన్నిభమై, ఘోరమృగ సంకులంబై, శాశ్వతాంధకార బంధురమైన "మతంగవనం"లో ప్రవేశించారు. వీరికి చాలా సమీపంలో భీకర దంష్ట్రానన, ముక్త మూర్ధజ (విరియబోసుకున్న వెంట్రుకలు గలది) మృగాంతకాసన, లంబస్తని, వికటదాస వితిరుగుతూ సోదరులను చూసింది. వెంటనే దీర్ఘంగా అంగలు చాచి వేస్తూ, ముందుగా వస్తున్న సౌమిత్రికి అడ్డం వచ్చి ఆకస్మాత్తుగా ఆలింగనం చేసుకుంది. అంతతో ఆగకుండా, "రారా నలపుకాడా! నీకు భార్యనవుతాను. జీవితాంతం అడవుల్లో ఆడుకుంటూ సుఖించుదాం. నా పేరు అయోముఖి. ఈ ప్రదేశానికి నేను రాణిని. నీవు కోరినవన్నీ సమకూరుస్తాను" అంటూ చేయి గట్టిగా పట్టుకుంది. ఆ దుష్టురాలి చేష్టకు ఆగ్రహించిన లక్ష్మణుడు స్తన కర్ణ నాసికాచ్ఛేదం చేసి దాన్ని తరిమాడు. అది బాధతో అరుస్తూ అడవిలో పడి అదృశ్యమయింది.

రక్కసి పారిపోయిన పిమ్మట రామలక్ష్మణులు ఆ అగాధమైన లోయలో పయనిస్తుండగా లక్ష్మణుడు అన్నా! అకారణంగా, గుండె చెద

రింది. వామ భుజం అదరింది. ఏదో అశుభం జరగనుంది. మనం అన్నిటికీ సన్నద్ధులం కావాలె. పాలపిట్ట కూసింది. జయం మనకు నిశ్చయం. అయినా మన జాగ్రత్తలో మనం వుండటం మంచిది. నేను దిక్కులన్నీ పరీక్షిస్తూ ముందుగా నడుస్తూంటాను. వెనుక నీవు కూడా దీక్షతో పరికిస్తూ రా. ఈ ప్రదేశం మరీ భయంకరంగానూ, విద్దూరంగానూ వుంది" అంటూ హెచ్చరించి నడువసాగారు. కొండలు, గుట్టలు, గుహలు, అడవి, ఆకాశం పంచి ప్రతిధ్వనించేలాగా కర్కశకంఠధ్వని వినిపించి ఇద్దరూ క్షణకాలం ఆగి అన్నివైపులా నిశితంగా చూచి ముందుకు నడిచారు. పోను పోను ఆ దారి క్రిక్కిరిసిన ముండ్ల పొదలతో పెనవేసుకుని చీమలకు సైతం చొరరానంత దట్టంగా వుంటూంది. ముందుకు పోవీలులేదు. వెనక్కు వెళ్ళటానికి వచ్చిన దారి గురుతు లేదు. ఆ సందిగ్ధావస్థలో చిక్కిన అన్నదమ్ములు మార్గాంతరం మనసుకు రాక పరస్పరావలోకనం చేసికొంటున్న సమయంలో, అంతకు పూర్వం అతి భయంకరంగా గోచరించిన ఆ ప్రదేశం వృక్షరహితమైన వూషర క్షేత్రంగా మారిపోయింది. వారికి ఎదురుగా ఎత్తైన బండరాతిపై కొండవంటి రూపం గోచరించింది. ఆ మూర్తి వూహకందనట్లుంది. విరించి సృష్టిలో వైవిధ్యాన్ని చెపుతూంది.

## రామలక్ష్మణులు కబంధునికి చిక్కుట

పర్వతాకారుడు, విశాలవక్షుడు, శిరోగ్రీవా హీనుడు (తల, కంఠం లేనివాడు) ఖర రోమావృతుడు, కాలమేఘ సంకాశుడు, మేఘస్ఫూర్జ ధుఘోషుడు (మేఘం గర్జించినట్లు గర్జించేవాడు) వక్షఃప్రదేశ స్థల లాటదేశ గపిశంగ స్ఫార పక్షయుత వహ్నితుల్య నయన ద్వయుడు, (గుండె మధ్యలో మొగం వుంది, ఆ మొగంలో అగ్నిలాగా వుండే రెండు కళ్ళు కలవాడు) దీప్యద్దంష్ట్రుడు, అటవీసత్వ మృగద్విపాదిక వికర్షాకర్ష ఖేలాలంపటుడు, యోజన దీర్ఘ బాహుద్వయుడు. మార్గస్థితుడు, ఘోరాస్యుడు. భీమబలుడు తమవైపే చూస్తున్నట్లు సోదరులు గుర్తించారు. అతనిలక్షిస్తూ అభిముఖంగా పోసాగారు. ఇంతలో ఆశ్చర్యం గొల్పే సంఘటన జరిగింది. రెండు ప్రక్కలనుంచి రెండు చిన్న కొండలు కదలివచ్చి వారిని బంధిం

చిన్నై. సూర్యాగ్ని తేజోమూర్తులూ, భయంకరశరాసనధరులూ, కృపాణ హస్తులూ, మహా బలులైన రామలక్ష్మణులు ఆ చిరుకొండల మధ్య చిక్కి ధైర్యం కోల్పోయారు. అంతలో రాముడు తేరుకున్నాడు. చిన్నవాడైన లక్ష్మణుడు దైన్యపడి "అన్నా! నా గతి చూశావా? ఈ కొండమధ్య చిక్కుపడ్డాను. నీవైనా తప్పించుకుని పో. ఎప్పటికైనా వదిన జాడను తెలుసుకోగలవు. నీవు రాజ్యసుఖ ప్రాప్తినందిన సమయంలో నన్ను మాత్రం ఒక్కసారి గుర్తు చేసుకో" అని చెప్పాడు "తమ్ముడా! ఇంత బేలవయినావేమి? నాకెంతో ఊరట కల్పిస్తున్న నీవింత అధైర్య పడవలసిన అవసరం ఏమి వచ్చింది? నేనూ, ఇటుప్రక్క కొండమధ్యలోనే వున్నాను చూడగా చూడగా మన వెనుకవైపునుంచి కూడ ఇటువంటిదే దాపునకు వస్తూంది ఇదేదో మనం చూచిన వికృతరూపుని మాయాజాలంగా వున్నట్లుంది. ఇవి కొండలు కావు. ఆ భయంకరమూర్తి చేతులు మనలను ఆతని దగ్గరకు లాగుకొని పోతున్నై. ఇప్పుడు మనం ధైర్యంతో వుండి ఏం జరుగుతుందో చూద్దాం" అని రాముడన్నాడు ఇంతలో కర్ణకఠోరంగా ఆ వికృతిమూర్తి "ఎవరు మీరు? శరచాపాలు ధరించి. తాపసవేషంతో ఈ అడవిలో ఎందుకు తిరుగుతున్నారు. ఆకలిమంటతో వున్న నా చేతుల కెందుకు చిక్కారు? మీ గమనాన్ని నేనే కృతకంగా అడవి కల్పించి అడ్డగించాను. రెండు యోజనాల దూరం వరకు నా చూపుకు అడ్డం లేదు. నాకెప్పుడు ఆకలి వేస్తే అప్పుడు నాలుగు దిక్కులూ చూస్తాను యోజన దీర్ఘంగల నాహస్తాలమధ్యలో సంచరించే మృగాలను నా చేతులతో బంధించి దగ్గరకు లాక్కొని నోటిలో వేసుకుంటాను నాదృష్టికి ఈనాడు మీరందారు. ముందు మీరు కొండలనుకున్నవి నా చేతులు. మిమ్మల్ని చూడంగానే వెంటనే మ్రింగబుద్ధి పుట్టలేదు మీతో మాట్లాడి మరీ తిందామనుకున్నాను. ఇక మీకు నూరేళ్ళు ఇప్పుడే నిండినై నా బాహాలమధ్య చిక్కిన ప్రాణి నాకు ఆహారంగా కావలసిందే నా పేరు కబంధుడంటారు" అని అరిచాడు.

ఆ మాటలు విని రాముడు వెల్లనైన మోముతో "కష్టాలపై కష్టాలు వచ్చిపడుతున్నై. తగిలిన కాలికే మళ్ళీ దెబ్బ తగులుతూంది. మన మనుగడకే అస్థిరత్వం అగపడుతూంది. ఇంత శ్రమపడినా ఆ రాక్షసుని పూర్తి

వృత్తాంతం తెలియలేదు. సీత నాపై ప్రాణాలు పెట్టుకొని అజ్ఞాత ప్రదేశంలో అసురసురమంటూ వుంటుంది. ఈ రాక్షసుడు మన మార్గం మార్చి తనకు ఆహారంగా నోటిపద్దకు మనలను తెచ్చుకున్నాడు. అసమర్థులవలె ఆపదలో చిక్కిన మనం ఆమెను ఏ విధంగా కాపాడగలం? కాలం శక్తి అవ్యాహతమైందనీ, ప్రాణులపై దాని అధికారం అడ్డు లేనిదనీ తెలుసుకున్నావా? కాలం కలిసి రాకపోతే ఎంతవారైనా ప్రవాహానికి అడ్డం వేసిన ఇసుక సేతువు వలె కొట్టుకపోతారు. మనకు దైవం ఇచ్చిన శక్తి అపారమైంది. ఎంతకయినా సమర్థమైంది. అయితే ఆ దైవం ఇప్పుడు ప్రతికూలించి ఈ వికారాకృతి నోటికి కబళంగా చేసింది. మనకు మాయలు తెలియవు. ఈ కబంధుడు రాక్షసుడే కాని ఆకారం పూర్తిగా లేదు. తల లేదు గుండెలో నోరు. కళ్ళు వున్నై. గళంలేదు. కాళ్ళు కూడా లేనట్లే వుంది."

## రామలక్ష్మణులు కబంధుని రెండుచేతులు నరుకుట

అని అన్నాడు. రాముని మాటలు వింటున్న రాక్షసుడు "మీరు నిజంగా ధైర్యవంతులే పరాక్రమవంతులే కాని ఈనాటికి ఆహారంగా విధి మిమ్మల్ని పంపించింది. మీరిప్పుడు చేయగలిగింది ఏమీలేదు. నా వుదర కోశంలో పడి జీర్ణమైపోవటమే" అంటూ నోటిమూలలను నాక్కుంటున్నాడు. అంతవరకు అధైర్యంగా వుండి, అన్న మాటలను ఆలకిస్తున్న లక్ష్మణుడు ఒక్కసారి విజృంభించి "అన్నా! ఆలోచనలకిప్పుడు అదను కాదు. ఈ దుర్మార్గుడు ఇక మనలను మ్రింగుతాడు. మహాబలవంతుడూ, భీమవపుష్మంతుడూ నోట పడిన మీదట చేసేది ఏమీలేదు. ముందే ప్రతిక్రియ చేయాలె. వీడు క్రూరుడైనా ప్రతీకార శక్తి లేనివాడు కావటం చేత చంపాల్సిన అవకాశం మంచి తప్పుతున్నాడు. వీడికి అన్నివిధాల ఆధారం ఈ హస్తాలు రెండూ. ఆ చేయి నీవూ, ఈ చేయి నేనూ ఒక్కసారే నరుకుదాం" అని చెప్పగానే రాముడు ఎడమ చేతినీ, సౌమిత్రి కుడిచేతినీ కరవాలంతో ఖండించారు. వెంటనే గిరి శిఖరం నుండి దొర్లిన గుండువలె కబంధుడు నేలపై పడ్డాడు.

ఇంతకాలం హస్తగతమైన పదార్థం అనుభవానికి రాకపోవటం ఎరుగని రాక్షసుడు ఆలోచించసాగాడు. గతిస్మృతులు గుర్తుకు వచ్చినై. ఇంతవరకు ఆకృతిలో అపారంగా వున్న హస్తాలు రెండూ ఏకకాలంలో సోదరుల చేత నరకబడటంతో క్రిందపడినప్పటి కబంధుని కాయం వల్ల కలిగిన ధ్వనికి భూమ్యాంతరాళాలు మార్మోగినై. సమయోచితమైన సౌమిత్రి తెలివికి రాముడు ఎంతగానో సంతోషించాడు. అతడు తన్ననుసరించి రాకపోతే కలిగే అనర్థాలు ఏ విధంగా పరిణమించేవో యని దీర్ఘ నిశ్వాసం విడిచాడు. ఇద్దరూ ఆ పడిన దానవుని పరీక్షగా చూచారు. ఇది మానవాకారమా? యంత్రాకారమా? కంఠంనుంచి పైభాగం అసలే లేదు. కాళ్ళు కూడా లేవు. ఎదురు రొమ్ముపై మొగం వుంది. కళ్ళు వున్నై. కోరలున్న నోరు వుంది. ఈ మొండానికి రెండు వేపులా పొడవైన, బలమైన చేతులున్నై. ఈ స్థితిలో కూడ ఈ ప్రాణి జీవిస్తున్నదంటే సృష్టి రహస్యం ఎంత దుర్గ్రాహ్యమైనదో! ఈ భూతం బ్రదకటానికి వీలుగా చూడటానికి కళ్ళు, ఆకర్షించటానికి చేతులూ, తింటానికీ, మాటలాడటానికి తగిన నోరూ. నోటిలో పడిన పదార్థం జీర్ణం కావటానికి గర్భకోశం బ్రహ్మ మేలు జోహార్లు చేశాడు. ఒకదాని ననుసరించి మరొకదాని సృజించే మానవునికే ఇంత అహంకారం వుంటే, అన్ని మూలపదార్థాలను భిన్న భిన్నంగా సృజియించి, ఎంత తెలిసినా ఇంకా తెలియదగిన రహస్యం ప్రకృతిలో కల్పించిన దైవానికి ఎంత అహంకారం వుండవచ్చు!" అని పరస్పరం దైవశక్తిని గూర్చి, మానవుని అల్పత్వాన్ని గూర్చి ఆలోచిస్తున్నారు.

## లక్ష్మణుడు కబంధునకు తమ సంగతి చెప్పుట

దోర్యుగనికృంతనుడైన కబంధుడు నేలపడి గతం స్మరించగానే రాకుమారుల చూచి భక్తి గౌరవాలు వుట్టిపడే పలుకులతో "అయ్యా! మీరెవరు? ఇక్కడికెందుకు వచ్చారు? ఈ ప్రదేశాన్ని గూర్చి ఇంతకు పూర్వం మీకెవ్వరూ చెప్పలేదా? బహుకాలంగా నాచేత ఆహరింపబడిన కారణంగా మానవ మృగ సంచారం శూన్యమైంది. నా స్థితి తెలిసిన రక్కసులు ఇటు

రారు వాళ్ళెంత మాయావులైనా, బలవంతులైనా, వరగర్వం గలవాళ్ళైనా నా చేతికి చిక్కితే అప్పటితో ఆయువు తీరినట్లే. నా ఆకలికి విచక్షణ లేదు. అందుకే వాళ్ళు ఇటు రారు. ఈవాడు నాకు విపరీతంగా ఆకలి వేసింది. తీక్షణంగా దిక్కులవంక చూచాను. మీరు జటాయువునకు అగ్ని సంస్కారం చేసి పయనించటం కనిపించింది నా బాహువుల కందేటట్లు లేరు. అందుకే మీరు పోయే దారిని క్రమంగా మారుస్తూ నా పరిసరాలకు దారి కల్పిస్తూ వచ్చాను. మీరిక ముందుకు వచ్చే అవకాశం లేకుండా అడవి కల్పించి నా రెండు చేతులు రెండు వైపుల చాచి అడవిని అదృశ్యం చేసి మిమ్మల్ని పట్టుకున్నాను. మీచేత నిగ్రహింప బడ్డాను. ఇది నా సంగతి. ఇక మీ విషయం దాచకుండా చెప్పండి" అని అడిగాడు.

ఆ మాటలు వింటున్న లక్ష్మణుడు "దానవా! మేము ఇక్ష్వాకులం. అయోధ్యా వాసులం. ఈ పూజ్యుని పేరు రాముడు. నాకు అన్న అవుతాడు. నా పేరు సౌమిత్రి మేము కాలవిపరీతం చేత దండకారణ్యంలో కొంతకాలం కాపురం వుండవలసిన అవసరంవచ్చింది. మా అన్న, వదిన, నేనూ కలిసి వచ్చాం పంచవటిలో ఆశ్రమం కల్పించుకొని అక్కడ వుంటున్నాం. ఎవడో రాక్షసుడు మేం లేని వేళ మా వదినను మాయచేసి దొంగిలించుకుని పోయాడు. ఆమె అన్వేషణ చేస్తూ వస్తున్నాం నీ సంగతి చెప్పావు కాని. ఈ కబంధాకారంతో పుట్టావా? మాయా రూపంతో లోక వంచన చేస్తూ, ప్రాణి హింస చేస్తున్నావా? అనృతం చెప్పక సత్యం చెప్పు" అని అన్నాడు. ఆ విధంగా ప్రశ్నించిన లక్ష్మణునికి ఇంద్రుని వాక్యాలు స్మరించి కబంధుడు తన గత గాథ క్లుప్తంగా చెప్పాడు

## కబంధుడు రామలక్ష్మణులకు తన కథ చెప్పుట

"మహాత్ములారా! మీకు నా హృదయ పూర్వక స్వాగతం. నా భాగ్యం కొద్దీ ఇంతకాలానికి నన్ను వెదుకుతుంటూ మీరే వచ్చారు. నాకు ముక్తి కలిగించారు. నాకీ వికార రూపం, అవినయ ప్రవర్తనతో నేనే కొని తెచ్చుకున్నాను లోకంలో సుందరులుగ చెప్పతగినవారికంటే అధిక మైన సుందరాకారం కలవాణ్ణి. నా ఆకృతికి అందరూ మెచ్చుకొని శ్లాఘించే

వారు. ఆ కారణం చేత నాకు గర్వం అధికమైంది. నేను అప్పుడపుడు ఈ వికృత రూపంతో మునులనూ, ఖేచరులనూ భయపెట్టి బాధిస్తూ ఉండే వాణ్ణి. వాళ్ళు నేను చేసే చేష్టలకు అసహ్యించుకుని దూషిస్తూ తొలగిపోయే వారు. ఒకనాడు "స్థూలశిరు"డనే మునీశ్వరుణ్ణి పట్టుకొని బాధించాను. ఆ శాపాయుధుడు, అంతకుని వలె ఆగ్రహించి ఏ రూపంతో నన్ను బెదిరించావో ఆ రూపమే నీకు స్థిరంగా వుంటుందని శపించాడు. ఆ శాపంతో గర్వం వదలి కాళ్ళపై పడి వేడుకున్నాను. ఆ సంయమి కనికరించి అరణ్య వాసార్థం వచ్చిన రాముడు నీ కర ద్వయాన్ని ఖండించి నిన్ను దహనం చేస్తే నీకు పూర్వ రూపం వస్తుందని శాపావసానం తెలిపాడు. అంతకు పూర్వం ఘోర తపస్సు చేసి విధాతతో చావులేని వరం పొంది వుండటం ముని శాపం వల్ల దానవుడుగా మారటం కారణంగా అహంకారంతో అమరేంద్రుణ్ణి యుద్ధానికి పిల్చాను. నా దురహంకారానికి సహించని వాసవుడు వజ్రాయుధంతో శిరఃఖండనం చేసి కడుపులోకి అణిచాడు. ఆ బాధ పడలేక చంపమని వేడుకున్నాను కాని, విధాత ఇచ్చిన వరాన్ని తలచి నన్ను చంపలేదు. తింటానికి నోరు లేక, చూడటానికి కండ్లు లేక నేనెలా బ్రతికేది? అని ప్రార్థిస్తే. ఆమడ పొడవుకల చేతులూ. ఉదరంలో నే వదనం, కోరలూ ఉండేట్లు చేసి, రామలక్ష్మణులు అరణ్యవాస సమయంలో నీ చేతికి చిక్కుతారు అప్పుడు తమ విముక్తికయి రెండుచేతులూ నరుకుతారు అనంతరం నీకు స్వస్థానం లభిస్తుందని అనుగ్రహించి వెళ్ళాడు. అప్పటినుంచి ఇప్పటివరకు ఈ ఆమడ దూరం అడవిలో ఏ ప్రాణి కనుపించినా బంధించి తింటున్నాను ఎప్పటికయినా ఆ ముని వాక్యానుసారం మీరు వస్తారని ఆశతో వున్నాను. ఆ దృష్టితోనే మిమ్ముల బంధించాను. ఫలితం పొందాను.

ఆ ముని చెప్పిన రామలక్ష్మణులుమీరే మహాత్ములారా! మిమ్ముల సమరం చేసి జయించే శక్తి ఈ లోకంలో ఇంతవరకు లేదు. ఇంక ముందు రాదు. రామా! కారుణ్యధామా! కృపాబ్ధిసోమా! మీ చరిత్రం విన్నాను. మీకు మరొక విధంగా సాయపడలేను, కాని, మతిసాచివ్యం చేసి మిత్రుణ్ణి సంపాదించి పెడతాను. నాకు అగ్ని సంస్కారం చేయండి" అని ప్రార్థించెను.

రాముడు, "పూజ్యుడా! నీవు కోరినట్లే చేస్తాం విన్నావు కదా మేం పంచవటిలో లేనప్పుడు నా భార్యను రావణుడు అపహరించి తీసుకుని వెళ్ళాడని. అతని పేరొక్కటి మాత్రమే మాకు తెలుసు అతని శౌర్యం కానీ, రూపం కానీ, వుండే ప్రదేశం కానీ తెలియదు నీకు తెలిస్తే ఆ వివరం చెప్పి పుణ్యం కట్టుకో మతి చెడి లక్ష్యం లేకుండా అడవుల వెంట తిరిగే తీవ్ర దుఃఖితులమైన మాకు దయతో ఆ దుర్మతి ఆనుపానులు తెలిపి శోకసాగరాన్ని తరింపచేయి. కుంజరములచేత కూల్చబడి ఎండిన కట్టెలు తెచ్చి బిలంలో పేర్చి నిన్ను దహనం చేస్తాం నా మాట విశ్వసించి మాకా విషయం చెప్పు"మని అర్థించాడు. "రామా! నీ మాట విశ్వసించలేనట్టి నీచుణ్ణి కాను. కండకావరంతో తెచ్చుకున్న ఈ వికార రూపంతో నా తెలివి అంతా నశించింది. అందుచేత మీరడిగిన విషయం చెప్పలేకుండా వున్నాను మీరు నన్ను వెంటనే దహిస్తే నా స్వరూపం నాకు వస్తుంది. నా శక్తులన్నీ తిరిగి నాలో ప్రవేశిస్తై. అప్పుడు తప్పక చెప్తాను తడవుకాకుండా నన్ను ఇప్పుడే దహనం చేయండి" అని కోరాడు కబంధుడు. మళ్ళీ "రామా! మీరు సూర్యాస్తమయం కాకుండా నన్ను దహించండి. నాకు తెలిసినదంతా చెప్తాను. అందుకు సాయపడగల మిత్రుణ్ణి కూడా మీకు లభించేట్లు చేస్తాము అతడు సర్వవిధాలా మీకు తగినవాడు. అతడెరుగని చోటు మూడు లోకాలల్లోనూ లేదు. అతనికి తెలియని వీరులు శూరులూ, శక్తి సంపన్నులూ లేరు అతడు సహజంగా మహా బలవంతుడు. అన్నమాట చెల్లించుకునే సత్యవ్రతుడు నాకీ వుపకారం చేసిన మీకు తప్పక అతనిచే మహోపకారం పొందేట్లు చేస్తాము" అని తొందరించాడు.

## కబంధుడు పూర్వరూపం పొందుట

కృతజ్ఞతాభావంతో కబంధుడు చెప్పిన మాటలు విని రామలక్ష్మణులు విశ్వసించి, సమీపంలోవున్న వటవృక్షం కోటరంలో కొన్ని ఎండుకట్టెలు పేర్చి, ఆ చితిపై కబంధుని కాయం ఎక్కించి, పైన మరికొన్ని కట్టెలు పరిచారు. చెట్లకొమ్మల రాపిడికి పుట్టినట్టి అగ్నికణాలు రాలి ఎండుటాకుల్లో పడి గాలిచే ప్రక్కనున్న పొదలకు అంటుకుని అవి దహించగా

పండు వల్లారి పక్కపక్కన ఒరిగిపోయిన పెద్దకొరువులను రెండు సౌమిత్రి సంపాదించి, తాను పేర్చిన కాష్ఠానికి అంటించి మంటలమాలు కొల్పారు ఆ మంటలు క్రమంగా విజృంభించి కబంధుని కాయం కాల్చ సాగాయి. ఆ రాక్షసుడు ఇంత మంటల్లోనూ దహింపబడుతూకూడా బాధపడలేదు. అతనికి చావులేని వరం వుంది. బాహ్యశరీరం దగ్ధం అవుతున్నకొద్దీ మార్పు పొందటం జరుగుతూంది. కళేబరం సపూర్ణంగా దహనంకాగానే ఆ మంటల మధ్యలోనుండి ఒక దివ్యతేజం ఆకాశానికి వుద్గమించింది. ఆ తేజం బంగారపుటంచుల పట్టుపీతాంబరాలు ధరించి, విస్ఫుర్మండలమండిత కర్ణకుండలాలతో, వెండితీగల వలె ప్రకాశించే యజ్ఞోపవీతంతో రతనాలు తాపిన హేమకిరీటంతో జిలుగుపనితనం గలిగిన భుజపురి కంకణాంగుళీకాదులతో, విచర్చిత కంతుజయంత వసంతాకృతితో, హంసలుమోస్తున్న విమానంలో గంధర్వాకృతినంది ప్రవేశించింది ఆ రూపాన్ని చూసి కబంధుడు చెప్పిన సౌందర్యరూపం ఎటువంటిదో తెలుసుకుని సోదరులు ముగ్ధులయ్యారు.

పరోపకారులూ, సత్యవ్రతులూ, క్షమాశీలురూ, పవిత్రులు అయిన రామలక్ష్మణుల అగ్ని సంస్కారంతో అపహృతశాపుడైన కబంధుడు అంతరిక్షంలో విమానాన్ని అధిరోహించి క్రిందికి చేరువగావచ్చి పిల్చి, "రామా! దుష్టక్షాత్రవవిరామా! భవసంతరణనామా! సంతృప్త వరసుర మునిస్తోమా! నిన్ను వర్ణించటానికి వాక్కులులేవు నీ అవతారప్రయోజనం అజ్ఞలోకానికి అర్థంకాదు. నీ కృపవల్ల నా శాపంపోయి స్వస్వరూపం వచ్చింది. ఇకముందు అహంకారం వదలి నిరంతరం నిన్ను స్మరించుకుంటూ సత్కర్మలు చేస్తాను. నీ అర్ధాంగిని అపహరించిందెవరో. అతని వృత్తాంతమేమిటో నాకు అవగతమైంది. కాని దేవ రహస్యం కావటంచేత నేను వివరించరాదు. నేను ముందిచ్చిన మాట ప్రకారం నీకు శ్రమలేకుండా నీ సహచరిని పుష్పంలో పెట్టి తెచ్చి నీ అనుగ్రహానికి పాత్రుడయ్యే యోగ్యుణ్ణి నీకు పరిచయంచేస్తాను. నేచెప్పవలసింది, చేయవలసింది అతనే నిర్వహిస్తాడు. పురుషోత్తమా! లోకజ్ఞులైన విజ్ఞులు కార్యనిర్వహణం చేసేటప్పుడు సదుపాయజ్ఞులై చేస్తారు. విద్యుంకయ్యం సమానప్రతిపత్తిలో జరగాలి."

## కబంధుడు సుగ్రీవునితో మైత్రిచేసుకోమని రామునికిచెప్పుట

"నీవు ఎంతమహోన్నతుడవైనా, విధివైపరీత్యంచేత భార్యావియోగ దుఃఖంలో మునిగివున్నావు ఈ దశలో మైత్రిచేసుకొనే వ్యక్తి కూడ సమానస్థాయిలో వుండాలి ఎంత ఆలోచించించినా ఇంతకంటే వేరే మార్గం స్ఫురించటంలేదు కనుక ఆ మిత్రుణ్ణిగురించి కొంత వివరిస్తాను. పంపాసరస్సుకు చేరువగా ఋష్యమూకం అనే పర్వతంవుంది ఆ పర్వతం ఆశ్రయంగా చేసుకుని నమ్మకమైన నలుగురు మంత్రులు సేవిస్తూంటగా ఆతడు అజ్ఞాతవాసం చేస్తున్నాడు వానరజాతివాడైనా విశ్వాసపాత్రుడు. పేరు సుగ్రీవుడు. ఆతడు బలవంతుడైన అన్నచే రాజ్యంనుంచి గెంటి వేయబడ్డాడు. శక్తిమంతుల సహాయంకోసం అన్వేషణలో వున్నాడు. మీతో తప్పక చెలిమిచేస్తాడు. నీవు అగ్నిసాక్షిగా ప్రతిజ్ఞచేయి ఆతని విశ్వాసంకోసం కోరితే ఆపని నెరవేర్చు. మీరు తప్పక ఆతని కోర్కె తీర్చగలరు. ఆతడు వీర్యవంతుడూ, బుద్ధిమంతుడూ, సత్యసంధుడూ, వుచితజ్ఞుడూ, వ్యవహర్త, రహస్యవేదీ, కపినాయకుడూ, కామరూపుడూ. నీవు ఆతనికోరిక తీర్చినా, తీర్చకున్నా, నీ భార్యాన్వేషణం తప్పకచేస్తాడు. రామా! దుఃఖపడకు ఎవరికి విధివిధానం దాటరానిది కాలం దురతిక్రమం.

ఆతడు ఋక్షరజుని ఆత్మసంజాతుడు. సూర్యునకు ఔరస సంభవుడు పంపాసరోవరప్రాంతంలోవున్నాడు. నీవు ఆయుధాలను అంటి, అగ్నిసాక్షిగా ప్రతినచేసి నెయ్యం సంపాదించు. రాక్షసుల గుటుకుటు లన్నీ ఆతనికి తెలుసు. సూర్యకిరణాలు ప్రవేశించరానిచోట్ల కూడా ప్రవేశించి అన్వేషణచేయగల శక్తిమంతులు కపులు కోట్లకొలది ఆతని అధీనంలో వున్నారు. ఆ కపులను పంపి వెదకించి సీతవార్త తెప్పించి నీకు శ్రవణానందం చేకూరుస్తాడు. నీ వియోగంతో కుములుతున్న నీ అర్ధాంగి రావణరక్షిత కావటంచేత అక్కడికిపోయేశక్తి ఆతని సహచరులకు కాక ఇంకెవరికీలేదు అక్కడలేకపోతే, పాతాళంలోవున్నా, మేరు శిఖరంలోవున్నా, శత్రువుల జయించి నీ భార్యను నీకు అన్నమాట ప్రకారం అప్పగిస్తాడు. ఆతని మైత్రీధనం నీకు సీతావార్త ప్రసాధనం.

## కబంధుడు రామునకు పంపామార్గం తెలుపుట

మీరు శ్రమపడకుండా పంపకు మార్గంచెబుతాను. వినండి. ఇక్కడ మంచి ప్రతీచీదిశగా వెళ్ళండి ఈ త్రోవంతా మారేళ్ళు, నేరేళ్ళు, మంచి గన్నేర్లు, గోగులు, పనసలు, రేగులు, రావులు, మావులు, క్రోవులు, ముంతమామిళ్ళు మొదలైన వృక్షాలు వున్నై. అన్నీ ఫలవృక్ష కల్పితాలు. అక్కడక్కడ నిర్మలనీరం కలిగి, జలవిహంగాలు కలిగి, కలువలూ, తామరలూ కలిగి మనోజ్ఞమైన సరోవరాలున్నై. చెట్లెక్కి కావలసిన ఫలాలుకోసుకుని కడుపార భక్షించి దాహశాంతి తీర్చుకుంటూ వెళ్ళండి. ఆ దారి నందనవనాన్ని క్రిందుచేసే సుందరవనాన్ని చేరుస్తుంది. ఉత్తర కురుభూములకు దీటైన ఆ వనం అన్ని ఋతువుల్లో కొరతలేకుండా లభించే ఫలాలతోనూ, పూలతోనూ ఆహ్లాదకరంగా వుంటుంది పక్వఫల భారనతమైన ఆ వృక్షాలు ధరణీధర, ధారాధరవార రమణీయంగా శ్రీదేవివానంగా మీకు స్వాగతం ఇచ్చి మార్గాయాసాన్ని మరపింపచేస్తుంది. అక్కడ విశ్రాంతివంది ఆపై చిన్నచిన్న కొండవరుసల వెంట పోతూ, ఆ కొండలపైవున్న విచిత్రాలను చూస్తూ, ఆ పర్వతపంక్తి అధిగమించండి ఆ ప్రదేశమంతా నిర్భయంగా వుంటుంది అక్కడి వనసత్వాలు మిక్కిలి సాధువులు. అపకారబుద్ధి ఎరుగవు. మీ పదసంచారం చేత ఆ ప్రదేశమంతా ఆనందతుందిలం అవుతుంది. అక్కడి చల్లనిగాలి, ఆ పూవులతావులు మీ శ్రమపోగొట్టి, మీ విహారం సాంద్రోదలై

## కబంధుడు రామునకు పంపను వర్ణించిచెప్పుట

అనంతరం విశాలమైన మార్గంలో ప్రయాణించండి. క్రోశద్వయ దూరానికే మీకు హాయిగొలిపే మారుతం పంపాజల లఘుతరంగ డోలికల పైన వుయ్యాలలూగి. అందున్న పుష్పపరిమళాన్ని గ్రహించి మీకు అభిముఖంగా అరుదెంచి ఖగకుల కలకూజితంతో ఆహ్వానిస్తుంది. ఆ శీతలవాత సంస్పర్శతో విగతశ్రములై, ఆనందధాములై నడవండి ఆ దారి ఉన్నత ప్రదేశానికి చేరుస్తుంది. అచట నిల్చి సరోవరసౌందర్యం తిలకించండి. సారసరాజమరాళ రథాంగక కామద్వయములతో. శైవలవన్నీరములతో,

పికతారలరాజిత నిర్మలతరువర తీరములతో, నవసారసకైరవశీర్ష సుగంధిలఘుంఘుమరవ ముఖరిత వాఃపూరములతో, అపూర్వముదావహంగా గోచరిస్తుంది. అందలి వనవాసులైన పక్షులూ, జలవాసులైన విహంగాలూ వధం అంటే ఏమిటో ఇంతవరకూ ఎరుగవు. వేటగాళ్ళు వచ్చినా నదురుబెదురు లేకుండా సంచరిస్తుంటై. వెన్నముద్దలు చేసిపెట్టినట్లు కన్నులపండువుచేస్తుంటై. ఆ సరస్సులో గండుమీలు, చారమీలు, శొయ్యలు, కొర్రలు, బొమ్మిడాలు, వాలుగలు, ముండ్లులేని చేపలు ఏకాలం పుష్కలంగా వుంటాయి మీకిష్టమైన వాటిని బాణాలతో కొట్టి, చర్మం ఒలిచి, రెక్కలుడులిచి, ఇనుపకాడలు గ్రుచ్చి అగ్నిలో పక్వంచేసి, చిక్కగావున్న వాటిముండ్లు తీసి, తనివితీర భుజించండి పద్మపత్రాల్లో నీరప్రతిబింబించే నిర్మలజలం త్రాగి దప్పితీర్చుకొనండి ఆ సరోవరంలో నీరు త్రాగటానికి పెద్దపులులు, వృకాలు, ఎలుగులు రొప్పుకుంటూ వస్తై. వాటిని చూచి సంతోషించండి. కాని చంపవద్దు ఈ విధంగా మీకు పంపాసరోవరం ఆనందహేతువు అవుతుంది సూర్యాస్తమయ సమయంలో సోభాయమానంగావుండే వృక్షచ్ఛాయల్లో విహరంచేస్తూ విచిత్రమైన ప్రకృతిని విలోకిస్తారు.

## కబంధుడు శబరికి దర్శనమిచ్చిపొమ్మని చెప్పుట

విరితమ్ములూ, విచ్చినకలువలూ, పూచిన మాలతీమంజరాలూ, సీతాకోకచిలుకల్లాగా ఎంతో ముచ్చట కూరుస్తై. ఆ పువ్వులు ఎవ్వరూ ముడువరు. అవి వాడవు తొడిమలనుంచి వూడవు మతంగమహర్షి తపంచేసేటప్పుడు శిష్యగణం వన్యాలు తీసుకురావటంకోసం వనంలో తిరుగుతుంటే ఆ మహాత్ముల శరీరంనుంచి స్వేదజలం భూమిపై పడగా ఆ ప్రభావంచేతనే ఈ వృక్షలతామలకు అటువంటి శక్తివచ్చింది వారు ఈ ప్రాంతం విడిచిపోయినా ఆ మహత్తు వారి చిహ్నంగా ఇక్కడనిల్చింది. చిరంజీవిని శ్రమణీమణి, ధర్మచరిత్రా తపోరాశి శబరి నీ దర్శనంచేసి స్వర్గధామం చేరుకుంటుంది ఆమెవున్న ఆశ్రమోపాంత భూమి అంతా భయంకరసర్పాలకు ఆలవాలం. అయినా మతంగమహర్షి తపోబల

కారణంగా ఆశ్రమప్రాంతంలో ప్రవేశించవు పంపాతీరానికి పశ్చిమంగా కొంతదవ్వులో గూఢంగా చెట్లమధ్యలో శబరి ఆశ్రమం వుంది. అందులో ఆ మహిళామణి తపస్సుచేసుకుంటూంది. బృందారకవన సన్నిభంబై, నందనవన సంకాశమై, నూత్నగరుత్ బృందాకులమై ఆ ప్రదేశం విన్ను అలరిస్తుంది. శ్రమ అనుకోక ఆమెను కనుగొని అనుగ్రహించు. ఆ తర్వాత పంపాసరస్సు సమీపంగావెళ్ళి అక్కడ తగిన ప్రదేశంలో వాసంచేయండి. దానికి దగ్గరగానే ఋశ్యమూక పర్వతం వుంది. అక్కడ మదమాతంగాలు గుంపులుగుంపులుగా తిరుగుతుంటై. కొత్తవారికి ఆ కొండ ఎక్కటం కూడదు. పొరపాటున మీ అంతట మీరు ఆ ప్రయత్నం చేయవద్దు ఆ కొండపై విద్రించినవారికి కలలో కానవచ్చిన పదార్థం ఇంటిలో లభిస్తుంది. పాపులు ఆ పర్వతంపైకి పోలేరు. పోయినిద్రిస్తే, రాక్షసులు వాళ్ళను ప్రహరించి త్రోసివేస్తారు. ఈ పర్వతనిర్మాణంలోనే బ్రహ్మ ఆ విధంగా కట్టడిచేశాడు. మతంగా శ్రమంలో కానీ, పంపాతీరంలో కానీ, మీకిష్టమైనచోట నివసించండి. పూర్వంనుంచీ మతంగాలతో ఆ చోటంతా సమ్మర్దంగా వుండటంచేత మహర్షిఆశ్రమానికీ అయనకూ మతంగశబ్దం చేర్చి పలుకబడింది. ఇప్పటికీ మతంగాశ్రమం అనే అంటారు.

ఎలుగులు, పులులు, ఇంద్రనీలచ్ఛాయలో వుండి మీకు చూడటానికి ఆశక్తికరంగా వుంటై. ఋశ్యమూక పర్వతంలో గొప్ప గుహవుంది. ఆ గుహ ముఖద్వారం పెద్దరాతిచే మూయబడివుంటుంది. దానిని తొలగించి ప్రవేశించే ప్రయత్నం చేయవద్దు ఆ గుహకు తూర్పుభాగంలో ద్వారం వుంది. దానికిముందు నిర్మలోదకంతో నిండిన పెద్దరాతిగుంటవుంది. ఆ దొనచుట్టూ చెట్లూ, వేళ్ళూవుంటై. ఆ గహ్వరంలోనే సుగ్రీవుడు మంత్రిచతుష్టయంతో వుంటాడు. మీరా పరిసరాలల్లో సంచరిస్తూవుండండి. అప్పుడప్పుడు అతడు గిరిశిఖరంపైకి వస్తాడు. అటవి దృష్టిపథంలో పడగానే అతడేవచ్చి మిమ్ములను సత్కరించి కలుసుకుంటాడు. పుణ్య మూర్తులారా! మీకు చెప్పవలసిందంతా చెప్పాను. త్వరలో మీకు శుభం

చేకూరుతుంది. నేను చెప్పినవి మరచిపోకండి. "శీఘ్రమేవ మిత్రప్రాప్తి రస్తు" నాకు అనుజ్ఞ ఇస్తే స్వస్థానానికి వెళ్ళుతాను" అని అర్థించాడు. కృతజ్ఞతాసూచకంగా భవిష్యత్కార్యాన్ని బలంగా వివరించి మార్గం చూపిన కబంధుణ్ణి సోదరులు కొనియాడి సెలవిచ్చారు. వెంటనే "దనుజాతుడు" (కబంధుడు) విమానంతో వెళ్ళిపోయాడు.

## రామలక్ష్మణులు శబరిని చూచుట

ప్రమాదకరంగా ప్రారంభమై, ప్రమోదకారణంగా పర్యవసించిన కబంధకథను మననంచేస్తూ, ఆతడు వివరించిన విశాలమార్గంగుండా పడమరదిశకు ప్రయాణంసాగించారు. అస్తమయంకాగానే ఆనాటికి ప్రయాణం ఆపుకుని స్నాతులై సంధ్యాహ్నికాలు నవరించి మధుర ఫలాలను సేకరించి క్షున్నివారణంచేసుకుని సమతలప్రదేశంలో పర్ణశయ్యపై పవళించారు. భాస్కరోదయంకాగానే నియతకార్యాలు నిర్వర్తించుకుని ఉన్నతప్రదేశం చేరుకున్నారు. పంపాసరం దృగ్గోచరమయింది. ఆ సరోవరానికి పడమటిదిశగా ప్రయాణించి శబరివున్న ఆశ్రమాన్ని సందర్శించారు. ఆ ఆశ్రమవాతావరణం రాముని శోకాన్ని అపహరించింది. లోనికి ప్రవేశించగానే పండి ఎండిరాలిన ఒగుడాకువలె వృద్ధురాలై వున్న శబరిలేచి వారి రెండుపాదాలకు శిరస్సుతాకగా మ్రొక్కింది. అర్ఘ్యం, పాద్యం, ఆసనం సమర్పించింది. కృతాంజలియై నిలుచుంది. రాముడు ఆదరం పుట్టిపడుతూండగా "అవ్వా! వృద్ధురాలవు. నిలుచున్నావెందుకు? నీవూ ఆసనం స్వీకరించు. నీ తపోవ్రతాలు నిర్విఘ్నంగా కొనసాగుతున్నై కదా? ఆగ్రహంలోనూ, ఆహారంలోనూ నియమంపాటించుతున్నావు కదా? నీ గురుసపర్యలకు కొదువలేదు కదా? సత్ఫలితాలు పొందుతున్నావా? తల్లీ! నీవంటి తపోధనులు, శీలవతులు వుండటంచేతనే బాహ్యకర్మోన్ముఖంగా పరువెత్తి పతనమయ్యే జీవకోటికి తరుణోపాయం లభిస్తుంది. నీ అంతకాలం మేం జీవిస్తామా? ఇంత వృద్ధాప్యంలో కూడా సత్కర్మపరతంత్రవై, గుర్వాదేశాన్ని సడలకుండా పాటిస్తున్నావంటే సామాన్యులకు సాధ్యంఅయ్యేదేనా? నీ ప్రశాంత దివ్య

మూర్తిని దర్శించటంతోటే నాలోవున్న శోకాగ్నిచల్లారిపోయింది" అని వినయవిధేయతతో అడిగారు. "రామచంద్రా! ఉపనిషదంతంలో తెలియతగిన నీవు, జ్ఞానచక్షువులతో చూడతగిన నీవు, మహర్షిమనోంతర్వర్తివగునీవు, కేవలం గురుపదసేవకురాలను, సామాన్యనను, నన్ను వెతుకుకుంటూ వచ్చింది గాక, నన్ను పెద్దపెద్దమాటలతో పెద్దదాన్ని చేస్తున్నావు. అవును. ఇది నీ స్వభావమే. పత్ర పుష్ప ఫల తోయాలకే గజారోహణం చేసినంత సంతోషం పొందుతావు. నీకు భక్తికన్న ప్రియమైంది లేదు. ఇప్పటికి కదా నా గురుశుశ్రూషాఫలం అనుభవానికి వచ్చింది. నా వ్రతతపో నియమాలు ఇప్పుడుకదా సిద్ధించినై. ఇప్పుడు కదా వ్యర్థమాన జన్మం ఎత్తినందుకు సార్థక్యం సమకూరింది. ఇక నా స్వర్గారోహణానికి ఆటంకం తీరింది. తండ్రీ! నేనెంత ధన్యాత్మురాలిని! కళ్ళారా నీ కళ్యాణమూర్తిని కనుగొన్నాను. మనసారా నీతో మాట్లాడాను. మధురాతిమధురమంజులాలైన నీ మాటలు చెవులార విన్నాను. నేటికి నీ దయార్ద్రదృష్టితో విహతపాతకనైనాను. అక్షయలోక సామ్రాజ్యావాసం అందుకున్నాను. ఇంతకాలం వేచి కాచివున్నందుకు నిన్ను చూసుకున్నాను.

నా గురుదేవులు ఊర్ధ్వలోకగాములవుతూ నన్ను పిలిచి "చిత్రకూటంలో మీరున్నారనీ, కారణాంతరంచేత తమ్మునితో కలిసి నీవు ఇక్కడికి వస్తావనీ, నిన్ను సేవించిన అనంతరం బాహ్యశరీరాన్ని పరిత్యజించి దివ్యశరీరంతో దేవలోకం చేరమనీ ఆనతిచ్చారు. రామప్రభూ! అప్పటినుంచి నీకోసం వనమంతా తిరుగుతూ మంచిమంచి ఫలాలు సేకరించి వుంచాను. ఆర్తవశంవదుడవైన నీవు ఆరగించి అనుగ్రహించు" అని శబరి ఫలాలను పర్ణాలలో తెచ్చివుంచింది. "తల్లీ! శబరీ! నీవు గాదమ్మా ధన్యవు. నిజంగా నేను ధన్యుణ్ణి. ఎంతకాలానికి మా తల్లివలె మాటాడి ఆదరణతో ఆహారం అందించే అవకాశాన్ని పొందాను. నీకు తృప్తికల్పించిన పండ్లు నాకేకాదు ముక్కోటి దేవతలకూ తృప్తికలిగించినై. తప్పక గ్రహిస్తాం. ఇంతకంటే గ్రహించదగిన పదార్థాలేమున్నై! అమ్మా! నేనొక్కటి అడుగుతాను. అది

రహస్యం కాకపోతే చెప్పు. నిన్ను గురించీ, నీ గురువుల గురించీ నాకు కబంధుడు శాపవిముక్తుడై చెప్పాడు. ఆ మహాత్ముని మహత్వం అప్పటినుంచి తెలుసుకోవాలని కుతూహలంగా వుంది. వారి ఆశ్రమం లోని విశేషాలను వివరించగలవా?" అని రాముడడిగాడు.

## రామలక్ష్మణులకు శబరి మతంగాశ్రమం వింతలు చూపుట

శబరి ఆ పల్కులకు ఆనందించి, "నాయనలారా! నా వెంట రండి. ఆ సురవాంఛారహితంబై ఆ మహాత్ముని అద్భుత తపశ్శక్తి ఎంతటిదో చూతురుగాని. ఇదే ఘనాఘనతుల్య మృగ పక్షి సంకులమైన మా గురుదేవులుండే తపోవనం. ఇక్కడ మంత్రశక్తితో తీర్థాలు కల్పించారు. ఈ పడమరగా వున్న వేదిలో గురుదేవులు వృద్ధతలో వణుకుతున్న చేతులతో అగ్నికార్యాలు తీర్చేవారు. ఈ సప్తకుండాలు నిరంతరం సమిధలు లేకుండా సప్తఋషులవలె ప్రజ్వరిల్లుతూ వారి తపఃఫలంగా వుండేవి. చివరిరోజుల్లో నిత్యప్రవాసాలతో నిర్గతసత్త్వులై నడవలేక స్నానార్థం చింతన చేస్తుంటే సప్తసాగరాలు ఇక్కడికే చనుదెంచినై. ఈ ఏడు పాయలూ అవే. అందులో వారు స్నానం చేసి వల్కపరిధానాలు పిండి ఈ కొమ్మల్లో ఆరవేస్తే ఇప్పటికీ ఆరకుండా అలాగేవున్నై. దేవపూజ నిమిత్తం అర్పనచేస్తూ వుంచినపూలు వాసనపోయి వాడినవేమోచూడండి. మా గురువులెంతటి తపస్సంపన్నులో చూచారు కదా. ఇక నా ఆశ్రమానికి వచ్చి ఆతిథ్యం స్వీకరించండి" అంటూ వెంటకొనివచ్చి సకలోపచారాలు ముగించి "రామచంద్రా! వినతగినవాటిని విన్నావు. కనతగిన వాటిని కన్నావు ఇక నీవు అనుజ్ఞఇస్తే మా గురుదేవుల చరణసన్నిధికి చేరుకుంటాను." అని అన్నది.

"అవ్వా! నీ భక్తియోగాలు ఉపమానరహితాలు. నీవు నీ గురుదేవులపైన నిల్పినదృష్టి సృష్టికే పుష్టి. ఆ గురువులకు తగిన శిష్యురాలవు. నీవంటి ఉత్తమురాలు శిష్యురాలు కావటం మహర్షి కీర్తికి మకుటం. నా హృదయబాధ చూడలేక, తీరటానికే కబంధుడు నిన్ను

చూచిపొమ్మన్నారు. సముద్రంలో అలలవలె ఎడతెగని సీతావియోగ భావపరంపర శమించింది. సజ్జనసంభాషణం, సజ్జనదర్శనం ఎప్పుడూ వ్యర్థంకావు మా భక్తిపూర్వక కుసుమాంజలిని అర్పించామని గురు దేవులతో విన్నవించు నీ సపర్యలనంది సంతోషించాం ఇంక నీ కోరికప్రకారం గురుసన్నిధానానికి వెళ్ళవచ్చు. నీ రాకకు ఊర్ధ్వలోక వాసులు ఉత్సాహంగా నిరీక్షిస్తున్నారు గాక" అని రాముడు అనతి చ్చారు ఆ క్షణమే శబరి ఆసీనయై, ఆత్మసమాధి అగ్నిహోత్రాన్ని కల్పించి, కృష్ణాజినచేలం, ఆయనజటాన్వితం అయిన భౌతికకాయాన్ని అందులో హుతంచేసి దివ్యరూపంతో గురుసన్నిధి చేరుకుంది.

## రామలక్ష్మణులు పంపాతీరం చేరుట

తామిదివరకు సందర్శించిన శరభంగ సుతీక్ష్ణుల తపస్సం పదమూ మతంగమహర్షి తపస్సంపదమూ, శబరి తపస్సంపదనూ పోల్చి చూచి శబరి విదేహముక్తికూడ నిస్వార్థమైన గురుచరణ సేవకేకావటం ప్రధమగణ్యంగా రామలక్ష్మణులు భావించారు ఆమె నిర్గమనాంతరం ఆశ్రమాన్ని వీడి పంపాకాసారంవైపు పయనించసాగారు "ఓహో! మతంగమహర్షి ఎంత తపస్సంపన్నుడు! ఇచట సహజవైరంగల మృగములు కూడ సాదువులై సంచరిస్తున్నై. సముద్రసప్తకాన్ని సన్నిధికి రప్పించుకుని స్నానం చేసిన యాతడెంత మహాత్ముడు! ఆయన కరసంస్పర్శలో పవిత్రమైన ఆ పాయల్లో పైత్రతర్పణం శుభోదర్కంగా తీర్చాము హాయిని తీరింది. చిత్తం సంతుష్టిపొందింది. ఇక సౌఖ్యం లభించాలి అందుకు మిత్రుని కూర్చిపోదాం ఆ పర్వతం కూడా దూరం లేదు. ముందు పంపచేరి అక్కడ వనశోభ చూచు కుని విశ్రాంతి పొంది ఋశ్యమూకానికి పోదాం. అతని సహాయం చేతనే సీతాన్వేషణ కార్యం తీరాలి" అని రాముడనగానే, సౌమిత్రి "అన్నా! నా మనస్సు కూడా ఆ విషయంలో తిరుగుతున్నది. ఆలస్యం కాకుండా పంపకు పోదాం పద" అని తొందరించగా ఇరువురు కలిసి అక్కడికి నడువసాగారు.

71166

నానాలతాకీర్ణమై, నవ్యభూరుహపూర్ణమై, మధుర జల దాహ దీర్ఘమై, నిష్యంద మకరంద నీరంధ్రపంకజ కల్హారమై, కలకూజిత జలవిహంగవారమై, పుండరీక కైరవ లలితరాజీ వశమై వికసిత బహువిధ కుసుమాఢ్యమైన పంపాసరోవరాన్ని దూరంనుంచి దర్శించారు. తమదారికి దగ్గరగావున్న మతంగసరస్సులో స్నానం పానం పూర్తి కావించుకుని, నాగకేసర పున్నాగకరవీర సప్తపర్ణతిలక బీజ ఆమ్ర భాండీరాది మనోహర వృక్షవిరాజితమై, బహువిధభూషణభూషిత వలె నున్న పంపాతీరాన్ని చేరారు. కిరణాటికాకోయష్టికార్జున హారియైన వనతలంలో ప్రవేశించి "సోదరా! ఇది పంపాసరస్సు. ఇది దాని తీరప్రదేశం ఆ కనుపించేదే ఋశ్యమూకం. మనం ఆ పర్వతానికి చేరువగా వుండేచోటు పరికించి అక్కడ మన నివాసం ఏర్పాటు చేసుకుందాం. మనం వుదయం, సాయంకాలం ఆహారసంపాదనకు అటు ఇటు తిరుగుతుండగా అదృష్టం కలిసివచ్చి ఆ మిత్రుడు మనకు కనుపిస్తాడు. అతని దర్శనం కాగానే నీవు వెళ్ళి అతనితో కలిసి మాటలాడు. నేనై నా కష్టస్థితి వివరించలేను. ఇతరుల హృదయం తెలియకుండా మనం విషయం చెప్పి వెలితి పడటం భావ్యంకాదు. కబంధుడు చెప్పినట్లు అతడు కూడ నావలె ఆపదలో వున్నందువ తప్పక మనతో చెలిమి చేయవచ్చు. కాదా? మన మొగాన విధి లిఖించిన విధానం వుండనే వున్నది. కొత్తయత్నం చేయబోతూ సంకల్పంలో వికల్పం వుంచుకొనటం కార్యహానికి కారణం అవుతుంది. అదికాక అంత స్పష్టంగా కబంధుడు చెప్పి వంపాడు కనుక త్వరలోనే అతని సమాగమం జరగవచ్చు. ఇది నాకు తోచిన భావం. నీ అభిమతం ఏవిధంగా వుందో వినిపించు" మంటూ రాముడు అడిగాడు. అందుకు ప్రత్యుత్తరంగా "అగ్రజా! నీ భావం సరైనదే. నా కుడికన్ను స్పందించింది. కార్యం సఫలమవుతుంది. వదిన క్షేమ వార్త త్వరలోనే అందుతుంది. అదిగో ఆ చోటు వాసయోగ్యంగా

వుంది. ఈ రాత్రికి కాదగిన ఫలాలు తెస్తాను. నీవా వృక్షఛాయలో విశ్రాంతి తీసుకో" అని సౌమిత్రి చెప్పి, ఆ ప్రదేశం శుభ్రపరచి ఆకులు తెచ్చి, శయ్యగా అమర్చి, పైన జింగచర్మాన్ని వేసి, ఆయుధాలను, వస్తువులను తగిన స్థానంలో ఉంచి జలపాత్ర గ్రహించి చని, మంచినీళ్లూ, మధురఫలాలూ తెచ్చి తృప్తిగా భుజించి జలపానం చేసి సోదరులు శయనించారు.

అరణ్యకాండ సంపూర్ణం

# కిష్కింధకాండ

## రాముడు పంపా తీరంలో సీతా విరహంతో దుఃఖించుట

సూర్యోదయం కాగానే సోదరులు యథావిధిగా కార్యాలు నిర్వర్తించి పంపా సరస్సును చూపిస్తూ, తమ్ముడా! ఈ సరోవర శోభ ప్రాభాత సమయంలో ఎంత ఆహ్లాద కరంగా వుందో చూడు విరితమ్ములూ, తెంగల్వలూ, వైడూర్య సమనిర్మల జలం, పరిసర వివిధ ద్రుమాలతో, శీతల వాత సంచారంతో శ్రమాపనయం చేస్తోంది పర్వతాలు శిఖరాలతో వున్నట్లు, విస్తారమైన కొమ్మలతో వుర్వీరుహాలు తీరంచుట్టూ దట్టంగా నిండి ప్రశంసాపాత్రం అవుతున్నై. భరతుని దుఃఖంతో, సతీహరణ శోకంతో తప్తమవుతున్న నాపై మాధవుడు జాలి చూపక ఇంకా దుస్సహ పీడాకరంలో ముంచి బాధిస్తున్నాడు. ఈ ప్రకృతిని ఇంత సౌందర్య మనోజ్ఞ మోహనంగా అతడెందుకు చేయాలి? నేను శోకార్తుడను గదా. నేనే ఇంత తపిస్తుంటే నిన్ను గూర్చి ఏవిధంగా భావించాలో నాకు వూహకూడా అందటంలేదు. వసంత సమాగమంతో ప్రకృతి వున్మాదంతో పరవశించిపోతుంటే సీతా వియోగ దుఃఖంతో నేనొక్కడనే వ్యథ పొందుతున్నాను ఉరగామచరితమై, మృగశకుంతని కరసంకులమై, సరసీరుహ నీలాంబుజ సంఛన్నమై ఈ సరస్సు నన్ను కామపరవశుణ్ణిచేస్తోంది.

వర సుఖమలయానిలుడై, ప్రచురమన్మథుడై. ప్రసవఫలమనోహరుడై, పరిమళభరితుడై వసంతుడు దర్శనీయుడగుచున్నాడు. జలధరాలు వర్షించినట్లు తరువులు పూలురాలుస్తున్న వైఖరి చూచావా? గాలి విసరున కరకురాళ్ళపై వృక్షాల నుంచి పూలు వడగండ్లవలె పడుతున్నై. పడిన

పూలతో గాలి కుర్రవాడు గోలీలవలె ఒంటోంటినికలుపుతూ ఆడుకుంటున్నాడు పూల కొమ్మల్ని వూపుతూ కరువలి కొమరుడు స్థానచలితాలైన తుమ్మెదల ఝంకారంమిషను గీతాలు ఆలపిస్తున్నారు. పరభృతాలకుహూధ్వనులు గిరికందరాల్లో ప్రతిధ్వనిస్తుంటే సమీర బాలకుడు పంచమ శ్రుతిలో పాడుతున్నట్లు భ్రమ కలుగుతూంది. పవనుడు తీవ్ర సంచారం చేస్తుంటే చెట్ల కొమ్మలు ఒకదానితో ఒకటి కలిపి వసంతుని రాకకు పూల తోరణాలు కట్టినవా అన్నట్లు కనుల పండుగచేస్తున్నై. చందన శీతలుడైన మందానిలుడు కుంద సుమస్పర్శతో అమందామోదం అందిస్తున్నాడు. కమ్మని తేనేపట్టులకు ఆటపట్టైన కానవద్రుమాలు మిళిందర సరూపంగా సంగీతం పాడుతుంటే లఘుగురు గమన భంగిమలతో సమీరుడు నాట్యం చేస్తున్నాడు. పర్ణ షష్పాలు ఒత్తుగా వున్నచెట్లు గుబురు గట్టటంతో పర్వతాలు పూలరాశి పోసినట్లున్నై. విలువెల్ల పూచి కొండగోగులు అపరంజి తొడవులు దాల్చి పైన వలెవాటుగ పైడి జరీవలువలు ధరించిన పౌరుల లాగావున్నై. వింత వింత శకుంతరవాల దిశాక్రాంతాలై తోప్పరగా, వసంతుడు కాంతాదూరుడనైననాకు అంతస్తాపంకలిగిస్తున్నాడు. కోయిలల కూతలతో, చిలుకల రొదలతో, వసంతుని సహకారంతో కాముడు భార్యావియోగోద్దాముడనైన నాపై దండువెడలుతున్నాడు. జలపాతాల సవ్వడికి సహకరిస్తూ జల కుక్కుటాలు చేసే సవ్వడి శ్రవణానందం కలిగిస్తూ కూడా అకామ్యపరితాపం నాకు ప్రసాదిస్తూంది.

గతకాల వసంతోదయాలు సీతతో గడిపానుకదా. అప్పుడు నాకెంతో ఆనందం కలిగించిన ఈ వసంత ఋతువు ఇప్పుడు దుఃఖాబ్ధిలో త్రోస్తూంది. ఈ సమయంలో జానకీవుంటే నన్నుచేరి ఎంత పరవశించేది? నాకెంత తృప్తి కూర్చేది? వికసితలతాకుడుంగ పాళిపై వివిధఖగకుల సంతానం రకరకాల కలకూజితాలు చేస్తూ వ్రాలి మకరందం గ్రోలివేస్తూ తిరుగుతూ ప్రమోదం కలిగిస్తూంది. ఋతు ధర్మప్రేరితాలై, పులుగులు తుమ్మెదలు జాతి సహజ వ్యసనాలు నలుపుతూ క్రీడించి విగ్రహకవచాన్ని విస్మరిస్తున్నై. గాలి విసరున పెనుమ్రోతలతో ధరణిజాలు నా హృదయంలోని కామానలాన్ని ప్రజ్వరిల్ల చేస్తున్నై. అశోకపుష్పాలు అగ్నివలే, షట్పదధ్వని మందు

చప్పుడుగా, తొగరు చిగురాకులు కీలలుగా ఆమని చిచ్చు నన్ను దహిస్తూంది ఇంతమనోహరమై జగన్మోహనమైన ఈ వసంత సమయంలో సీతను బాసి ఏవిధంగా జీవించేది ? ఏచిపూచి తలిర్చిన పూవుటీరాలు ఎల్లెడలావింతి నా వియోగాగ్నికి సమిధలుగా పరిణమించినై సంతాపభారం సహించి ఏవిధంగా బ్రదుకటం ? కంటికి దూరమై జానకి శోకం కల్పిస్తే, కనపించి ఈ వసంతుడు శ్రమ బిందువులు సృజిస్తున్నాడు కంటికి కనరాక, స్పర్శతో కనుపించి మలయానిలుడు నా శరీరాన్ని దహిస్తున్నాడు చల్లని పిల్లగాలులకు పురులువిప్పి నెమిళ్ళు నటిస్తుండే పెంటులు (ఆడవి) చూట్టూచేరి ఎత్తులో సొక్కుతూ మన్మథపీడితుడనైన నన్ను పరిహాసిస్తున్నై. ఆడుతున్న మగ నెమిళ్ళతోకూడి ఆడుతున్న పెంటినెమిళ్ళు వింతగా వినవిస్తూ, రెక్కలల్లార్చి కూడపోతూ నన్ను చూసి నవ్వుతున్నట్లున్నవి

నా అర్ధాంగిని అసురుడు కొనిపోయిన సంగతి, అందుచే నేను కుందుతున్న సంగతి ఈ రమణీయ వసంతకాల శృంగార సముద్రంలో మునిగిన శిఖావలములు తెలియక తాము కలిసికొని నా వియోగాన్ని తలపుకు తెస్తున్నై. శకుంత జాతిలో పుట్టినప్పటికీ, వసంత మన్మథుల ప్రేరణచే శిఖి భర్తను సమీపించింది రక్కసునిచే అపహృత కాకపోతే సీత నన్ను చేరక ఎట్లు నిలువగలదు ? చరాచరమైన ప్రకృతి అంతా సృష్టిభావవిలసితమై వుండగా, వ్యర్థగతకాలస్మృతులతో ఎలాగడిపేది ? నా ప్రియురాలు వియోగ దుఃఖంతో ఎక్కడవుందో అక్కడ ఈ పుష్పసమయం వుంటే నా వలెనే కామ శరాహతికి మూర్ఛిల్లుతుంది అసలు ఆమె వున్నచోట వసంతకాలం రానేరాదు ఒకవేళ వచ్చినా దానవ కాంతలు పెట్టే బాధల్లో ఆమె మోము వెలవెల పోతూ అస్తమయ చంద్రుణ్ణి గుర్తుకు తెస్తూ వుంటుంది

శ్రుతి కటువులైన సంభాషణలు వినటం అలవాటులేని నాదేవేరి ఈ వసంతా గమన సమయ శోభావిజృంభణానికి, రాక్షసుల పరుషభాషణాలకూ, నా వియోగతాపానికీ బ్రతుకుట దుర్లభం విధి నిర్వహణంలో కఠోరంగా వుండే నా మనస్సు జానకిపట్ల ఇంతబేలగామారిపోయిందేమి ? నావలె పామరుడు కూడా భావించడేమో తమ్ముడా ! నా హృదయం ఆమెకు భిన్నంగాలేదు. ఆమెకూడా అటువంటిదే. కనుకనే ఇంత బాధపడుతున్నాను

ఈ లతాంత సౌరభావిలదే శీతలుడై కూడా నన్ను దహిస్తున్నాడు. ఈతడు జానకి నేను కలిసిన సమయంలో ఆనంద సుఖాలను ప్రసాదించాడు. ఇప్పుడింత క్రూరుడుగా మారటానికి నా పాపఫలమే కారణం ఈ వలగాకి కాకులు పేంజంటూ నున్నప్పుడు చెవులు చిల్లులు పడేట్లు కూసేవి ఇప్పుడు నా అర్ధదేహం లేనందున కొమ్మల్లో రెక్కలు అల్లార్చుకుంటూ గునుస్తున్నై. నా భార్యా వియోగాన్ని ఈ విహంగి సూచిస్తూంది పూర్వం మౌనంగా వుండి ఇప్పుడు మణి తద్వివేపి వెక్కిరిస్తూంది. లేజిగుళ్ళతో నిండిన వృక్షశాఖల్లో కూడుండి పక్షి సంతానం ధైర్యంతరగ్గా, కామం పెరగ్గా కల ధ్వనులు చేస్తున్నై. గాలికి కదులుతూ పడ లెత్తుతున్నట్లు తిలక మంజరి భాసింపగా కామమదోద్ధత భ్రమరం వెన్నంటుతూ, ప్రియురాలు గమిస్తుంటే వెంటాడే ప్రియుని జ్ఞాపకం తెస్తూంది పేరుకు అశోకమైనా కామినీ శోకవర్ధనం ఇది చిగురాలికి కదులుతూ షప్పకరంతో బెదిరిస్తూంది తావులు చిమ్మే పూవులతో నిండిన కుమావులు తాపహారంకోసం ప్రియుల గంధం పూసుకున్నట్లు శోభిస్తున్నై.

సర్వలోక నయనానందకరంగా వున్న ఈ పంపావనంలో కిన్నర దంపతులు అక్కడక్కడ విహారం చేస్తున్నారు చూచావా? ప్రతిఫలించే బాల భాస్కరునివలె కోకనదాల శోభ కమగొన్నావా? కాసార జలతరంగాల్లో స్వేచ్ఛాసంచారం చేస్తున్న విహంగాలూ, కల్హారహల్లకసరసీజాలపై వ్రాలుతున్న తుమ్మెదలూ మనస్సును మోహపరుస్తున్నై కమగొన్నావా? చక్రవాక స్తనియై, చారువనీ పరిధాన రంజితయై, సారంగ నేత్రాలతో, మాతంగ గమనంతో పంపా సుందరి పరవశించినా సీతను సాగారంగా హృదయ పీఠంలో నిల్పుతూంది. అట్లతద్దెనాడు యువకులు యువతీ మణులను వుత్సాహంతో వూపుతున్నట్లు, గాలితాకున విచ్చిన తామర పూవులు వుయ్యాలలూగుతున్నై ప్రకృతి సౌందర్యాన్ని పుణికి పుచ్చుకున్న సీతలేకుండా నేలకు బరువుగా జీవితం గడపలేను. మిత్ర సంపాదనార్థం ఆర్తితో వచ్చిన నాకు మన్మధుడు క్రూరుడై ఈ సమయంలో సీతను గుర్తుకు తెచ్చి ప్రాణగొడ్డమైనాడు నాకు ప్రియురాలివలే ప్రీతిపాత్రమైన ఈ వసంతశోభ ఇప్పుడు లేకుండా వుంటే కాముని గర్వం భంగించే వాణ్ణి. ఏది సీతవుంటే

ప్రియంగా వుండేవో, రాగాన్ని పెంచేవో, అవే ఆమెలేకుండా వున్న నాకు ఇప్పుడు అప్రియంగా వుండి విరాగం కల్పిస్తున్నై. పద్మ కోరకాల్లోని రేకులు చూస్తుంటే సీత కడగంటి చూపులను జ్ఞాపకం చేస్తున్నై. పద్మకేసర పరాగం దొంగిలించి, వసుమతీరుహాల పూలు సహకరిస్తూంటే పారిపోతున్న వాయువు సీత నిశ్వాసంగాంతోచి చిత్త వైకల్యం కలిగిస్తున్నాడు కొండ గోగులతో విండార విరిసిన పంపా దక్షిణ దిశలోని నెత్తాలను కన్నావా? పరమ రమణీయంగావున్నై.

చూడు సోదరా! ఈ గిరిరాజును ధాతురాగభూషితుడై ఎంత శోభిస్తున్నాడో. ఆకులు లేకుండా పూలతో పొంగిపోతున్న కింశుక సముదాయాన్ని తీవ్రంగా వీచి పవనుడు పరాగంతో సామువుల ప్రకాశింపచేస్తున్నాడు ఈ పర్వత సానుప్రదేశం ఎంత హృద్యంగావుంది? మాలతీ, కరవీర, మాధవీ, మల్లికావల్లికావేల్లితమైన లావాలుకొన్ని, సిందువారక బృంద వాసంతికా సంతానచారు ప్రదేశాలుకొన్ని, సంజాల మంజాల, వకుళ, చంపక, నీప, చిరిబిల్వ, కేతకీభరితమైన ఆవరణాలకొన్ని, నారంగ, నాగరంగ, మధురంగ, కురంట, పాట, లాద్రు, చూతవృక్ష సాంద్రమైన నీరువమాన వరిసరాలుకొన్ని, శింశుపా, కేతక, కింశుక, కుటవక, శిరీష, తిమిశ, తమాల, కేసర, సువర్ణశాఖావాగాలున్నచోట్లుకొన్ని. వికసిత పుష్ప సంగతమైన లతాలలనవృక్ష నాయకుని పరిరంభణకుతం కూర్చి పరవశుణ్ణి చేస్తూంది లతా కాంతలు ప్రియాభిముఖులై పవన స్పందనంతో కరసంజ్ఞ చేస్తుంటే, వృక్ష ప్రియులు తత్పవనస్పందనంతో సంచలిత శాఖాకరాలతో ఆహ్వానిస్తున్నారు

ఆహో! ఏమి ఈ వసంతుని ఆధిక్యం? నన్ను పిచ్చివాణ్ణిచేస్తూంది ఈ మలయమారుతం ఇంత చిలిపిగుణం కలదైనదేమి? వనం, వనం, పుష్పం పుష్పం, గిరీ గిరీ, ఆటకలిగిన తిందిపోతువలె తిరుగుతున్నాడు. భక్షణభారంచేత స్తంభిస్తున్నాడు. కొన్నిచెట్లు మెల్లంగా పూచి రాగరంజితాలవుతుంటే, కొన్నిసాంద్ర వికసితాలై పీలంగా విరాగాలవుతున్నై. రాగమత్త మధుకరాన్ని చూచావా? ఈ పూపురమ్యం, ఇదిప్పాయివు, ఇది పద్యోవికసితం అనిభావిస్తూ యుంకృతి గానంచేస్తూ. దక్షిణనాయకుని

చంచాన సంచరిస్తూంది. చెట్లకొమ్మల్లో దాగి, అచాటున కుసుమంపై వ్రాలి తేనె తగిలిన రక్తితో చాటుగా, మరియొక వృక్ష కూటాన్ని చేరుకుంటున్న ఈ షట్పదాన్ని చూడు. ఈ వంకకు చూడు. భర్తరాకకు గృహిణులు పరచిన శయ్యలవలె పూలురాలిన నేలలు శోభ పొందుతున్నై. వింత వింత పూలతో నిండి ఈ సానువులు పలురకాల పట్టు పాన్పులు పరిచి నట్లున్నై.

## లక్ష్మణుడు రామునకు ధైర్యం చెప్పుట

లక్ష్మణా! కన్నతండ్రి కానలకు నెట్టితే, కష్టమనుకోకుండా నావెంట వచ్చి, అన్నివిధాలా నాకు ఆనందం కల్గిస్తున్న సీతను బాసి క్షణం బ్రతుకలేను. అయోధ్యకుపోయి అక్కడివారు అనురాగంకొద్దీ ప్రశ్నించే విషయాలకు సమాధానం చెప్పలేను. మామగారి మొగం చూడలేను. ఈ వసంతకాల సంప్రాప్త మనస్తాపం సహించలేను. ఒకనాడా! రెండునాళ్ళా! మాసద్వయం గడపటం నాకు సాధ్యం కాదు. సీతారహితుడనై ఇంతటి మనోజ్ఞ కాలంలో సుఖించే యోగం ఈ జన్మకు లేదు. నాకై తన సౌఖ్యాన్ని ధారపోసిన దారను విడచి జీవించటం నాచేత కాదు. లక్ష్మణా నీవు పురానికి పో. భక్తితాత్పర్యాలుగల భరతుని ఆదరించు. నా తల్లిని, నీ తల్లిని సమానంగా సేవించి కడతేర్చు. నా విలువెల్ల జనకజ ఆకృతితో నిండిపోయింది. అవకాశం కలిగిందని అతనుడు పుష్పాస్త్రాలను గుండెలపై కుమ్మరిస్తున్నాడు. నాలోని శౌర్యం, వివేకం, సహనం, జానకితోనే పోయినై, మందభాగ్యుణ్ణి. సమానవయోరూపగుణగణాలతో విలసిల్లిన దాంపత్యం ఘటించి ఎందుకో విధాతవిపర్యయం కల్పించాడు. ఎప్పటికి సుగ్రీవుని మైత్రి లభిస్తుంది! ఎంతకాలం సీతాన్వేషణకు పడుతుంది! జరిగితే యుద్ధం ఏనాటికి ముగుస్తుంది! అంతకాలం ఈ వియోగభారాన్ని మోస్తూ జీవించలేను" అని పునరుక్తులతో, భావచర్వణంతో, ఆగకపలవిస్తున్న అన్ననుగాంచి, సమయోచితవాక్యాలతో, వినయోక్తులతో, పదపద గుంఫనంతో, సౌమిత్రి సమాధానపరచసాగాడు.

"అన్నా! ఇక్ష్వాకువంశంలో పుట్టిన రాజులలో లేని విశిష్టగుణాలెన్నో నీలో వున్నై. మేరుధీరుడవు, సాగరగంభీరుడవు, దానదయుడవు, నిర్జితేంద్రియుడవు. శత్రుభయంకర శరచాపహస్తుడవు. ఇంత అనన్యుడవైనావేమి! కష్టాలు మనుష్యులకు రాక మానులకు వస్తాయా! నీ హితోపదేశంతో, నీ చరణ సేవతో, నీ కనుసన్నలతో కాలం గడపవలసిన నేను నీకు మాటిమాటికి జ్ఞానవర్తిని పైకెత్తోయటం భావ్యమా! నీవు అంతరివంటి వాడవు కావు. ఏ సమయంలో ఏది చేయాలో అది ఆచరించి మార్గదర్శి వవుతావు. నీ ఇప్పటి శోకం పామరలక్షణం కాదు. పండిన పండితుని లక్షణమని నాకు తెలుసు. ఇంతకాలం బ్రహ్మచర్యవ్రతదీక్షలో వున్న నీవు భార్యావియోగానికి ఇంత బాధపడుతున్నావంటే సామాన్యలోకానికి జీవలక్షణం ఇటువంటిదని చెప్పటానికే. మా వదిన, అయోనిజ జనకరాజ సంరక్షణలో పెరిగింది. పరమపావనమై, మహిమాన్వితమైన ఇక్ష్వాకు వంశాన్ని మెట్టింది. శివధనుర్భంగం చేసిన నీ చేయి పట్టింది. అగ్నిదేవుని చల్లపరచగల సాధ్వీమతల్లి. ఆమెకు అపకారంచేసినవాణ్ణి సౌశీల్యాగ్నిచే దహించకలిగింది. ఆ పని నీ కీర్తికోసం మిగిల్చి, నీ రాకకోసం ఎదురు తెన్నులు చూస్తూవుంటుంది. ఆమె అవమానానికి ప్రతీకారం నీవు నిర్వీర్యుడవై ప్రాణ పరిత్యాగ ప్రయత్నం చేయటమేనా! శత్రునాశనం నిమిత్తం శరచాపాలుదాల్చిన పాణిపల్లవంతో ఆమె పాణిగ్రహించటమా! ఆలోచించు. అగ్నిసాక్షిగా కరగ్రహణం చేసి భర్తవైన నీవు భార్య దుఃఖంతో నీపై ఆశపెట్టుకుని జీవిస్తుంటే ఆత్మహత్యకు పాల్పడటం "సత్యంవద ధర్మంచర నాతిచరామి" అన్న వాక్యాలకు అనృతదోషం ఆపాదించబడటం లేదా! నీవు సత్యవ్రతుడవు, సత్యవాదివి, సత్యపరాక్రముడవు కదా!

ఇట్టి ఘటన నీపట్లనే ఎందుకు జరగాలి! మాబోటివాళ్ళకెందుకు రాలేదు! లోకంలో యశఃకాయుడవు కాదగినవాడవు నీవే కనుక నీకే వచ్చింది. అదికాక, నీవు రాక్షస సంహారం చేస్తానని మహర్షులకు మాట ఇచ్చావు. నీవు కారణరహితంగా కయ్యానికిదిగవు. అందుకే సత్యవచనుడవైన నీ వాక్యాన్ని అర్థవంతం చేయదలచి దైవం ఈ సంఘటన కల్పించి వుండవచ్చు. కాకపోతే ఏ కారణంచేత రాక్షసులను సంహరిస్తావు?

జటాయువు, కబంధుడు నీకు యుద్ధం తప్పదనీ, జయం వద్దన్నా వస్తుందనీ అందుకు సందేహం లేదనీ చెప్పారు కదా? మనం విన్ననే కదా ఈ ప్రదేశానికి చేరాం. ఒకటి రెండు దినాలలో మిత్రసమాగమం జరుగుతుంది. నా మనస్సుమాత్రం ఈనాడే ఆ అవకాశం వస్తుందనీ చెపుతున్నది. మనకు మిత్ర సహాయం ఆమె క్షేమంగావున్న ప్రదేశాన్ని గురించిన వార్త తెలుసుకుని చెప్పటం అంతవరకు చాలు మనకు తెలిసినట్లు శత్రువు తెలుసుకుంటే ఆమెను తెచ్చి నీ పాదాలచెంత అర్పించుతాడు. కాదా? పాతాళంలో దూరినా, సముద్రాలలో దాగినా, ఆకాశంలో మరుగుపడినా నీ తమ్ముని కోపాన్ని తట్టుకుని జీవించలేడు. మిత్రుడు తప్పక శుభవార్త తెప్పిస్తాడు. తమ్ముడు తక్కిన కార్యం సాధిస్తాడు. నీవు నిమిత్తమాత్రుడుగా నిలిస్తే చాలు. ఇంతమాత్రానికి యింత వంతపడపనేమి? ఉత్సాహానికి మించిన బలంలేదు. అదే శక్తి, అదే యుక్తి ఉత్సాహవంతునకు అసాధ్యమైనది పృథ్విలో లేదు నీవు ఉత్సాహవంతుడవైతే చాలు కార్యంగట్టెక్కినట్లే శోకమోహాలను దరికి రానీయకు. మహాత్ముడవు, సుకృతాత్ముడవు నిన్ను నీవే మరచి పోతేనేనా చక్కదిద్దేది? నాయందు దయవుంచి ప్రసన్నుడవై కార్యరంగంలోకి దిగు. అన్నా! దక్షిణభుజం అదిరి శుభశకునం సూచిస్తూంది. కాలం అనుకూలంగా వుంది. కార్యసాఫల్యానికి సంకల్పం చేసితే. మిత్రదర్శనం తప్పక జరుగుతుంది. మేలు కలుగుతుంది" అని ఆ మాటలకు రాముడు బోధితాత్ముడైనాడు. శోకమోహాలను నిగ్రహించాడు. ధీరుడైనాడు. ఆరనున్న దీపం పునరాజ్యధారతో పోయిన శక్తిని పొందినట్లు రాముడు దైత్యలోక విరాముడైనాడు. ప్రతిపక్ష కంఠఖంతన పాటవపటిష్ఠుడైనాడు.

## సుగ్రీవుడు రామలక్ష్మణుల చూచి భయపడుట

ఈవిధంగా లక్ష్మణ ప్రబోధితుడైన రాముడు మబ్బుతెరదాపిన మధ్యందిన మార్తాండునివలె ప్రకాశిస్తూ ఋశ్యమూకపర్వత పరిసరాలకు పయనం సాగించాడు. అన్నలో వచ్చిన మార్పునకు సౌమిత్రి అంతరంగంలోనే ఆనందించి సత్యధర్మ బలసంపన్నుడై ధనుర్ధారియై పేయికమంతో

గమనిస్తూ రక్షకుడుగా వెంట నడిచాడు. వారు కబంధ నిర్దేశిత ప్రదేశాన్ని చేరి, పర్వతాన్నీ, పరిసరాలనూ పరిశీలనతో పరికిస్తూ తిరుగసాగారు. ఆ సమయంలో ప్రభాత కృత్యాలు తీర్చుకుని తండ్రి దర్శనార్థం పర్వతాగ్ర భాగంలో నిల్చి, పుదయించే వేళ అభిముఖంగా నిల్చి అర్ఘ్యపాద్యాంజలుల అర్పించి సుగ్రీవుడు పంపాసరోవరాన్నీ, తత్ప్రాంతవనాన్నీ చూచి వసంతుని ఇంద్రజాలవిద్యకు ప్రకృతి పరవశించి హృదయార్పణం చేసినట్లుగా భావించాడు. వెంటనే అన్నచేత తనకు కలిగిన అవమానం, అపహృతయైన ఆత్మసతి గుర్తుకురాగా మొగం వెలవెలబోతూ ఉండగా కన్నీటిబిందువులు కార్చాడు. కాలక్రమంగా భార్యావియోగ తాపం నిగ్రహించుకునే శక్తి, అన్నకూర్చిన అవమానం సహించుకునే ఓర్పు, ప్రజ్ఞావంతులైన మంత్రులు అనుక్షణం ప్రసాదిస్తున్న ధైర్యం కోల్పోయాడు. తనిక జీవించినంతకాలం కిష్కింధా ప్రవేశం కానీ, దారదర్శనం కానీ కలుగదు కదా అని నిరాశతో నిట్టూర్చాడు. అన్నచేసిన పట్టణ బహిష్కారావమానంకంటే ఆత్మేశ్వరి పరిగ్రహం మిక్కిలిగా బాధించి ప్రతీకారోన్ముఖునిగా చేయసాగింది. ఎంత ప్రయత్నించినా యింతకాలం ఎండమావుల్లోని నీళ్ళవలె వ్యర్థం అయింది. భవిష్యత్కార్యం గోచరపడటంలేదు.

ఇతికర్తవ్యతామూఢుడై రవిసుతుడు భూధరాగ్రభాగంలో విహారిస్తున్న సమయంలో వానరులంతా గగ్గోలుగా కిచకిచలతో దూకులతో పర్వతబిలం ప్రవేశించటం పరికించి దిక్కులు చూచాడు. ఆజానుబాహులు, శరీరవర్ణభేదమే కాని, ఆకృతిలో భేదం లేనివారు. నవ్యకోదండహస్తులు, విశాలవక్షులు అద్భుతదర్శనీయులు దేవసమానవిక్రములు సర్వజనాకర్షణ మూర్తులు వందనీయులు పర్వతప్రాంతంలో పరిభ్రమించటం చూచి భయభ్రాంతుడైనాడు. చేష్టలుడిగి స్తబ్ధుడైనాడు. ఎవరు వీరు? ఈ దుర్గమారణ్యంలో ఎందుకు తిరుగుతున్నారు? నరసంచారయోగ్యంకాని ఈ పర్వత ప్రదేశానికి ఎందుకు వచ్చారు? ఒక్క బాణం చేత లోకాలనుదగ్ధం చేయగల ఈ చాపధారులు మునులవలె జటావల్కలధారులైనారెందుకు? క్షత్రియోచితమైన వీరి ఆకారం త్రిభువనాలను పాలింప సమర్థులని తెలుపుతుంటే అందుకు అతకని తాపస వేషధారణం చేసారంటే తగినంత కారణం

వుంది వుండాలె ఒకవేళ నా వునికి సహించలేని అన్న వీరిని ప్రోత్సహించి పంపించి వుండవచ్చు. పరస్పర విరుద్ధంగా వున్న వేషధారణతో నన్నే విధంగానైనా చూచి నమ్మకం కలిగేలాగ నటించినట్లు నటించి, అన్నకు స్వాధీన పరచటమో, వారే స్వయంగా చంపటమో లక్ష్యంగా వచ్చినట్లు తోస్తుంది. కాకపోతే ఇక్కడ వీరికేం పని వుంది? వీరికంట పడకుండా ముందే కార్యాలోచన చేయాలె" అని శత్రుభావ శంకితుడై, గుండెలదర, పదములు చెదర, బెదరు చూపులతో, నిప్పు త్రొక్కిన విధంగా, వృశ్చికదష్టుడైన వాని చందంగా అక్కడ నిలువలేక, ఏం చేయటానికి తోచక వున్నచోటనే వుండటం మంచిదో, పలాయనం చేయటం బాగో మంత్రుల వుపదేశం పొందటం మంచిదని తలచి వారి వద్దకు వెళ్ళారు.

ఆ సమయంలో తొట్రుపాటుతో వస్తున్న యజమానుని అమాత్య చతుష్టయం అల్లంత దూరంలో చూచి ఎదురేగి ఆహ్వానించింది. కంపిత శరీరంతో, గద్గద కంఠంతో రవిసుతుడు ప్రశ్నించినాడు. తెప్పరించుకొని, "మంత్రి పుంగవులారా! హరి దైవోపహతుండు పోవు నెడకుం బోవుం గదా ఆపదల్" అన్నట్లు, లజ్జాభిమాన పరాక్రమాలను చంపుకుని అజ్ఞాత వాసంగా బ్రతుకుతున్నా, ఈ స్థితిలో కూడ శత్రుపీడ వదలలేదు. మీరు చూడలేదా? పంపాతీర వనంలో తిరుగుతున్న ఇద్దరు మానవ శ్రేష్ఠులను? వారు వంచనామతులు, వాలిచే పంపబడ్డవారు కాకపోతే ఇక్కడికెందుకు వస్తారు? ఈ కపట వేషధారణం ఎందుకు? తాపసులెప్పుడైనా శరచాప ధారణం చేశారా? వాలి వాత పడక తప్పించుకున్నాం గాని, వీళ్ళ దృష్టిలో పడితే, పడ్డప్పుడే మన జీవిత కావ్యాలకు ఆశ్వాసాంతం జరుగుతుంది. ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? ఇక్కడనే వుందామా? దూర తీరాలకు ఎక్కడికయినా పోదామా? వాళ్ళను చూచినప్పటి నుంచి నా మనస్సు శంకిస్తూంది. స్వాస్థ్యం తప్పుతూంది" అని వణుకుతూ చెప్పాడు.

# హనుమంతుడు సుగ్రీవుణ్ణి భయకారణం అడుగుట

భయకంపితుడై సుగ్రీవుడు పలికిన పలుకులు విని వానరులే కాక, మంత్రులు కూడా వాళ్ళని చూచి గుండెలు ఝల్లన కొండశిఖరం నుండి అదిరేలాగా దూకుతూ, అడవి జంతువులు బెగ్గిలి పారిపోతూండగా, వృక్షాలు విరిగి పడేలాగా, చేజారిన పాదరసంలాగా చెల్లాచెదరై కొండ మారుమూలకు పరువెత్తారు. అంతవరకు అంతర్ముఖుడుగా కూర్చున్న హనుమంతుడు లేచి సుగ్రీవుని వద్దకు వచ్చి, చలించిపోతూన్న స్థితి చూచి "ప్రభూ! ఎందుకింత అకారణ భయం కలిగింది నీకు? మేం వుండగా నీవంత భయపడవలసిన పనిలేదే? ఈ పరుగులేమిటికి? వానివల్ల వచ్చే కీడు ఇక్కడ లేదుకదా? ఇది ఋష్యమూకం అందుకే గదా మనం ఇక్కడ చేరాం అదిగాక ఈ ప్రాంతానికి వాలి వచ్చినట్లు లేదు. మరి ఈ భీరుత్వానికి హేతువేమిటి? జాతిలక్షణం సార్థకం చేశావు. నిష్కారణ భయంతో లఘుచిత్తుడవై పూర్వాపరాలు మరచావు. దైవం అనుకూలిస్తే, పరేంగిత మ్యతిహీనుడు ప్రభువుగా దేశం పాలించలేడని నీకు తెలియదా? కష్టాలెల్లప్పుడూ కాపురం చేయవు. సుఖానికి ఏది కారణమవుతుందో దుఃఖానికి కూడ అదే కారణమవుతుంది. స్థిమిత మతివై నీకిప్పుడు కల్గిన వుపద్రవం ఏమిటో చెప్పు. తరువాత దానికి ప్రతికృతి ఆలోచిద్దాం" అని హెచ్చరించాడు. ఆ మాటలు విన్న వానరేశ్వరుడు తన్ను తాను సంబాళించుకున్నాడు.

"చూడు హనుమా! నేను భీతి పొందటానికి తగిన కారణం వుందో లేదో నీవే చూచి చెప్పు. అదిగో అటు చూడు వాళ్ళ రాక, వాళ్ళ సంచారం, వాళ్ళ ఆకార లక్షణం. వాళ్ళు వాలి పంపున నన్ను చంపటానికే వచ్చారు. ఆ శాలవృక్ష ప్రమాణం కల చాపాన్ని సామాన్యుడు ధరించగలడా? సహజంగా పుట్టిన మానవులకు లోకోత్తర పురుషులకుండ తగిన ఆజానుబాహులు వుంటవా? ఆ ప్రకాశ మానం సామాన్య జనలక్షణమేనా? రాజులంతా అన్యోన్యం మిత్రులుగానే వుంటారు. కాని, అంతరంగికంగా ఒకరి అభివృద్ధికి ఒకరు అసూయ పడుతారు. గూఢచారులను ప్రయోగిస్తారు. రంధ్రాన్వేషణం చేస్తారు. అది ముందుగా గుర్తించకపోతే అపా

యం తప్పదు. అందరికంటే వాలి పుపాయశాలి. నిరపాయత శీలి. శత్రు కావన కీలి. రాజనీతి పారనహేశి. తపస్సంపాదితాను గ్రహశాలి. మన లను నిర్జించటానికి ఈ చోటు అడ్డు వచ్చింది మార్గాంతరం చేత మనలను సాధింప చూస్తున్నాడు. అందుకే మహాశక్తిమంతులైన వీరిని మనపైకి ప్రయోగించాడు. ఇక భయానికే కాదు బ్రదుకటానికి కూడా అవకాశం లేదు. నీవు బుద్ధిమంతుడవు. దూరదర్శివి విచక్షణా చక్షుష్మివి. నీవు యధామతి చింతించి సరియైన సందేశం నాకు తెలుపు" అని కోరాడు.

ప్రభువు మాటలాలకించిన పావని పూర్వాపరాలు సమన్వయించి చూచాడు. ఒకటికి పలుసార్లు వారివంక పరిశీలనగా చూచాడు. సద్య స్కాలంలో వారివల్ల రాతగిన ప్రమాదం లేదని గుర్తించాడు వారిలో వంచన కానీ, కాపట్యం కానీ కనుగొనలేకపోయాడు ప్రతీకారేచ్ఛతో కాక ఫలార్థులుగా ప్రయత్నం చేస్తున్నట్లు పసిగట్టాడు సుగ్రీవుణ్ణి చూచాడు. "ప్రభూ! నీవింతకు ముందు పొందిన భయం నిర్హేతుకమయింది. వారు వాలి పంపితే వచ్చినవాళ్ళు కారు. వంచనా వేషధారులు కారు. నీకో ఆత్మీయ పదార్థం కోల్పోయి హృదయక్షోభలో అన్వేషణా తత్పరులై ఇటు వచ్చినట్లు నాకు తోస్తూంది. నీవన్నట్లు అన్నివిధాల ఈ ఇరువురూ లోకో త్తర పురుషులే. సందేహం లేదు అభయప్రదాన హస్తులే కాని అత్యా చారులు కారు. నీవు కూడ భీతి వదలి వివారించి చూడు. వారు పరస్పరం మాట్లాడుకొను ధోరణి, తిరిగే లక్షణం, చూచే చూపూ ఆకర్షణీయంగా వున్నాయి కాని అనుమానించ తగినవిగా లేవు. అందుచేత మనం అప్ర మత్తంగా వుండి వారిని కనిపెట్టి వుందాం దైవానుగ్రహం వుంటే వారిని మనకు అనుకూలంగా చేసుకోవచ్చు. అప్పుడు నీవు పొందిన భయం నీ అన్న వాలి పొందుతాడు. నా హృదయం "సత్యం సత్యం" అని ఘోషి స్తూంది అన్నాడు.

## సుగ్రీవుడు హనుమంతుని రామలక్ష్మణుల కడకు పంపుట

కపిశ్రేష్ఠుని వాక్యాలు కపినాథునకు కర్ణామృతాలైనై. మనస్సు నిర్మలమైంది. మొగం తేటపడింది. రాజనీతిలో భేదోపాయం వుండనే

వున్నది. హనుమంతుడన్నట్లు వారి సహాయం లభిస్తే వాలి వధ క్షణకాలం పట్టదు. వెంటనే సుగ్రీవుడు అనుచరునితో, నీ వుపదేశం తిరుగులేనిది. నీ సూక్ష్మ దర్శనం సాటిలేనిది. నీవు చెప్పిన కార్యాన్ని సాధించటానికి నీవే అర్హుడవు. ప్రాకృత మానవాకారంతో వారిని కలిసి, వారి ఇంగితం, రాకకు కారణం, భవిష్యత్కార్య నిర్ణయం, భావశుద్ధి, నిగ్రహానుగ్రహనిష్ఠా తెలిసికొనిరా నీవు వారితో సంభాషించే వేళ, భావ స్పష్టత, ముఖనేత్ర చేష్టలు జాగ్రత్తగా గమనిస్తూ నిన్ను వారనుమానించకుండా నమ్మేలాగా ప్రవర్తించు. సమయం చూచి నాపట్ల వారికి అభిముఖ్యం కలిగేట్లుగా మాటలు కొన్ని చెప్పు ఎంత వాడయినా మతిమంతుడవైన నీ మాటలకు ముగ్ధుడు కాకుండా వుండడు. జితేంద్రియుడవైన నీ సాధు రూపానికి ఆనందించకుండా వుండలేదు. నీవు సామాన్యుడవు కావు. నీ సహచరత్వం వల్లనే ఇంతకాలం మనగలిగాను ఈ కార్యం అనుకూలంగా చేయి. నీకు విశేషించి చెప్పవలసిన పనిలేదు. నాకు ఏం చేస్తే శుభమో నీకు తెలిసినంత నాకు తెలియదు. తక్కినవారు మంత్రివాచ్యులు. చూచావు కదా వారిని చూడగానే ప్రాణభయంతో పరుగులు తీశారు. విశ్వాసపాత్రులేగాని వివేకధనులు కారు నా భావి జీవిత భారం నీపై పెడుతున్నాను నీకు తోచిన విధంగా కార్యం సాధించుకొనిరా" అని ప్రశంసోక్తులతో ప్రయత్నాన్ని సూచించాడు. అందుకు హనుమ అంగీకరించాడు.

## హనుమ భిక్షుకవేషంతో రామలక్ష్మణుల కడకేగుట

పర్వత పరిసరాల్లో పర్యటిస్తున్న సోదరులు ఆ పర్వతానికి మహత్తు కలదని కబంధుడు చెప్పగా విన్నవారు కావటంచేత ఆరోహించటానికి సాహసించలేకపోయారు." సూర్యోదయమై నాలుగు గడియలు మాత్రమే అయింది. మధ్యాహ్నం వరకు ఈ ప్రదేశంలోనే వుండి అప్పటికి మిత్రుని జాడ తెలియకపోతే విశ్రాంతి నంది సాయంకాలం మళ్ళీ వద్దాం" అని నిర్ణయం చేసుకుని ఫలాలను సేకరించుకొని పాత్రలనిండా జలం పూరించుకుని వృక్ష చ్ఛాయలో ఆసీనులై కొండవంక చూస్తున్నారు.

నదినదయన్ను దాటిన భూమర భిక్షువు వేదం పఠిస్తూ తమవైపు రావటం రాజకుమారులు చూచారు. ఆ వృద్ధ భిక్షువు సమీపించి పావ హరంగా, ఫలప్రదంగా, కర్ణసుఖంగా ఋక్కులు గానం చేస్తూ అర్థవంత మైన మంత్రాలతో స్వస్తి చెప్పి మధుర ఫలాలు ఇరువురకూ చేతిలో పెట్టాడు. అభివాద ప్రత్యభివాదానంతరం హనుమంతుడు సుమనోజ్ఞం, సౌమ్యం, విమలం అయిన వాక్యాలతో రామలక్ష్మణుల ప్రసన్నుల కావిస్తూ వినయ విధేయతలు చిందిస్తూ కుశల ప్రసంగానికి పూనుకున్నాడు.

పూజ్యులారా! మీరే దేశాధిపతులు? మీ పవిత్రనామాక్షరాలెట్టివి? దుర్గమమైన ఈ భూములకేల వచ్చితిరి? దేవతాప్రతిమాన మూర్తులు. మునిరాజవేషులు. సువ్రతులు. వియమనిష్ఠులు. వరవర్ణులు, అగ్రహాను గ్రహ సమర్థులు, అభయప్రదాతలు, సౌమ్యగంభీర మూర్తులు. ఈ సరోవరతీరంలో ఏమికోరి తిరుగుతున్నారు? మీ సంచార కారణంగా భయం తెలియని జగమృగకులం పారిపోతున్నది మేం స్థానికులం. వచ్చినపని ఆజ్ఞాపిస్తే శక్తివంచన లేకుండా సాధించిపెట్టుతాం. ఈ పంపా జలానికి, ఈ వికసిత పుష్పవనానికి మెరుగులు దిద్దుతున్నె మీ వీలా రుణ దేవకాంతులు. ప్రాయంలో వున్నారు. హర్యక్షవీక్షణులూ, హర్యక్షవిక్రములూ, వజ్రసన్నిభ బాణబాణాసన హస్తులూ. శ్రీమంతులూ, హస్తిహస్తాభభుజాన్వితులూ, సుందరసురుచిరాకారులూ. బృందారకవంది తులు, శత్రుసంహారణక్షములూ అయిన మీరు నిర్వేదంపొందుతున్నట్లు కనిపిస్తున్నారు. ప్రకృతి వికృతిని పొందకుండా వున్నదే. మీకుకూడా కష్టాలు కలుగుతవా? భద్రసింహాసనంపై ప్రకాశించదగిన మీకు కాననసంచారం చేయవలసిన కార్యం ఏమికల్గినది? ఈ నారచీరలు ఏమిటి? ఈ జటాధారణం ఏమిటి? ఖడ్గకవచతూణీర ధనుర్బాణాలేమిటి? రహస్యం కాదేని దయచేసి చెప్పండి.

అన్యోన్యం సమలక్షణాలు కలవారు. బాంధవ్యం ఎట్టిది? యుగ యుగాల పరిభ్రమణంతో అలసిపోయి విశ్రాంతికోసం మానవులుగా వచ్చిన రవిచంద్రులా మీరు? ఆజానువులు, పరిఘోపమానాలూ. సుంద రములూ, వృత్తములూ అయిన మీ కరములు భూషణరహితంగా

వుంటే పూజ్యులు మన్నించండి మాకూ కావటానికి చాలా మోదం" అని ఆగిపోయారు.

## రాముడు లక్ష్మణునితో హనుమంతుని శ్లాఘిస్తూ చెప్పుట

శివజటాజూట విగ్గళ గంగా ప్రవాహం వలె ప్రవహించిన హనుమాటలు రాముని హృదయతాపం చల్లార్చినై. తానేవి ఆశించి శ్రమ అనుకోకుండా కబంధుని ఆదేశాన్ని అనుసరించివచ్చారో, అవి ఇంత శీఘ్రంగా కార్యరూపం దాల్చినందుకు ఘనంగా సంతోషించారు. సౌమిత్రి తనకెళ్లో ఈ వానరోత్తముడు సుగ్రీవునికి అటువంటివాడే యని ఆనందించారు. పూజ్యభావం పొంగుతూండగా కార్యార్థియైన రామచంద్రుడు కన్నతెమ్మరలకు తలవిమ్మెక్కించే ధోరణిలో తమ్ముని చూచి "సోదరా! మన ప్రతివచనానికి ఈ పూజ్యుడు నిరీక్షిస్తున్నారు. ఈ మతిమంతుడు సుగ్రీవునకు అనుగు చెలికాడూ, ప్రెగ్గడ. మనం ఎవరికోసం ప్రతీక్షిస్తున్నామో ఆయనే ఈ రూపం దాల్చి మన వద్దకువచ్చారు. నెయ్యం, తియ్యం, నేర్పు దీపించేవిధంగా ప్రత్యుత్తరం ఇవ్వు. ఋగ్వేదం చక్కగా తెలిసినవాడూ, యజుర్వేదధారణ చేసినవాడూ, సామవేదంలో ప్రాజ్ఞత్వం గలవాడూ, సరసుడూ, సహృదయుడూ తప్ప ఈ రీతిగా భాషించలేడు. సంపూర్ణ వేదవేదాంగవిదుడు. నవవ్యాకరణాలూ ఎన్నిమారులో పఠించి స్వాధీనాధికారియై జిహ్వాగ్రంలో నటించే మహామేధావి కాక ఇంత మనోహరంగా మాట్లాడలేడు. ఇంత దీర్ఘంగా ప్రసంగించినా అపశబ్దంకాని, ఉచ్చారణ లోపం కాని, అనర్థం కాని, అస్పష్టతకాని, దూరాన్వయ క్లిష్టాన్వయాలు కాని, పూర్వాపర వైరుధ్యం కాని కనిపించలేదు కళ్లల్లోనూ, ముఖంలోను, లలాటం లోను, భ్రుకుటిలోనూ కంచుకాగడా పెట్టివెదకినా దోషం తోపించటం లేదు. కొతుకులు, అతుకులు, యత్నంలేకుండా, స్వాభావికంగా, శంకా రహితంగా. ద్రుతవిలంబితాలు కాకుండా, అతిదీర్ఘం, అతిహ్రస్వం, కఠినశబ్ద సంఘాతం కాని విధంగా, ప్రసాదమధురమైన మహాకవి కావ్యం వలె కర్ణపేయమై, తొస్సులులేకుండా, ఉరోగతస్థితమై మధ్యమ

వ్వరంతో సంస్కృతి సంప్రదాయ సంస్కార మిళితమై వెలువడిన సంస్కృతవాణి వర్ణనార్హం కలది.

ఈతని త్రిస్థలవ్యంజనస్థమైన చిత్రణలో నిర్మాణం ఆగ్రహంతో చంపనెంచి కరవాలం పైకెత్తిన కఠినకమ్మనినైనా కరగిస్తుందంటే అస్మదాదులమాట ఎన్నడం అధిక ప్రసంగం భూపతియైనవాడు ఇటువంటి కార్యజ్ఞుని, పండితుని, క్షేమసంపాదిని దూతగా సంపాదించుకోక పోతే సంకల్పించిన కార్యం సాధించటం సాధ్యంకాదు నిజంగా రవి సూనుడు అదృష్టవంతుడు! ఈ ద్విగ్గుణగణవిశిష్టుడైన దూత ఎవనికడ నిలుస్తాడో అతనికి చతుస్సముద్రముద్రిత ధరావలయంలో పొందరానిదంటూ వుండదు. ప్రభువుల కార్యాలు చాలావరకు దూతల ముఖంగానే తీరుతుంటై. నీవన్నట్లు ఈ శుభసమయంలో ప్రయాణించి ప్రతిఫలం వెంటనే పొందాము. కృతజ్ఞుడైన కబంధుని సూక్తి వ్యర్థం కాలేదు. మన లక్ష్యంలో అర్ధభాగం చేరుకున్నాము. మన వృత్తాంతం వివరించి ఈ దూతను సంతోషపెట్టు" అని చెప్పారు

వాక్యజ్ఞుడైన లక్ష్మణుడు అన్న ఆంతర్యం గుర్తించి అనమాన వాక్యజ్ఞుడైన హనుమానుని తృప్తిపరచే దృష్టితో "ఎక్కడ మొదలు పెట్టి ఎక్కడ ముగించాలి?" అని క్షణకాలం చింతించి, "కపిశేఖరా! నీపట్ల అన్న నుడివిన వాక్యాలు అన్ని రీతుల అన్వర్థాలు నీవు మా వుభయులనుద్దేశించి పలికిన పలుకులన్నీ అట్లే అన్వర్థాలయి ఆయనకే చెల్లుతాయి. అందులో అసత్యం ఏమాత్రం లేదు. నీవు మీ యజమానికెటువంటి వాడవో నేనూ ఈయన కటువంటి వాడనే. మేం కష్టపరిస్థితులన్నీ వెన్నంటి రాగా కానల్లో తిరుగుతున్నాం. మార్గంలో కబంధుడనే వికృతాకారుడు శాపవిల్లి మాచే నిహతుడై దైవరూపం ధరించి, కృతజ్ఞతతో మాకు మీ ఏలికగుణగణాలు వివరించి మిత్రత్వం సంపాదించి ఆయన సహాయంతో కార్యం కడముట్టించండి అని ప్రబోధించాడు. ఆతని నిర్దేశంతోనే ఇక్కడికి వచ్చాం

## సౌమిత్రి హనుమంతునితో తమ వృత్తాంతం చెప్పుట

"ఆయన్ను కలుసుకోవటం ఎలాగని చింతిస్తుంటే నీవు రావటం జరిగింది. మీ ప్రభువు కోరిన ప్రకారం ఆయనతో సఖ్యం చేస్తాము" అని ముగించాడు. వానరవిభుని క్షేమంకోరిన హనుమ వుభయులకు స్నేహం చేకూర్చతలిచి మనస్సులో "నా యజమాని కష్టాలు నేటితో గట్టెక్కినై. ఇంతటివారు స్వయంగా మిత్రార్థులై వచ్చారంటే భార్యారాజ్య ప్రాప్తి లభిస్తుంది. బహుకాలంగా అతని వున్నతికోసం తపించే మాకు ఆనందం కలుగుతుంది" అని భావించి "ఆర్యా! పరోక్షంగానే ఒకరిపై ఒకరికి అభిమానం కలిగివున్నప్పుడు ప్రత్యక్షసంబంధానికి పెద్ద ప్రయత్నంతో పనేలేదు— తమ వృత్తాంతం నేను వినటానికి అర్హుడనైతే వివరించండి ఆపైన జరుగవలసినవన్నీ నేను నిర్వర్తిస్తాను" అని తిరిగి ప్రశ్నించాడు. సౌమిత్రి అన్నవంక చూశాడు. రామచంద్రుడు అనుమతి సూచికంగా శిరఃకంపం చేశాడు

"హనుమా! విను. ద్యుతిమంతుడూ, మతిమంతుడూ అయిన దశరథమహారాజు ధర్మం తప్పక అరవైవేలసంవత్సరాలు అవనీపాలనం చేశాడు. పుత్రార్థం కామేష్టిచేసి అగ్నిప్రసాదంవల్ల నలుగురు పుత్రులను పొందాడు వారిలో జ్యేష్ఠుడు ఈయన. నేనతని తమ్ముడను. మా నామధేయములు రామలక్ష్మణులు. ధర్మసంకట సమయంలో, తండ్రిని సత్యవ్రతునిగా చేయదలచి రాజ్యాధికారం పరిత్యజించి మహిళామణి మకుటమాణిక్యమైన మా వదినతో దండకారణ్యవాసానికి తరలివచ్చారు. ఆయన సద్గుణాలకు వశుడనైన నేను విడిచివుండలేక పరిచారక భావంతో వెంటవచ్చాను. ఈ ప్రాజ్ఞుని, కృతవిజ్ఞుని, సుఖార్హుని, మహార్హుని, భూతరక్షాదక్షరాజదండ సమలంకృతుని చూచి విధి సహించలేక, ముందురాజ్యభ్రష్టుని చేసి, కాంతారవాసం కల్పించి, తుదకు కాంతావియోగం కూడా కల్పించాడు. మేము లేని సమయంలో ఎక్కడి రక్కసుడెవడో ఆమెను అపహరించుకొని పోయాడు. తదన్వేషణలో కబంధుడనే దనుజుడు ఈయనచే శాపముక్తుడై మీ పతిని ఆశ్రయించి

ఆమెవార్తను తెలుసుకుని ప్రతీకారంచేసి పత్నిని గ్రహించుమని ఆదేశిస్తే ఇక్కడికి వచ్చాం.

## సౌమిత్రి, రాముడు సుగ్రీవుని మైత్రికోరి వచ్చినట్లు చెప్పుట

కపిశ్రేష్ఠా! ఈ విషమపరిస్థితిలో నాకూ, నా అన్నకూ మీ ఏలికే శరణ్యం మా అన్నను గూర్చి నేను చెప్పేది అత్యుక్తి కాదు. పునరుక్తి కాదు. ఆయన నామం తారకం. నాకేకాదు, చరాచరజగత్తుకు. ఎవరు వూన షోడశవర్షప్రాయంలో తాటకను హతమార్చాడో, ఎవరు గాధేయుని సవనరక్షణం చేశాడో, ఎవరు శివధనుర్భంగం కావిం చాడో, అజయ్యుడైన పరశురాముని ఎవరు నిర్జించాడో, దుర్జయులైన ఖరదూషణాది చతుర్దశ సహస్ర దానవగణాన్ని ఎక్కడివాళ్ళను అక్కడే కాలుని ఇంటికాపుపెట్టాడో, ఎవరు దండకారణ్యతాపస బాధానివారణుడో, ఎవరు దానగరిమచే పేదల, అర్థుల, సుశ్లోకుల తనియించాడో, సత్యవాక్య పాలనంకోసం ఎవరుసామ్రాజ్యాన్ని త్యాగంచేశాడో అట్టి నా అన్న పీ యధిపతి హస్తస్పర్శకోసం అభయప్రదమైన తన హస్తాన్ని చాస్తున్నారు. సర్వలోకాలకూ శరణ్యుడైనా నా అన్న మీ వానరప్రభువు శరణు కోరు తున్నాడు ఎవని ప్రసాదస్వీకారంచేత గతకల్మషులై, కృతకృత్యులై ప్రజలు సుఖిస్తారో ఆ నాయన్న మీకీశపతి ప్రసాదాన్ని అర్థిస్తున్నారు.

ఎవరు తన దానపటిమచేత, సౌజన్యంచేత, పరాక్రమంచేత, సత్యసంధత చేత, ధారణీపతుల సేవలనందుకున్నారో ఆ రఘుకులతిలకుడు నా అన్న మీ కపీశ్వరుణ్ణి స్నేహ హస్తం చాచి చేరవచ్చారు. పావనీ! శోకాభిభూతుడైన శ్రీరాముడు విధివంచితుడై, ఆశ్రయం కోరి వచ్చాడని సుగ్రీవుడు తాశి పొందునట్లుగా చెప్పు. గుణవంతులకు శరణాగతి రక్షణం వెన్నతో పెట్టిన విద్య. కాలచక్రభ్రమణంలో గతి తప్పిన నా అన్నను వుదాసీన భావంతో పరిహరించక చేయి చేయి కలిపి స్నేహం చేయటం ఆయనకు అర్హమైన కార్యమని వాక్కు వక్కాణించు. అదృష్టం అనేది ఒక్కసారే తలుపు తడుతుంది... జీవిక వస్తుంది. ఆ అవకాశం వ్యర్థం చేసికొని ప్రాణావసానం వరకు వగ్చా

శాపంతో ప్రసగ్గటం ప్రాజ్ఞుల లక్షణం కాదని వివరించు" అని వుద్వేగంతోనూ, అభిమానంతోనూ, కన్నీటి కాల్వలతోనూ, కార్యసాధన బుద్ధితోనూ చెప్పారు.

సౌమిత్రి చెపుతున్న రామకథ విని హృదయ నిర్వేదకంగా బాధపడి అంజనాసూనుడు "రామానుజా! శోకించకు. కార్యవాదివై ఆత్మ ప్రత్యయాన్ని అణచుకొని మాటాడవలసి వచ్చిందే అని అభిమాన పడకు. నేను గాని, సుగ్రీవుడు కాని. మిమ్మల్ని లఘుదృష్టితో చూడలేదు. భావించలేదు. మీసహకారం లభిస్తే చాలునని ఆశించాం. అది సంభవమా అని ఆశంకించాం మీ కష్టగాథ తెలియలేదు కాని నీవు ఈ మహాప్రభువును గూర్చి చేసిన ప్రశంస మేం ఇద్దర్నీ చేరాం. నీవేమీ తక్కువాడవు కావు. అన్నపైగల అభిమానంకొద్దీ నిన్ను నీవు తగ్గించుకున్నావు. మాకు మీ ఇరువురూ వందనీయులే. పూజార్హులే అగ్ని వేరూ, ప్రకాశం వేరూ అవుతుందా? చంద్రచంద్రికలు విడివడి వుంటవా? పుష్పపరిమళాలు భిన్నంగా లభ్యం అవుతాయా? జీవాత్మ పరమాత్మలు వేరువేరు మూర్తులా? లౌకికలౌకికాలు మనోధర్మ దూరాలా? మీతో చెలిమి మా రాజుకు అదృష్టంగా వచ్చిన కలిమి. మీరు సామాన్యులను శరణు కోరామని చింతించవచ్చు. కాని అట్లు భావించవద్దు రవిపుత్రుడు సామాన్యుడేమీ కాదు. కొన్ని కారణాల వల్ల అన్నకు లొంగిపోవలసి వచ్చింది కాని లేకుంటే త్రిభువనాల్లో అతనికి దీటైన యోధుడు లేడు. వాలిని మించిన శక్తి కలవారు మేం కూడా మీ శరణుముందే చొచ్చాం. న్యూనతాధిక్యాలు మిత్రులు కాబోయేవారు ఎంచకోరాదు హృదయ విదారకమైన రామప్రభువు కష్టగాథ చెప్పావు. కరుణరసప్రధానమైన సూర్యసుతుని దయనీయ చరిత్ర సానుభూతితో విను.

వాలిసుగ్రీవులు అన్నదమ్ములు. ఋక్షరజునకు ఇంద్రసూర్యుల అనుగ్రహంచేత ఆత్మజులుగా ఆవిర్భవించారు వాలి ఘోర తపస్సుచే ముక్కంటిని మెప్పించి అజేయమైన వరాలు గ్రహించాడు తండ్రి అనుగ్రహంచే తరుగని బలం పొందాడు. మంచివాడే కాని విచక్షణాశూన్యుడు. ముక్కోపి. గర్విష్ఠి. అతడు జరిగిన విషయం సత్యమని విశ్వసించక అగ్ర

హంతో తమ్ముణ్ణి తన్ని తరుముటయే కాక అధర్మంగా దారహరణం కూడా చేశారు. అనుకూల కాలం కోసం మేమీ అననీ ధరాన్ని ఆశ్రయించి వున్నాం. ఆశించిన శుభకాలం మీ రాకతో వచ్చింది. మీరు సీతాసాధ్వి అన్వేషణా విషయంలో చింతపడవద్దు మా దృశకీశ సహాయ సంపదతో చెలికాని కార్యం శీఘ్రంతో నిర్వహిస్తాడు దుఃఖభారాన్ని తొలగించి సంతోషంతో నా యజమానిని కలుసుకొనుటకు దయ చేయండి. మీ రాకతో ఆయన మనశ్శల్యం పంచ బంగారమైపోతుంది. పరమానందంతో మిమ్మల్ని ఆహ్వానిస్తాడు" అని పావని తీయని మాటలు చెప్పి ముగించాడు. తనవలె భార్యావియోగ దుఃఖితుడయిన సూర్యపుత్రుడు అంతులోని బాధ అనుభవ పూర్వకంగా తెలిసినవాడు కనుక ఆలస్యం లేకుండా అన్వేషణ చేయిస్తాడని రాముడు తృప్తితో నిశ్వాసం విడిచాడు. సౌమిత్రి యథార్థవిధి ప్లవగ శ్రేష్ఠుని పూజాదికాల సత్కరించి "అన్నా! వెదుకదలచిన తీగ కాళ్ళకే తగిలినట్లు మిత్రుడు కూడ తుల్యకార్యార్థి. మారుతి ప్రియమైన సత్యం చెప్పాడు స్నేహితులిద్దరు తుల్యావస్థలో నున్నందున చెలిమి శాశ్వతంగా శుభాంతంగా ముగుస్తుంది. ఆయననుంచి ప్రయోజనం మనం అర్థించినట్లే మనవల్ల ప్రయోజనం ఆయన ఆశించాడు కనుక హెచ్చుతగ్గులు. గౌరవా గౌరవాలు ఇందులో లేవు మనం కృతకృత్యులమైనాం. ఆచరణలో అస్ఖలితుడే కాక ప్రసంగంలో కూడ అస్ఖలితుండయిన హనుమ మాటలు అవశ్యం ఆచరణీయం అనుసరణీయం. నేను నిశితంగా ఈ పూజ్యుని పరిశీలించి ఋతభాషి అనీ, విశ్వాసపాత్రుడనీ గ్రహించాను. ఇందు మోసం లేదు సరికదా మీ ఇరువురు గాఢమిత్రులు కావలెనన్న ఆశయం కూడా ఈ మేధావి మదిలో గూఢంగా వుంది అన్నివిధాలా ఈ మైత్రి అర్హత కలది. నాకు తోచిన మాటలు చెప్పాను. ఇక నీ ఆజ్ఞానుసారం వర్తిస్తాను" అని అన్న తమ్ముని మాటలకు రాముడు సంతోషంతో, మారుతి వంకచూస్తూ "తథాస్తు" అన్నాడు. రామచంద్రుని నోట వెడలిన ఆమాటలు కోటి వరాహాల మూటలుగా హనుమంతుడు భావించి, వెంటనే తన భిక్షుక రూపాన్ని పరిత్యజించి నైజరూపంతో ఇన వంశోత్తముల ముందు నిల్చాడు. ఆతని సహజ స్వరూపం రామలక్ష్మణులకు హృదయంలో

చెరగని ముద్ర వేసింది. రామమూర్తి మనస్సులో ఏవేవో అచింత్య భావాలు స్ఫురించి అదృశ్యమైనై.

## హనుమంతుడు రామలక్ష్మణులను సుగ్రీవుని కడకు కొనిపోవుట

అట్లే హనుమంతుని హృదయంలో సృష్టి ప్రారంభంలో పెనవేసుకున్న అభిమానాధిక్యత తటుక్కున మెరిసింది. కనులు మూసి తద్రూపాన్ని దర్శించి ధన్యుడనయినానని తలంచాడు. "పూజ్యులారా! ఇంక తడవెందుకు? శుభస్య శీఘ్రం అన్నారు కదా! ఇరువురు నా అంస దేశాన్ని అధిష్ఠించండి. నా మిత్రుడున్న చోటికి కొనిపోతాను" సూక్ష్మదేహుడయి నిల్చాడు. అద్భుతాశ్చర్యాలతో రామలక్ష్మణులు ఆంజనేయుని అంసతలంపైన ఆసీనులైనారు. ప్రహృష్టుడూ, సుమతీ, వుగ్రజవుడూ, వరిష్ఠుడూ అయిన హనుమ త్రుటికాలంలో సుగ్రీవుని ముందు వ్రాలాడు. వారిని వుచిత ప్రదేశంలో కూర్చుండ బెట్టి సుగ్రీవుని సమీపించి, ప్రభూ! కార్యం అనుకూలంగా సాధింపబడ్డది. వారిని కొనివచ్చి అశోకతరువు క్రింద ఆసనాలపై అధివసింపచేసి వచ్చాను. మనం చూచిన వారిలో నీలమేఘశ్యామైన శరీరం కలవాడు రాముడు. మహాద్యుతి దీప్త విగ్రహుడు అతని తమ్ముడు లక్ష్మణుడు. రాముడు సత్య శౌర్యుడు మహాత్ముడు. సూర్యకుల సంజాతుడు సత్యవ్రతుడు దశరథ మహీపతి తనయుడు. పితృవాక్య పాలకుడు భార్యాసోదరులతో అరణ్యంలో తిరుగుతుండగా వారు లేని సమయంలో రావణుడు మాయతో ఆమెను అపహరించాడట. ఆమెను వెదకుతుండగా కబంధుడు నిన్ను కలవుమని పంపగా వచ్చాడు. రాజసూయ మహాధ్వరంలో శతసహస్ర గోవులను, ధన కనక వస్తు వాహనాలను అఖండంగా దానం చేసిన పంక్తిరథుని ప్రథమ పుత్రుడు, సకల లోక సంరక్షకుడయినవాడు. విధివిధానంలో క్రుంగిపోయి నిన్ను శరణుజొచ్చాడు. వారిపట్ల లఘుభావం వదలి మనకంటే అన్నితెరగుల ఆధిక్యం గలవారుగా గుర్తించి పూజించు. నీ కార్యం కదముట్టుతుంది. పోయిన

మంత్రులు తిరిగి పొందుతావు. భాషాచాతుర్యం కానీ అస్పష్టత కానీ ప్రసంగంలో లేకుండా భాషించు పోదాం రమ్మని సుగ్రీవుని తోడ్కొని వచ్చాడు.

ఆత్మసచివుడయిన హనుమంతుడు కొనిరాగా, ఎవరిని చూచి వాలి పంపున వచ్చినవారని అకారణంగా భయపడ్డాడో వారే హితులుగా వచ్చినందుకు పరమామోదాన్ని భజించాడు. సహజ వానరరూపం వుపసంహరించి మానవాకారంతో వారి సమక్షానికి వచ్చాడు. రాగానే రాముడు లేవగా పరాస్పరాలింగనం చేసుకున్నారు అనంతరం అతిధిమర్యాదలు కొనసాగినై. అందరు సుఖోపవిష్టులైనారు రవిసుతుడు దశరధ సుతుని చూచి గౌరవ పురస్కృతంగా "ఆర్యా! మా పావని మీ అమేయమైన గుణగణాలని వివరించాడు. విన్నప్పటి కంటె కన్నప్పుడు ఆ గుణాలు అధికంగా కనుపించినై మీవంటి కారణజన్ములు సహజ చాపల్యంగల వానరులతో మైత్రి గోరి రావటం మా అదృష్టం నేను అందుకు అర్హుడనని భావించటం అంతకంటె అదృష్టం మీ సౌజన్యం. మీ వుదారాశయం, మీ శౌర్యగరిమ నేటినుండి ఈ యనాధునకు "శ్రీరామరక్ష" అగుగాక

## శ్రీరాముడు సుగ్రీవునితో సఖ్యంచేసుకొనుటకు అంగీకరించుట

దాశరధీ! నాతో నీకు నెయ్యం ఇష్టమైతే విందుమనస్సుతో నా చేతిలో చేయి వేయి. నీ అనుగ్రహాన్ని అర్థిస్తూ ఇదిగో హస్తం చాస్తున్నాను. అభయప్రదానరక్షమైన నీ హస్తం నా చేతిలో పెట్టి ఆశ్రితావనశీలురు ఇక్ష్వాకులన్న కీర్తిని ఇనుమడింప చేయి" అంటూ కుడిచేతిని చాచాడు. ఆ మాటలువిని మత్తకుంజాల గమనంతో నడచి మైత్రికి చిహ్నంగా రవిసుతుని హస్తంలో తనదక్షిణ హస్తంవుంచి చాసచేపి గాఢంగా పరిరంభణంచేశాడు భిక్షుకరూపంలోవున్న హనుమ వానరరూపందాల్చి ఆనందాశ్రులు చిందగా చయ్యనపోయి సమిధలు కొనివచ్చి జ్వాల రగిల్చి ఇరువురిమధ్య అగ్నిని ప్రతిష్ఠించాడు. వారు ప్రకాశిస్తున్న వీతిహోత్రుని పూజించి ప్రదక్షిణించారు. ఇరువురూ "మనసా, వాచా, కర్మణా ప్రతిజ్ఞాపాలనం చేస్తాం. మైత్రీభంగం కలుగనీయం" అని ప్రమాణస్వీకారం మున్నారు పఠించి

చేశారు. అంతస్తాపం ఇరువురికీ వశించింది. ప్రసన్నముఖాలతో, తేరిన హృదయాలతో రాముని రవిపుత్రుడూ, రవిసుతుని రాముడూ కరవు కొన్నట్లు శరీరం పులకలతో నిండగా చూచుకొనసాగారు. తృప్తి కలిగినట్లు లేదు. ఆ వీక్షణములు అన్యపదార్థాలపై ప్రసరించటంలేదు. అహో! అది కదా సజ్జనుల కృతజ్ఞతాభావలక్షణం! పలుకులేక, చలనంలేక, కను గొనల బాష్పబిందువులు ముత్యాలలాగా మెరయగా, పరస్పరాలోకనానంద పారవశ్యంలో రామసుగ్రీవులు సాలభంజికలైనారు.

పెక్కుదినాలకు వారిలో సంతోషోత్సాహాలు వికసించినందుకు, సౌమిత్రి పావనులు తమ సేవలు ఫలించినందుకు "చరితార్థులమైనా"మన్న భావంతో ఒకరికొకరు కృతజ్ఞత తెలుపు దృష్టులతో చూచుకున్నారు. హనుమంతుడు బహువర్ణమైన వికసిత పుష్పశాఖ విరిచి తెచ్చి వారి నడుమవేయగా దానిపై రామసుగ్రీవులు సన్నిహితులుగా కూర్చున్నారు. రామునికి చేరువగా లక్ష్మణుడూ, సుగ్రీవునికి సమీపంగా మారుతీ ముందరగా కూర్చున్నారు. సుగ్రీవుడు సుహృన్మణీ! రామచంద్రా! దూరదర్శులైన లక్ష్మణ పావనుల సామర్థ్యంతో మన కష్టసుఖాలు ఏకీకృతమై మైత్రీసూత్రంతో బంధింప బడ్డవి. అన్యోన్యం అరమరలేకుండా ఆప్తులమైనాం. పావని నా కథ క్లుప్తంగా మీకు చెప్పాడు. యథాతథంగా వివరిస్తాను. కాలాతిక్రమణం కాకుండా ఆతిథ్యం స్వీకరించి విశ్రాంతి తీసుకొనండి. హనుమా! ఆహార శాలకు పోదామా" అనగానే "ఈ మంగళ ప్రదేశంలోనే అగ్నికి నివేదించి అందరం ఆరగించుదాం" అంటూ అవసర కృత్యాలకు కపులను నియ మించాడు. సూర్యుడు గగనమధ్యస్థుడైనాడు. మిత్రుల కలయికతో కష్టగాధ అర్ధానికి చేరింది.

## సుగ్రీవుడు రామునితో వాలి తనకుచేసిన అపకారం చెప్పుట

శ్రీరామ సుగ్రీవులూ, లక్ష్మణపావనులూ, కపులూ, సచివులూ కలసి ఆనందోత్సాహాలు మిన్నుముట్టగా ఆహారస్వీకారం చేశారు. కొంత కాలం ప్రియభాషణం చేశారు. పుష్పితభూజాలు సూర్యాతపాన్ని గ్రహించి మలయానిలుని ద్వారా శైత్య స్వాగతం కూర్చినవి. రామచంద్రునిహస్తాన్ని

రవిపుత్రుడు పల్కుతూ, "రఘు వంశదీపకా! రామా! మహావిక్రముడైన నా అన్న వాలి పయనించి, కఠినకర్ముడై రాజ్యసుఖాలకు దూరంచేసి బలాత్కారంగా నా భార్యను చెరపట్టి నన్ను పురంనుండి వెళ్ళగొట్టాడు. నేనతనిని నిగ్రహించలేక, దేవదానవయక్షగంధర్వ నరకిన్నర సాధ్య మరుద్గణాలను రక్షణకోసం ఆశ్రయించాను. వారంతా వాలిపేరు వినగానే "నీకాశ్రయం ఇచ్చి వాలితో తల గోక్కోలేం. నీ రక్షణ చేయలేము. మా ప్రాణాలు మాకు దక్కవు, పొమ్మన్నారు. ఆశ్రయరహితుడనై, నన్నాశ్రయించి కష్టకాలంలో కూడ విడువక వెంటనున్న ఈ నలుగురు మంత్రులతో, కొంత కపిబలంతో ఈ కొండ రక్షణగా ఇక్కడ తలదాచు కున్నాను. రాజ్యబహిష్కారం, భార్యాపహరణంచేత కలిగిన దానిన్నా స్వేచ్ఛా జీవితానికి దూరమైన నా బ్రతుకు సుఖమైన వాసము కల్పిస్తావని బయట ఎక్కడ కనుపించక బ్రదుకీడుము. ఈ కొండకుమాత్రం రాడు. ఆర్తితో అల్లాడుతున్న నన్ను, నీ వల్లని కరుణార్ద్రదృష్టితో చూచి వాలి చేత వధింపబడకుండా నాకు ప్రాణదానం చేయి. నా జీవితాంధకారానికి వెలుగును ప్రసాదించు. నాకీ కష్టకాలంలో అపరాజిత శక్తిమంతుడైన ఈ హనుమంతుడే అండగా ఉన్నాడు. అతనితో ఆతడు యుద్ధం చేయడు. నన్ను మాత్రం క్షమించడు. నామీదికి వచ్చినప్పుడల్లా ఈ హనుమ అడ్డు నిల్చాననే వెళ్ళిపోతాడు. ఒంటరిగా వాలి వస్తాడు. ఏ సమయంలో ఎక్కడవుంటాడో ఎలా వస్తాడో తెలియక ప్రాణం అరచేతపెట్టుకొని అజ్ఞాత వాసం చేస్తున్నాను. ఈనాటికి దైవం మెచ్చి నా దయనీయ జీవితానికి నిన్ను చూపించాడు. నన్ను నలుగురిలో ఒకడుగా జీవించే విధంగా అనుగ్రహించు. నీ శరణు కోరాను" అంటూ ఘోరంగా శోకించాడు.

## శ్రీరాముడు వాలిని వధిస్తానని ప్రతిజ్ఞ చేయుట

మిత్రుడైన మిత్రపుత్రుని ప్రేమమీర కౌగిలిచేర్చి, ఓదార్చి, తుష్టిపుష్టికరాలైన మాటలతో సేదదేర్చి. "మిత్రమా! ఇక్ష్వాకుల నాశ్రయించి ఇంతవరకు ఎవ్వరు వ్యర్థులు కాలేదు. అందులో ఆశ్రితుడవై, నాకాశ్ర

యం మార్చి నీవు వ్యర్థుడవెలా అవుతావు? రాముడు మాట ఇచ్చినప్పుడే నీ శత్రువు మరణించాడు. నీవేమీ సందేహించకు. ఉపకారఫలం నేను బాగా ఎరుగుదును. నీ కపకారంచేసిన వాలిని నేలపాలు చేసి, నీ తారనూ, రాజ్యాన్నీ నీకు సమర్పిస్తాను. సూర్యచంద్రులు సాక్షిగా, నా కోదండం సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను" అని ధనువును స్పృశించాడు. ఆ సమయంలో-

"సీతాకపీంద్రక్షణదాచరాణాం, రాజీవహేమజ్వలనోపమాని
సుగ్రీవరామప్రణయప్రసంగే, వామాని నేత్రాణి సమం స్ఫురంతి"

(రాముడు ప్రతిజ్ఞ చేయగానే సీతకూ, వాలికీ, రావణునికీ, కమలంవలె బంగారంవలె అగ్నివలె ప్రకాశించే నేత్రాలు ఎడమభాగంలో వున్నవి సమానంగా అదిరినై. సీత స్త్రీ కనుక వామపక్షం అదిరి శుభం సూచించింది. వాలీ, రావణుడూ పురుషులు కనుక కీడు సూచించినై) "వానరేశ్వరా! విదీర్ణ పర్వతంగా నీ విరోధి ఈ ఘోరబాణంతో నేల కూలుతాడు. నా శరాలు, అమోఘాలు, మహితీక్ష్ణముఖాలు, ఋజుపర్వాలు. నీవిక శత్రుచింత విడచి సుఖంగా వుండు"మని ధైర్యం చెప్పాడు. వాలితో వైరం వచ్చినప్పటినుంచీ ఇంతవరకు ఇటువంటి సాదరవాక్యాలు శ్రవణాలు వినలేదు. సుగ్రీవుడు ప్రఫుల్లమనస్కుడైనాడు. "హితమణీ! నా సంకట స్థితి నశించిపోయింది. పునర్జీవితుడనైనట్లు పొంగిపోతున్నాను. వాలి మహాపరాక్రమశాలి. అతణ్ణి నిర్జించటం అనుకున్నంత తేలికపని కాదు. నీవాతని ఎలా నిర్జించతలపోశావో ఆ విధంగా చేసి నన్ను నిముక్తుణ్ణి చేయి" అని మనవి చేసుకున్నాడు.

## శ్రీరామునితో సుగ్రీవుడు సీతను కొనితెస్తానని ప్రతిజ్ఞ చేయుట

అనంతరం తనకింత ప్రియమైన వాక్యాలు చెప్పి ప్రతినచేసిన మిత్రుడు తత్క్షణం సంతోషించేలాగా "రామచంద్రా! దాశరథివై, క్షత్రి

యుడవైన నీవు శరణాగతత్రాణుడవు కావటంలో ఆశ్చర్యంలేదు. నేను జాతిచేత కోతినైనా కృతజ్ఞతాభావం కలవాణ్ణి. నీవలె సత్యధర్మాలపై ఆసక్తి కలవాణ్ణి. మిత్రధర్మాన్ని బాగా ఎరిగినవాణ్ణి. నా మంత్రులలో మహామేధావి, చిరంజీవి, ఘటనాఘటనా సమర్థుడు మారుతి మీరడవికి వచ్చినది మొదలు నేటివరకు జరిగిన సంఘటనలు యథావిధిగా వివరించాడు. నీ పితృవాక్య పరిపాలనానిష్ఠా, తాపసరక్షణం, ఖరదూషణ కబంధాది రాక్షసవధా, అసమయంలో అసురుడు నీ అర్థాంగిని అపహరించటం సహాయపడిన జటాయువు మరణంవిని ఎంతో బాధపడ్డాను ఇక నీవుకూడ పడినంత కాలం కష్టం పడవలసిన పనిలేదు. భార్యావియోగమైన దుఃఖం ఎట్టిదో స్వానుభవంగా తెలిసినవాణ్ణి కనుక ఆ దుఃఖం త్వరలో అంతం అయ్యేట్టు జానకి వార్త తెప్పిస్తాను. ఆ దస్యుడు తన పురంలోనే కాదు పద్నాల్గులోకాలలో ఎక్కడ దాచినా చతుర్వేదాలు మీనమూర్తి సముద్రంలో నుంచి కొనివచ్చి విరించికి ఇచ్చినట్లు సాధించి తెచ్చి నీ కప్పస్తాను. సమరమే సంభవిస్తే నీ సహాయంతో, మారుతి ఆధారంతో సర్వలోకాలను దగ్ధం చేసైనా జానకిని తెస్తాను నా మాటలు సత్యాలని నమ్ము. ఇందుకు పంచభూతాలు, అష్టదిక్కులు, ముక్కోటిదేవతలు, దివాకరనిశాకరులు సాక్షులు మాతల్లి జానకిని జీర్ణం చేసుకోటం విరించి సృష్టికి సాధ్యంకాదు. ఆకలి విపరీతంగా అవుతున్నదని విషాన్నం తెలిసి ఎవరూ తినరు. తెలియక తింటే బ్రతుకదు. నేటినుండి నీవు కూడా విచారం విడిచిపెట్టు. ఇక ఆమె నీ అర్థాంగే కాదు మాకపికులానికి తల్లి. ఆమెను వెదకితెచ్చే భారం మాది. మేమొక సంఘటన తిలకించాం. నీ గాథ కది ఏమైనా అనువర్తిస్తుందేమో ఆలకించు మేం నలుగురం ఇక్కడ వుండగా రావణుడు మనోవేగంతో ఒక పవిత్ర స్త్రీ మూర్తిని భుజంపై ధరించి ఆకాశంలో పారిపోతుంటే చూచాం. ఆవిడ హా! రామా! హా లక్ష్మణా! అని ఎలుగెత్తి ఏడుస్తూంది. అప్పుడు మాకేం అర్థం కాకపోయినా ఇప్పుడామె సీత అని తెలుస్తూంది. మేం చూచినప్పుడు, రావణుని భుజంమంచి సర్పాంగనవలే వ్రేలాడుతూంది. ముఖం కనుపించలేదు. "రామా, లక్ష్మణా" అన్నమాటలూ, ఏడుపూ వినిపించినై. అప్పుడు మేం మనస్సులు బాగాలేక ఆ విషయం పట్టించుకోలేదు. ఆమె మాత్రం

అవకాశంవస్తే క్రిందికి దూకాలన్నట్లు ప్రయత్నిస్తూంది పర్వతంపైన వున్న మమ్మల్ని ఆమె చూచింది.

## జానకి క్రిందపడవేసిన ఆభరణాలు సుగ్రీవుడు రామునకు చూపుట

రామచంద్రా! ఆమె ఎంతోఆశతో ఆభరణాలను వుత్తరీయం చించి అందులో మూటగట్టి క్రింద పడవేసింది. ఆ మూటసరిగా మేంవున్నచోటనే వచ్చిపడింది దాన్ని నేను బిలంలో భద్రంగా దాచాను. అవి నీ అర్ధాంగివేమో చూచిచెప్పు." అనగానే, "మిత్రమా! కాల విలంబనం ఎందుకు? వెంటనే తెప్పించు" అని రాముడు అన్నాడు. సుగ్రీవుడు కందరం లోపలికిపోయి దాచిన ఆభరణాల మూట తెచ్చి మిత్రుని ముందుంచాడు. రాముడు చీరచెరగును, భూషణాలనూ చూడగానే శోకంపొంగి వజ్రాహతికి పర్వతంవలె "హా! సీతా! ప్రాణేశ్వరీ!" అంటూ పడిమూర్ఛిల్లాడు. సౌమిత్రీ రవిసుతుడూ వుపచారంచేయగా తెలివితెచ్చుకుని, "తమ్ముడా! అశ్రుపూర్ణమై నేత్రాలు ఆభరణాలు జానకివేమో గుర్తింపలేకున్నాను, నీవు చూచి చెప్పు" మన్నాడు సౌమిత్రి గద్గద కంఠంతో "అన్నా వదిన కేయూరాలుకానీ. కర్ణ కుండలాలు కానీ, మరి ఏయితర పరిష్కారాలు కానీ నేనెరుగను. ఆమెకు నిత్యం పాదాభివందనం చేస్తాను కనుక అందెలు మాత్రం గుర్తింపగలనేమో" అని సమాధానం చెప్పాడు; రాముడా భూషణాలను గుండెలపై పెట్టుకుని హత్తుకుంటూ "జానకీ! నాపై నీకెంత అనురాగం వుందో, నీవెంత దూరదృష్టి కలదానివో ఇదివరకు నాకొక్కడికే తెలుసు. ఇప్పుడు ఈ పని ద్వారా లోకానికే తెలిసింది. "నేను నీచేత విముక్తిపొందుతాననే ఆశతో జీవిస్తానని, ఏనాటికైనా ఈ ఆభరణ చేలాంచలాల గుర్తుతో శత్రువునికి తెలుసుకుని దండించు మని నీవు చేసినపని ప్రబోధం చేస్తూంది నీవు నాకప్పెట్టిన కార్య భారాన్ని పూర్ణంగా నిర్వహిస్తాను నీ హృదయానికి శాంతి కల్పిస్తాను. నానుంచి నిన్నెడబాపిన ఆ పాపుని కులక్షయం చేస్తాను మిత్రమా!

7166

రావణుడు కొనిపోతూండగా చూచానన్నావు. అతడే దిక్కుగా పయనించాడు; వాని నివాసం ఎక్కడ; వాని శక్తిసామర్థ్యాలెట్టివి; నీకు తెలియని విషయం లోకంలో లేదని కబంధుడు చెప్పాడు చెప్పు. వాడికి లోకంతో నేటితో సంబంధం తీరిపోతుంది" అని తీవ్రంగా అన్నాడు.

## సుగ్రీవుడు రామునకు ధైర్యంచెప్పుట

ఆ వాక్యతీవ్రతకూ, కోపకంపిత కాయానికి, రవిపుత్రుడు విభ్రాంతపోయాడు. "ఈ సమయంలో కర్తవ్యం ఏమిటని"ని గాఢంగా ఆలోచించాడు. "రావణవృత్తాంతం తనకు పూర్ణంగా తెలుసు. అయితే అంతమాత్రంచేత ప్రయోజనం ఏముంది; ముందు జానకి ఎక్కడ వుందో జాడ తెలియాలి ఆపై చేయవలసిన పని చేయాలి. అంతే కాని వేగిరపడి కార్యం వ్యర్థం చేయరాదు. రాము మిత్రుడు. ఆమె వార్త తెలుసుకుని తెచ్చి అప్పగించే పని తనమీద పెట్టుకున్నాడు. కనుక ఈ విషయంలో నిర్ణయాలన్నీ తనే చేయాలి మిత్రుడు ఆ విధంగా ఆచరించాలి. అలాకాక, మిత్రుని తొందరపాటు చూచి, తాను కూడా తొందరపడి, కార్యభారం, సాధనమార్గం విచారించక, శత్రువు విషయం ఇప్పుడేచెపితే ప్రమాదం వస్తుంది. ప్రయత్నం చెడుతుంది. తన ప్రతిజ్ఞ పొల్లవుతుంది. కనుక మార్గాంతరం త్రొక్కాలి. ఆ మార్గం ఋజుధర్మ మారమైనా, రాజనీతిలో ధర్మంగా సాధించవచ్చు" అని నిర్ణయించుకుని "మిత్రమా! రావణుని శక్తి, వున్న చోటూ తెలిపి నంత మాత్రాన ప్రయోజనం ఏముంది? అసలు తెలియవలసింది జానకి క్షేమవార్త. అతడామెను ఎక్కడవుంచాడో, ఏపద్ధతిలో వుంచాడో ఎరగకుండానే శత్రువును చంపించినందువల్ల నష్టంతప్ప లాభంలేదు. నేను ప్రతిజ్ఞచేసి చెప్పాను గదా సీతామాతను తెచ్చి నీ కర్పిస్తానని. అందుకు చేయవలసినవన్నీ నేను చేస్తాను. నీవా విషయాన్ని గురించి విచారించవలసిన అవసరంలేదు. ఇది తొందర పాటుకు సమయం కాదు. అది కార్యవైఫల్యానికి కారణమవుతుంది.

నీవు ధీరోదాత్తుడవు. చెప్పనేర్చినవాడివి. ధైర్యాన్ని, తేజాన్ని వదలి వేదనపొందుతుంటే అస్మాదులు వరిదిద్దగలరా? నీ శర కోదండ పాండిత్యాన్ని, నీ మేరుగంభీరమూర్తి నీ చూచుకుంటూ కార్యరంగం లోకి దిగబోతున్న మాకు ఇంక గతి ఏమిటి? భార్యా వియోగబాధ ఎంతటిదో నేనెరుగనా? నేనింత దుఃఖపడుతున్నానా? మూర్ఖుణ్ణి, కోతిజాతివాణ్ణి, నేనే ఇంత నిబ్బరంగావుంటే, జితేంద్రియుడవు, ధర్మ వ్రతుడవు నీవు బేలవుకావటం ధర్మమా?

కారే కన్నీటివాహినికి ధైర్యం అనే ఆనకట్టవేసి ఆపు. సత్వం గలవాడు వ్యవస్థారూపమైన ధృతి విడనాడుతాడా? వ్యసనార్త పరిస్థితు లలో బుద్ధిమంతుడు విగ్రహం కోలుపోతాడా? ఎప్పుడూ శోకించే వారు సముద్రంలో ఓడవలె కష్టాల్లో మునిగిపోతారు. కాని పాధించి గట్టెక్కలేరు. రెండుచేతులూ మోడ్చి నిన్ను ప్రార్థిస్తున్నాను. స్నేహాన్ని గుర్తించి నన్ను మన్నించు వగపును దూరంచేయి. పౌరుషాన్ని పూర్తగా పరిగ్రహించు. దుఃఖితునకు లోకంలో సౌఖ్యాలు దూరం అవుతవి. తేజోహీనత ప్రాప్తిస్తుంది. క్రమక్రమంగా విరాశ, జీవితంపై రోతా హెచ్చుతుంది. అన్ని అనర్థాలకు కారణమైన శోకాన్ని అవకరించు నీకు వుపదేశం చేసే అధికారిని కాను. చెలిమితో కూడిన వినువును క్షైకొని ఇంతగా మాట్లాడాను. నీవు యథామతివై యున్నప్పుడు నీకు బోధింపగలవారు త్రిభువనాలల్లో లేరు. స్నేహాన్ని గౌరవించి, మిత్రుని మాట మన్నించి, అందలి సత్యాన్ని ఆదరించి చిత్తవిదాహకరమైన మోహ శోకాలను విసర్జించి ధృతిమంతుడవై ప్రకా శించు" అని హెచ్చరించాడు.

సుగ్రీవుడు సమయానుకూలంగా శాంత సమ్మతాలైన వాక్యాలు వివరిస్తుంటే రాముడు క్రమంగా కోలుకుని, నెయ్యం తియ్యం పెంపొందేలాగా రవిసుతుని చేరదీసుకుని కంటినీరు తుడుచుకుంటూ, "ఏ సమయంలో ఏది చేయాలో చక్కగా తెలిపి ప్రసంగించి ప్రబోధం చేసిన నీవు నిజంగా నా మిత్రశబ్దాన్ని సార్థకంచేశావు. అక్కరవేళ ఆదుకునేవాడే బంధువు. ఆపదలో అడ్డుపడినవాడే మిత్రుడు. ఇందులో

ఏ ఒక్కగుణం సవ్యంగా కలవాళ్ళు లోకంలో దొరకటం కష్టం. నా అదృష్టం వల్ల రెండింటినీ సమానంగా గలిగిన నిన్ను హితునిగా సంపాదించుకున్నాను. సంపద సమృద్ధంగా వున్నప్పుడు చుట్టాలూ, వ్యసనలంపటులై ధనం వెచ్చించే రోజుల్లో చెలికాళ్ళూ, వద్దన్నా వదలకుండా ఒద్దకువస్తారు. నేను అన్ని విధాలా హతభాగ్యుణ్ణి అయినా ఆశ్రయం ఇచ్చి చెంతకు చేర్చావు. సీతావియోగసముద్ర తరణానికి తరణిగా నిలిచావు. నీ సాధువచనాలు నా మనస్తాపం శమింపచేయటమే కాక ద్రఢిమకూడా ప్రసాదించినై. ఆ రౌద్రకర్ముడైన రావణుని గూర్చి ఏవిధంగా వ్యవహరించాలో, జానకివార్త ఎలా సంపాదించాలో బుద్ధిమంతులైన సచివులతో సంప్రతించి నిర్ణయించు. నన్నిప్పుడేమి చేయమంటావో జంకు మాని, సంశయంవదిలి చెప్పు. వానాకాలంలో బీజావాపనం చేయటానికి సన్నద్ధపరచిన మేలిమడిలాగా నన్ను భావించు. నేనిపుడాడిన మాటలు వ్యర్థాభిమాన పూర్వకాలనీ, అధరమధురాలనీ, ఏమోలే అనీ సందేహంతో అపకర్ణించకు సుమా! ఈ రాముడు పూర్వం అనృతం ఆడలేదు. ఇకముందుకూడా ఆడడు. తన శక్తికి మించి వాగ్దానం చేయడు. కార్యార్థిఐనా కలుషపథంలో పయనించడు. రాముడు సత్యవ్రతుడనీ, సత్యపరాక్రముడనీ, సత్యంపై శపథంచేసి చెపుతున్నాడు" అని మేఘఘోషణంగా సుగ్రీవునితో అన్నాడు

## సుగ్రీవుడు శ్రీరాముని మైత్రి కొనియాడుట

ఆ మాటలు విన్న వానరపతి ఆనందసముద్రంలో తేలిపోయాడు. అర్హతగల అధికారి ప్రాపకం దొరికినందుకు అంతర్వ్యథ సమూలంగా తుడిచిపెట్టాడు. లోకాతీత విక్రమశాలియైన వాలివల్ల తనకింక ఏ విధమైన బాధలేదనీ, శత్రువిజయం తథ్యమనీ ఆత్మవిశ్వాసం పొందాడు. ఇంతటి శక్తిమంతుల, పరోపకారపరాయణుల తనకు ఆత్మీయులుగా చేసిన హనుమంతుని అనంతవిధాలుగా అభినందించాడు. సౌమిత్రి

ర్థిజన భాగధేయా! అమృతహృదయా! రఘు
వంశమండనా! రాక్షసకులఖండనా! రామా! హృత్తాపనివారణసోమా!

విశాలంగా నేనిప్పుడు విగ్గరనాథునకైన అనుగ్రాహ్యుడనయ్యాను. అందుకు అధికారం నీవు ఆదరించి మిత్రహస్తంతో నన్ను అనుగ్రహించటమే. నీవు సంకల్పిస్తే స్వరాజ్యం ఏమిలెక్క స్వారాజ్యమే వస్తుంది. నేడు నన్ను విరసించిన బంధువులకు, అవమానించిన అన్నకూ, ప్రాణ మిత్రులకూ పూజ్యతముడనైనాను. నీకనురూప మిత్రుణ్ణి క్రమంగా నీవే గ్రహిస్తావు. ఆత్మస్తుతి! నా హృదయం అంగీకరించదు. ఆచరణలో తెలియతగినదాన్ని ఆస్యంలో పెట్టటం అధముల లక్షణం నా కృతజ్ఞాభావం క్రియాపూర్వకమేకాని వాగాడంబరం కలదికాదు సాధువులు, స్నేహితులనూ, వెండి, బంగారూ సొమ్ములనూ ఒకే విలువలో చూస్తారు ధనవంతుడైనా, ధనహీనుడయినా, దుఃఖితుడైనా, సుఖియైనా, నిందితుడైనా, నిర్దోషియైనా మిత్రుడెన్నటికీ మిత్రుడే. సంఘంలో అతని స్థానం సంచలనాత్మకం కావచ్చు కాని, మిత్రునిపట్ల మాత్రం భేదభావాన్ని పొందదు ధనంపోయినా, సుఖంపోయినా, చివరకు తనువే పోయినా మిత్రుడైనవాడు మిత్రునికి అపకారం చేయడు. జరిగితే చూచి సహించడు అందుకు నిదర్శనం నా అమాత్యులే. అందులో ఈ అంజనా పుత్రుడు అగ్రేసరుడు

ఇటువంటి మిత్రులచే సంస్కారం పొందిన ఈ రవి సూనుడు వ్యతిరేక పథాలంబి ఎందుకు అవుతాడు? అపకారికి ప్రత్యుపకారం అయినా చేయక కేవలం కృతఘ్నుడుగా మాత్రం జీవించడు" అని తన మనోగతాన్ని వెలువరించాడు. ఈ విధంగా రామ సుగ్రీవుల ప్రణయ ప్రసంగాలతో కొంత ప్రొద్దుపుచ్చారు. అంతవరకు రామ లక్ష్మణులు కూర్చున్న కొమ్మ ఆకులూ, పూలూ వాడిపోవటంతో సుగ్రీవుడు లేచి నాల్గు వైపులామాచి పత్ర పుష్పాలు సమంగా వుంచి పరపుగా, విశాలంగా వున్న సాల శాఖ విరిచితెచ్చి సూర్యాసనం కల్పించాడు. దానిపై రాముడూ, రవి సుతుడూ ఆసీనులైనారు. వెను వెంటనే హనుమపోయి మరొక వృక్ష శాఖ తెచ్చి ముందు వైపగా లక్ష్మణుకు కూర్చున్నాడు. ప్లవగ శ్రేష్ఠులు తమకు తగిన కొమ్మలు తెచ్చుకుని పరచి సుఖాసీనులైనారు. ఇట్లందరూ సంతోషంగా వున్న సమయంలో భానుజుడు భానుకులజుని వీక్షించి

"మిత్రుడా! పేరంపెంచి, నా అన్న వాలి పీడనుంచి వెళ్ళగొడితే బాధా మయమైన ఈ దేహాన్ని రక్షించుకుంటానికి ఈ ధరాధరాన్ని ఆశ్రయించు కుని వున్నాను. జగద్వ్యాపనోదివైన నీ శరణుచొచ్చాను నీటముంచినా, పాలముంచినా నీదేభారం." అని చెప్పగా విన్న రాముడు చిన్న మంద హాసం చేసి; "చెలికాడా! మాటి మాటికి దీనునివలె నన్ను నీవు కొంచె పరచుకుని మాటాడవద్దు నీ దృష్టి నాపట్ల చాలా గొప్పదేకదా! నీ వంత గొప్పనుకున్న నేను నిన్ను శరణుకోరలేదా! కాలచక్ర పరిభ్రమణంలో పెద్దాపిన్నా తారతమ్యాలు కానీ; కలవారూ లేనివారూ అన్నభేదంగానీ లేదు. అవ్యాహతంగా దొరలే ఆ చక్రాల క్రింద కర్మాధీనులై పుట్టిన జీవులు నలిగిపోవలసిందే. మేలుచేయటం మిత్రధర్మం కీడు చేయటం శత్రు ధర్మం. ముందు నీకుకల్గిన కుందుపోగొట్టుతాను. అధర్మవారికి ధర్మోప దేశాలు తలకెక్కవు. దండ నీతితో కాని దారికిరాడు నీవు నన్ను నిజంగా విశ్వసించినా; నీ శత్రువైన వాలి బల పరాక్రమాల నెదుర్కొన గలడా! అన్న సందియం లేకపోలేదు. ఇంకొకమారు విస్పష్టంగా వివ రిస్తాను. రాముని అస్త్ర విద్యా గురువు విశ్వామిత్ర మహర్షులవారు.

అతుల మహాజనములూ; ద్యుతిమంతములూ; ఉగ్రరూప వంక లితములూ; హేమపుంఖములూ; స్కందవనోద్భవములూ; అప్రతిహత ములూ: వజ్రకర్కశములూ: ఆశనిశరములు అని ప్రయోగ సమయంలో పగగొన్న భయంకర సర్పంలాగా ప్రతిపక్షిపై పడటానికి సిద్ధపడతై: అవి తాకిన జీవి బ్రదుకటం కల్ల. నాచేత వాలి ఖండింప బడతాడు ఆ క్షణమే రాజ్యంతో పాటు రమణీస్వీకారం కూడా చేయిస్తాను." అంటూ ఆశావహుణ్ణి చేశాడు. "రామా! నీమేలు మరువలేను కోర్కులకు నీవే గతి నేను శోక నిహతుణ్ణి. నీవు అగ్నిసాక్షిగా చేతిలో చేయివేసి స్నేహ సంభావనంతో ప్రాణదానం కూడా చేశావు గనుక నా వ్యథ నీకు పూర్ణంగా చెప్పాలనివుంది వైద్యుని ముందు రోగం దాచుకున్న ఫలమేం వస్తుంది? విషయం తెలియక ప్రతీకారానికి మంత్రాంగం ఎలా సాధ్యమవుతుంది? అందుకే జరిగిన కథ ఆ మూల చూడం నీకు తెలిపితే అర్థవంతంగా కార్యం అనుసంధానించగలవన్న ఆశతో" అంటూ బాష్పావరోధనయద్వయుడై:

దగ్గుత్తికతో ఆ పై మాటలు పలుకలేక ఆగిపోయాడు. అంతలో నిగ్రహించుకుని; కన్నులు తుడుచుకుని; ఇట్లుగా నిట్టూర్చి చెప్పసాగాడు.

## వాలి పరిభవించిన విధం రామునితో సుగ్రీవుడు వివరంగా వినిపించుట

"హితమణీ! నా విషాద గాథ వినిపిస్తాను. విహిత మనస్కుడవై విను. ఈ కిష్కింధకు వాలి రాజయి కీశ లోకాన్ని పాలిస్తున్నప్పుడు నేను యువరాజుగా వుండేవాణ్ణి. అది అతనికి ఎంతమాత్రం ఇష్టంలేదు. ఏదో సాకుతో నన్ను దూషిస్తూ వుండేవాడు. నేను అన్న పెద్దవాడు; అంతే అన్నాదని సహించి నా విధి నేను నిర్వర్తిస్తూ కాలం గడిపేవాణ్ణి. ఆ స్థితి కూడ అతనికి అంగీకారం లేదు. కారణం. నేనంటే కపిలోకం అతని కంటే అధికంగా గౌరవించటం. ఒకరోజు ఆకస్మికంగా నా మిత్రులనూ; బంధువులనూ; నా మేలుకోరే భటవర్గాన్ని బంధించి చెరసాలల్లో చేర్చాడు. అంతఃపురంలో వున్న నా అర్ధాంగిని బలాత్కారంగా తన అంతిపురికి చేర్చి నన్ను క్రూరంగా హింసించి: పట్టణంలోనుంచి బయటికి గెంటివేశాడు. నేను ప్రతీకారభావంతో నిఖిల విశ్వం చుట్టి తగిన నేస్తం దొరకుతాడేమో యని తాపత్రయంతో గాలించాను. ఎవ్వరూ నాకు రక్షణ ఈయలేమన్నారు. తిరిగి తిరిగి విసిగివేసారి చివరకు ఈ శిఖరాన్ని చేరుకుని నన్ను ననుసరించి వచ్చినవారితో ఇక్కడ తలదాచుకున్నాను. ఎప్పటికైనా నేను తనకు అపకారం చేస్తానని అనుమానంతో నాపైకి వానర సహస్రాన్ని వధించమని పంపేవాడు. వానర సైన్యం వచ్చి నన్ను నానా బాధలు పెట్టి తుదకు నాచేత నిహతమయ్యేది. ఈ విధంగా ఎన్నో సార్లు వాలి పంపటం. వచ్చిన వాళ్ళు నాచేత చావటం జరిగిపోయింది. యాదమరచి పర్వతం దాటి పరిసరాల్లో తిరుగుతుంటే అదాటున వచ్చి నన్ను చంపటానికి సిద్ధపడుతుంటే హనుమ కల్పించుకుని అడ్డుపడేవాడు. హనుమ రాగానే నన్ను విడిచి నగరానికి పోయేవాడు. ఇప్పటికీ నా ప్రాణాల మీద కన్నువేసి వుంచాడు. కాని పూర్వంవలె కొట్లాటలు మాత్రం మానుకున్నాడు. మారుతి నాకు అండగా వుండటమే అందుకు కారణం. మీరు పంపాతీర వనంలో సంచ

శిష్టాంటే చూచి భయపడింది వాలి పంపగా వచ్చిన వారనే భావంతో నే మిత్రమా! ఈ నలుగురు మిత్రుల సహాయంతోనే ఇంతవరకూ జీవించ గల్గాను. చల్లకు వచ్చి ముంత దాచుకున్న ప్రయోజనం ఏమివుంది? చివరి మాట చెపుతున్నా: రామచంద్రా! వాలిన విక్రమం కలవాడు వాలి. పరాక్రమశాలి. రిపులపాలికిలి. ఆతడు నేల కూలిన కాక నా దుఃఖా శమించదు. నిద్రపట్టదు. కుడుపు నోటికి రుచించదు. అంతకంతకు అధికం అవుతున్న ఆర్తిని అణచుకోలేక వుచితానుచితాలు చూడ కుండా చెప్పిందే చెప్పి నీకు విసుగు పుట్టిస్తున్నాను. ఎటువంటివాడైనా స్నేహితునికి ఒక్క స్నేహితుడే స్త్రీ భర్తకూ; పురుషుడు మిత్రునకూ కాక ఇంకెవరికి చెప్పు కుంటారు? ఆదరించినా నిరాకరించినా నేను నీవే దిక్కని నమ్ముకున్నాను" అని ఆవాక్ప్రవాహానికి అడ్డంవేస్తూ "మిత్రుడా! నీ బాధ నాకు విన్నప్పుడే అర్థమైంది. కర్తవ్యం కూడా నిర్ణయమైంది నీవు చెప్పిందంతా నిజమని విశ్వాసం కూడా కలిగింది. నీ దుఃఖం తొలగిస్తానని మాట ఇవ్వడం కూడా జరిగింది కాని, నాకొక్క సందేహం మిగిలింది. ఏకోదరులు కదా! ఇంతవిరావి మత్సరం ఎందుకు వాలికి కలిగింది? నీవు సహజంగానే గుణసంపన్నుడవు. వాలి పరాక్రమశాలే కాక, వివేకశాలి అని కూడా చెప్పావు. ఆ కారణం యథావిధిగా నేను చేయబోయే కార్యం నీకు చెప్పాలనుకున్నాను. కేవలం ఏకపక్షవాదం విని కార్యరంగంలో దిగటం మంచిది కాదు. ఇక్ష్వాకులు శరణాగత రక్షణంతోపాటు సత్యధర్మరక్షణంకూడా చూస్తారు. చేస్తారు. నేను నిన్ను శంకించి అడుగుతున్నానని చిన్నబుచ్చుకోవద్దు లోకం నన్ను శంకిస్తుంది. పత్నీవియోగం భరించలేక వ్యామోహంలోపడి రాముడు చేయరాని పనిచేశాడని నన్ను నిందించుతుంది. అన్వయించుకోలేని అల్పమతులు నోటికి వచ్చినట్లు నన్నాడిపోసుకుంటారు దుర్జనులు నా చేతను అయినవానికీ కానిదానికీ అపార్థం చెప్పి సమర్థించుకుంటారు. అందుకు అడుగుతున్నాను ఏమీ అనుకోవద్దు దీనివల్ల ఆనుపూర్వికంగా నీ కథ అవగతమవుతుంది; అందుకు నే కైకొన్న ప్రతిక్రియకూడా అర్థ మవుతుంది.

నీ అవమానపాటు కథ క్లుప్తంగా విన్నా న్యాయధర్మాలు నీవల్ల వున్నట్లు గుర్తించే నీకు వాగ్దానం చేశాను. అది కూడ విని శత్రుపక్షం మన పక్షం బలాబలాల తారతమ్యం తెలుసుకుని కార్యాన్ని చక్కబెట్టుతాను. నాలో ప్రజ్వరిల్లుతున్న ఆగ్రహాగ్నిని అణచిపెట్టాను. జలదాగమనంలో జలంలోపల వుద్వేగం పొందినట్లు నాకోపం మూర్ఛిల్లుతుంది నీ విరోధి నాకూ విరోధే విల్లు మోపెట్టకముందే విచారించతగినవన్నీ విచారించాలె. ధనువునుండి శరమోక్షం జరిగితే ధరణినుండి శత్రుమోక్షం వెంటనే జరుగుతుంది. ఐశ్వర్యాపకాశాల అమితవకాలంలో అల్పులు వక్రమార్గావలంబినులవుతారు. నిర్ధన నిష్పృహ నిరాశోపహతులై కూడ సజ్జనులు సత్యధర్మాలను వదిలిపెట్టరు. నేను సూర్యవంశజుణ్ణి. నీవు సూర్యపుత్రుడవు. పురదూలం భార్యా వియోగ దుఃఖితులమే. శంకారహితుడవై. శాంతమతివై సంగతులు సవివరంగా చెప్పు" అని రాముడన్నాడు.

## అన్నతో వైరం వచ్చినవిధం సుగ్రీవుడు రామునకు చెప్పుట

"రఘువంశదీపికా! రామచంద్రా! నీ హృదయం ఎంత అగాధమైందో ఇప్పుడు తెలుసుకున్నాను. ఆపత్సమయమైనా, ఆర్తరక్షణం అవశ్య కర్తవ్యమైనా ధర్మదూరంకాని నీ నిర్ణయాలు లోకానికి శిరోధార్యాలు. ఇంతవరకు వాలిచేసిన అపకారాలే చెప్పాను. వైరం మాకు ఎందుకు వచ్చిందో నిజంగా చెప్పలేదు. నీకు శత్రుమిత్రులూ, ప్రత్యక్షపరోక్షాలూ ఒక్కటే. నీవు శిక్షించేది ధర్మచ్యుతులనే; కాని ధర్మసంచారులను కాదని గ్రహించాను ఏ విషయం బుద్ధిపూర్వకంగా దాచానో అదే బయటికి లాగావు నేను ఎలా చేశానో, అలాగే చెపుతున్నాను ధర్మాధర్మనిర్ణయం నీకే వదులుతున్నాను

మా తండ్రికి మేం ఇద్దరం కొడుకులం. పెద్దవాడు వాలి. రెండో వాణ్ణి నేను. మా తండ్రి జీవించినంతకాలం నన్నూ, జనకుణ్ణి ఎంతో గౌరవాదరాలతో చూచాడు ఆయన మరణించగానే మంత్రులూ, పౌరులూ సంప్రదాయసమ్మతంగా కపిరాజ్యానికి అన్నను రాజు చేశారు. నిజకులాగత రాజ్యాన్ని గ్రహించి, నిపుణతతోనూ, నియతితోనూ సర్వావర సంతృప్తి

కరంగా అన్న పాలిస్తూంటే, నేను యువరాజుగా వుండి వినయవిధేయలతో బంటువలె సేవించేవాణ్ణి ఆయనకూడ నాపట్ల సోదర వాత్సల్యం చూపుతూ ప్రవర్తించేవాడు. ఇలా సామరస్య వాతావరణంలో చాలాకాలం గడిచింది. ఒకనాడు అర్ధరాత్రివేళ "మాయావి" అనేవాడు కిష్కింధకు వచ్చాడు. "మయు"నికి పుత్రుడు, "దుందుభి"కి అన్న. ఆ సమయంలో కిష్కింధా నగరం నిద్రాముద్రితంగా వుంది. అన్నకూ, అతనికీ ఒక అమ్మాయి కారణంగా వైరం వచ్చింది. ఆ పగ తీర్చుకుంటానికి పనిగట్టుకుని వచ్చి అంతఃపుర ప్రవేశద్వారంవద్ద నిలిచి దిశలు బ్రద్దలయ్యేలాగా అరుస్తూ వాలిని పోట్లాటకు పిలిచాడు. ఆ కేకలు విని పుష్కరథరంలాగా దవగోచి ష్కేఖరులాగా చిటపటలాడుతూ వాలి మేల్కొని, తల్పంపైనుంచి క్రిందకు దూకి శాప్రవాభిముఖంగా పోతుంటే కాంతలూ, నేనూ అడ్డుపడి ఇది వేళ కాదని వినయంగా ఎంత చెప్పినా వినక మమ్మల్ని అహంకారంతో హుమ్మని త్రోసివేసి పోసాగాడు ఒంటరిగా పోతున్న అన్నను వదలక నేనూ వెంటపోయాను ఆ దానవుడు కులపర్వతాలవలె వస్తున్న మమ్మల్ని చూచి వాకిలివద్దనుంచి పారిపోవటం మొదలుపెట్టాడు వెన్నెలవెలుగు తోడువడగా అతని వెన్నంటి మేమూ పరుగెత్తాం వాడు పోయి పోయి, దట్టంగావున్న తీగలతో చుట్టబడి పెనుమ్రాకుల గుంపుతో నిండి భూమి లోనికి పోయే పెద్ద బిలంలో దూరాడు. మేం కూడా ఆ బిలాన్ని చేరుకున్నాం. నన్నుచూచి అన్న నే వచ్చేవరకు నీవిక్కడే వుండుమని చెప్పి బిలంలో దూరాడు. నేనూ వస్తానని ఎంతో బ్రతిమాలాను. వినక తన పాదాలపై ఒట్టుపెట్టి నన్నక్కడే వుంచి ఒక్కడే శరవేగంతో లోనికిపోయాడు

అన్న ఆజ్ఞప్రకారం పళ్ళూ దుంపలూ తింటూ పదియల్లో నీళ్ళు త్రాగుతూ ఒక వత్సరకాలం బిలముఖంలో గడిపాను. ఆ అగాధబిలంలో నుండి నురుగులు గట్టి నెత్తురు ప్రవహించసాగింది. దానికి తోడుగా దానవుల అరుపులు మిన్నుముట్టినై. నడుమ నడుమ వాలి కంఠధ్వనితో యుద్ధంలో దెబ్బలుతిని పడిపోతున్నట్లుకూడ కేకలు వినవచ్చినై. నా అన్న ఆ దైత్యుల చేతుల్లో పడి మరణించాడని బాధతో పెద్దకొండను తెచ్చి గుహాద్వారం మూసి ఉదకక్రియలు తీర్చి పట్టణానికి తిరిగివచ్చాను. కాని,

అన్న వృత్తాంతం అమాత్యులకుకానీ, అంతఃపుర స్త్రీలకు కానీ చెప్పలేదు. మంత్రులు మాత్రం గూఢచారులద్వారా కొంత విషయాన్ని సేకరించి పట్టుబట్టి నన్ను రాజ్యానికి రాజుచేశారు. నేను న్యాయ ధర్మసమ్మతంగా పాలిస్తున్నాను. ఒకదినం హఠాత్తుగ నా అన్న విజయుడై కిష్కింధకు వచ్చాడు. సింహాసనంపైన వున్న నన్నుచూచి దురాగ్రహంతో "ఓరీ! నీచుడా! నిన్ను తమ్ముడవని కదా బిలంవద్ద కాపుంచి లోపలికి సమరం చేయటానికి పోయింది. "నీ ఆజ్ఞ నాకే మన్నట్లు నేను వెలికిరాకుండా పెనురాతితో రంధ్రం మూసి నగరంవచ్చి పౌరులను మంత్రులను భయపెట్టి పట్టం కట్టుకుని భోగలాలసుడవై కులుకుతున్నావా? ఛీ. నీ మొగం చూస్తే పంచమహాపాపాలు చుట్టుకుంటై. నీవింత దుర్బుద్ధివని ఎన్నడూ అనుకోలేదంటూ, నావారినీ, మంత్రులనూ బలవంతంగా బందెలో త్రోశాడు. ఆసమయంలో అతణ్ణి నిగ్రహించే అవకాశం నాకు వుండికూడా వుపేక్షించినందుకు నా కిప్పుడు ప్రాణాలకే ముప్పు వచ్చింది.

విజయగర్వంతో వచ్చి. నా వాలినీ. నన్నూ హింసించినా, శాంతంతో "అన్నా! మా అదృష్టంకొద్దీ దానవుణ్ణి చంపి విజయలక్ష్మీ సమేతుడవై మాకానందం కల్గించావు. దిక్కులేని నాకు నీవే దిక్కు. శలాకమూ చంద్రభాసుర ఛత్రమూ నేను పట్టుకుంటాను. నీ రాక నిరీక్షిస్తూ సంవత్సర కాలం గడిపాను. తర్వాత నెత్తుటాల్వలూ, అసురుల అరుపులూ అంతకంతకు అధికం కాసాగినై. ఎంత జాగ్రత్తగా విన్నా నీ కంఠస్వరం వినపడలేదు. చూచి చూచి, విసుగెత్తి, నీవు మరణించినట్లుగా నిశ్చయించుకొని, ఆ దానవుడు తిరిగి వెలుపలికి రాకుండా పర్వతంతో బిలం మూసి ఇంటికి వచ్చాను. దుఃఖంతో వచ్చిన నన్ను చూచి, నీ వృత్తాంతం కోసం అన్వేషణ చేయించి, చివరకు నా సచివులు నాకీ పట్టం కట్టారు. నేనంగీకరించక పోయినా బలవంతంగా అందరు పట్టుబట్టి ఈ భారం నెత్తిన పెట్టారు. నేను దురుద్దేశం కలిగి ఈ పని చేయలేదు. నీవులేక అరాజకంగా వున్న కపిలోకానికి తాత్కాలికంగా పౌరులు ఇచ్చితే ఇచ్చినవాణ్ణే కాని రాజ్యంమీద ఆసక్తితో చేయలేదు. ఇక నీవే సర్వం గ్రహించి పూర్వంలాగా నన్ను ఆదరించు. నీ పాదముల మీద ప్రమాణం చేస్తున్నాను. నా తప్పు క్షమించు" మని ఎన్నోవిధాల నేను

కున్నాము. ఆయన అంగీకరించలేదు. ఆగ్రహాన్ని పరిత్యజించ లేదు వెంటనే పౌరులతో, మంత్రులతో, బంధువులతో గొప్ప సమావేశం ఏర్పాటు చేశాడు. ఆ మహాసభలో నన్ను చూపిస్తూ, "ఒకనాటి రాత్రి దానవుడు యుద్ధ నిమిత్తం సన్నద్ధుడయి రాగా, వాని పిలుపు విని, అంతః పురం వదలి వాడికోసం వస్తుంటే, ఈ నికృష్టుడు నా వెంట వచ్చాడు. ఆ రక్కసుడు మమ్మల్ని చూచి పారిపోవటం, వెనువెంట మేం వెళ్ళటం మీరు చూసినదే. ఆ మాయావి పారిపోయి పెద్ద భూవివరంలో దూర బడ్డాడు. ఈ భ్రాతృ ద్రోహిని బిలముఖంలో నే వచ్చేవరకు వుండుమని చెప్పి లోనికి ప్రవేశించాను. విజయం పొందకుండా పురానికి రానని ప్రతిజ్ఞ చేసి వెళ్ళాను. ఆ మాయావి పేరుకు తగినట్లుగానే బహుకాలం ఆ లోపల కనుపించలేదు. ఎట్లో చివరకు వాని వునికి గుర్తించి యుద్ధానికి తల పడ్డాను. అప్పటికే వత్సరం గడిచిపోయింది. రాక్షసులు వుసిళ్ళగుంపు వచ్చినట్లు నాపై పడేవారు. నేను వాళ్ళను అంతకనిలయానికి పంపేవాణ్ణి. మొత్తం మూలసైన్యం చావగా చివరకు వాడు నా చేతికి చిక్కాడు వానిని కాటిపట్టను రెండుగా తొక్కి చీల్చినట్లు చీల్చి వెనుదిరిగి రాసాగాను. పోయే సమయంలో వెలుతురున్న భాగం అంతా చీకటితో నిండిపోయింది. అతికష్టంమీద బిలముఖాన్ని చేరి "సుగ్రీవా! సుగ్రీవా!" అని పిల్చాను. ఎంత మొత్తుకున్నా ప్రతిధ్వని రాలేదు. చివరకా కొండను కాలితో తన్ని దారి కల్పించుకుని వచ్చాను. జరిగిన కథ విన్నారు కదా ఈ ద్రోహి అన్న యన్న గౌరవం కూడా లేకుండా అనురాగం మాట తలపెట్టక నేను భూవివరంలో ప్రవేశించగానే బిలం మూసివచ్చి రాజ్యాన్ని గ్రహించి నాకు చేయరాని అవమానం చేశాడు. ఇక వీణ్ణి క్షమించను. ఇప్పుడే నాకింత ద్రోహం తలపెట్టిన ఈ నీచుడు ముందు ముందు ఏం ప్రమాదాలు తెచ్చి పెడతాడో, వీనికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తున్నా"నంటూ నన్ను కఠినంగా కొట్టాడు. ఒంటి వస్త్రంతో విలపిస్తున్నవాణ్ణి విడిచినట్లే బయటికి నెట్టాడు. బలవంతంగా నా భార్యను చేపట్టాడు. ఈ గట్టు దిక్కుగా గడుపుతున్నాను అంతా విన్నావు కదా: రామా! నీ పాదసాక్షిగా యథార్థం చెప్పాను. ఇక తోచిన విధంగా చేయి" అని సుగ్రీవుడు చెప్పాడు. అంతా ఆలకించి రాముడు "మిత్రుడా! వినవలసినదంతా

విన్నాము. వాలిపట్ల నీ ప్రవర్తన ఆక్షేపణీయం కాను కాని, అనాలోచిత మైంది మాత్రం అగును. మహాబలశాలి వాలి అని తెలిసిన నీవు అనురుడి చేత మరణించాడని భావించటం, బిలముఖం మూయటం సమర్థనీయం కాదు. సంవత్సరం సంసార సుఖాలకూ, రాజభోగాలకూ దూరం కావటం యౌవనోద్రేకం, సరియైన మార్గం వుపదేశించే బుద్ధిమంతులు సమక్షంలో లేకపోవటం, కాలిలక్షణం కలసి విన్నావిధంగా చేయించినై. అంతేకాని అపకారభావంతో నీవు చేయలేదు. అతని ఆగ్రహానికి కొంత కారణం వున్నా, రాజ్యబహిష్కారం, అంతఃపుర ద్రోహం విధించతగిన శిక్షలు మాత్రం కావు. అందుచే అతడు తప్పక దండనార్హుడే. ఎంతవరకు వాలి నా కంట పడడో అంతకాలం ఆయుఃప్రమాణం కలిగి సుఖిస్తాడు. ముమ్ముందు నీ కార్యం చక్కచేస్తాము" అని రవిపుత్రుడు సంతోషించు సమాధానం చెప్పాడు.

## వాలి బలపరాక్రమాలు సుగ్రీవుడు రామునికి చెప్పుట

ఉత్సాహోద్వేగ పరవశుడై సూర్యసుతుడు "చండకోదండధారీ! ఖరఖరదూషణ విదారీ! నీ కోదండ విర్ముక్తమైన శిత మార్గణ కోటి యుగాంత భాస్కరోద్ధత కరాళవలె శత్రువుల క్షణంలో కాల్చి బూడి దైపోవుగా చేస్తుంది. సందేహం లేదు. ఐనా, వాలి బలపరాక్రమాలు తల పునకు వస్తే మనస్సు చేయిపెట్టి కలచినట్లుగా అవుతుంది. అందుకు ముందుగా అతని శక్తిని గురించి చెపుతాను అది విని అపాయం లేని ఉపాయం ఏదో ఆలోచించు. మా బాల్యంలో వున్నతోన్నత పర్వతాలను పెకలించి గోళీలవలె ఆటలాడేవాడు. తూర్పు సముద్రంనుంచి పడమర సముద్రం వరకూ, దక్షిణవారి విధినుంచి వుత్తరవారి విధివరకూ ప్రయా ణించి వుదయం కాకపూర్వమే సూర్యునకర్ఘ్య ప్రదానం విధివిధానంగా నిత్యం చేస్తారు. ఆయాసంతో నిట్టూర్పు కూడా విడువడు. అప్పుడప్పుడు స్వీయబల ప్రకటనకు అసాధ్యమైన వృక్షాలను పెకలించి తుంటెతుండేలుగా త్రుంచివేస్తాడు. వరిగర్వితులైన రాక్షసులు ఎందరెందరో వచ్చి ప్రాణాలు కొందరు పోగొట్టుకొనగా, పాదాక్రాంతులై ప్రాణం దక్కించుకొని కొందరు

పారిపోయారు. ఇంతవరకు అతనితో తలపడి తల యెత్తుకుని పోయిన వీరుణ్ణి నేను చూడలేదు. అన్నిటికంటే అద్భుతమయిన అన్న బలప్రదర్శన గాథ చెప్తా విను.

## దుందుభి చరిత్ర రామునకు రవిపుత్రుడు చెప్పుట

మా సోదరులకు వైరానికి కారణమైన మాయావి కథ విన్నావు కదా. అతని మరణానంతరం అతని తమ్ముడు "దుందుభి" వాలిపై పగ తీర్చుకునే నిమిత్తం ఘోర తపస్సు చేసి అసాధ్యమైన వరాలు పొందాడు. కైలాసశిఖరం అంత కాయం కలవాడు. అసుర సహస్రనాగాధిక బలుడు. ముందు తన పరాక్రమం పరీక్షించుకుంటానికి వారివద్దకు వెళ్ళి నాతో యుద్ధంచేయుమన్నాడు. ఆ మత్తుని పొగరు చూచి "నీతో పోరే శక్తి నాకు లేదు నీకు తగినవాణ్ణి చెపుతాను ఈశ్వరునికి మామ హిమశైలం. తాపసాశ్రయుడూ. బహుదరీ ఝరీవిభాసితుడూ, ఓషధీపతి. అన్నివిధాలా అతడు నీకు సాటివస్తాడు. అవసరం కలిగితే అతనితో సమరం చేయు" మని చెప్పాడు. ఆ మాటలు విన్న దుందుభి సాగరుణ్ణి శక్తిహీనుడిగా భావించి, శరాసనముక్త శరవేగంతో హిమవంతుని వద్దకు పోయి తన కొమ్ములతో గండశిలలు కుల్చి, వృక్షరాజిని విధ్వంసంచేయ మొదలెట్టాడు హిమవంతుడు మేఘాకారంతో శృంగ గతుడయి "రాక్షసేశ్వరా! నిర్హేతుకంగా నన్నెందుకురాయిడిచేస్తున్నావు? నేను సాధువులయిన తాపసులకు ఆశ్రయం ఇచ్చేవాడిని తగాదాల జోలికి పోను. నీ పట్ల ఎన్నడూ అనుచితంగా ప్రవర్తించలేదే మరి నాతో ఎందుకు తలపడినట్టు?" చెప్పమన్నాడు శీతశైల పలికిన పలుకులు విన్న దుందుభి "ఓ నగరాజా. నీ మాటలు వింటూంటే నీవు భయపడుతున్నావని తెలుస్తూంది. నీకు శక్తి లేకపోతే నీ జోలికి రాను నాతో పోరగల యోధుడెక్కడ వున్నాడో చెప్పు అక్కడికే పోతాను" అన్నాడు. "రాక్షసశ్రేష్ఠా! నీకు తిరుగులేని వీరుణ్ణి పరిచయం చేస్తాను. అతనితో పోరింతర్వాత ఇంకెక్కడా పోరాటానికి పోవు. దెబ్బకు దెబ్బ తీయగల శక్తిశాలి. "వాలి" వనేచరుడు. కిష్కింధాపతి నీ కోరిక ప్రకారం యుద్ధం చేస్తాడు. నముచికి వాసవుడు

లాగా నీకు తప్పక ఆహవభిక్ష పెడతాడు. అంతా అతడే చక్కబెడతాడు. ఆలస్యం చేయకుండా ఇప్పుడే పొ" మ్మని హిమవంతుడు చెప్పగా విని "అసలు అతనితో నాకు వైరం వుండనే వున్నది" అంటూ భూమి కంపించేలాగా కులపర్వతాలు గోడు పడేలాగా, దుస్సహ విక్రముడయిన దుందుభి మహిషవేషం ధరించి కిష్కింధకు వచ్చి పురబాహ్యోద్యానాన్ని పాడుచేసి, కొమ్ములతో కుమ్మి అంతఃపుర ద్వార దేశాన్ని రెండుగా చీల్చి, వానకాలమున మొయిళ్ళవలె కర్ణభేదనంగా దుందుభి ధ్వానంతో గర్జించసాగాడు. ఆ కర్కశరావం విన్న వాలి నిశాకాంతుడు తారలలో వలె అంతఃపుర కాంతలతో అసురుడున్న చోటికి అరుగుదెంచాడు. ఎదుటనున్న కాసరాకృతి గల దనుజుణ్ణి చూచి, "మందమతీ! దుందుభీ! నేను నిన్నెరుగుదును. వృథా కంఠశోష నీకెందుకు? భూమిపై బ్రతకాలనుకుంటే వెంటనే నగరం విడిచి వెళ్ళిపో. నాకు అనవసరంగా ఆగ్రహం తెప్పించకు. వచ్చినదారి నీకు వుండనే వున్నది. పొ" మ్మన్నాడు.

## దుందుభి వాలితో యుద్ధం చేసి చచ్చుట

ఆ మాటలు అసురుని శుష్క కాననంలో బడ్డ అగ్నివలె భగ్గున మండించినై. "వానరపతీ! వాలీ! నీ క్రోధచేష్టలు నా కడ చెల్లుబడి కావు. నేను వచ్చింది నిన్ను మా అన్నను చేర్చటానికి సుమా. ఆడవాళ్ళమధ్య ప్రగల్భాలు కొట్టినంత మాత్రాన ఈ అసురేంద్రుడు భీతుడయి పారిపోతా డనుకున్నావా? పౌరుషశాలివైతే నాతో పోరాడు. నీ భుజబల విక్రమాన్ని క్రియారూపంగా చూపించు. అంతేకాని డంబాలెందుకు? ఇప్పుడు వేళ కాదంటవా? వేగుదాకా నేను ఇక్కడే వుంటాను. అంతిపురికి పోయి హాయి హాయిగా అంగనాసుఖం అనుభవించు. ఈయదగిన వారందరికీ ధనం దానంగా ఇమ్ము. అంగనల ఆలింగన సుఖాన్ని పొమ్ము. విలాసినులతో కూడు. చివరిసారిగా పట్నం నలుమూలలా చూడు. నీ యనంతర వారసునకు అధికారం దత్తంచేయి. ఆ తర్వాత తీరుబడిగా రణానికి రా. నీవిప్పుడు మత్తుడవూ, ప్రమత్తుడవూ, సుప్తుడవూ, ఆయుధ రహితుడవూ, అనమాయుధ మోహార్తుడవూ ఈ పరిస్థితిలో నిన్ను చంపితే భ్రూణహత్యా

పాపం వస్తుంది. అది నా వీరత్వానికి తీరని లోటు కూడ. ఆలోచించుకో. అవకాశం ఇస్తాను" అన్నాడు దుందుభి.

"ఓహో! నీ అన్నకంటే నీవే తెలివైనవాడివి. నీ స్థితి శృతి మించి రాగాన పడుతూంది. నాకిస్తానన్న గడువుకు నాలుగురెట్లు నీకిస్తాను. పూర్వాపరాలు మరింపువేసుకో. చావో బ్రతుకో సరిగా నిర్ణయించుకో నన్ను మత్తుణ్ణిగా భావించకు. నీ పిరికితనంకు అందగా దాన్ని అడ్డుపెట్టుకోకు జీవేచ్ఛకలవాడు నన్ను రణానికి రమ్మని పిలవడు. నా పౌరుషాన్ని క్రియారూపంగా చూపబోతున్నాను. సిద్ధంగా వుండు" అని చెప్పి అంతఃపురాంగనల నందరినీ పంపించివేశాడు. ఇంద్రుడు ప్రేమపూర్వకంగా ఇచ్చిన మనోహర కార్తస్వరమాలిక గళాన్ని అలంకరించాడు. కచ్చ బిగించాడు కపికొద్దీ భుజాస్ఫాలనం చేస్తూ, అంత మహాకాయంగల అసురునిపై లంఘించి బుజాలు రెండు చేతులతో పట్టి భూమికి అదిమాడు. రెండు కొమ్ములూ రెండుచేతుల బిగించి గిఱ్ఱున అల్లిబిల్లిగా త్రిప్పి నేలపైకి విసిరివేశాడు. ఆ దెబ్బకు, సంపూర్ణంగా సర్వాంగాలు నలిగిపోయి, నోటివెంట, ముక్కుల వెంట, చెవులవెంట రక్తాన్ని స్రవింపచేయగా సొమ్మసిల్లి, వెంటనే తేరుకుని మళ్ళీ మదమాతంగంలాగా తారసిల్లాడు. మోకాళ్ళతో, మోచేతులతో, రాళ్ళతో, మాటలతో వాలి దానవుణ్ణిచిదుకబాదాడు. ఎన్నివిధాల హింసించినా దుందుభి లొంగలేదు. నిజంగా ఆ మాలిక లేకుంటే వా అన్న వాడిచేత మడిసేవాడే అంత భీకరంగా మల్లయుద్ధం చేశాడు. కాలం గడచినకొద్దీ వాలిబలం పెరిగింది. వైరి బలం తరిగింది

## మతంగుడు వాలిని శపించుట

అంతకంతకు అసురుడు క్షీణబలుడవుతున్న అవకాశం గమనించి వాలి పిడికిట పొడిచి, పీకనులిమి పీచమణచాడు. ప్రాణవాయువులు పంచభూతాల్లో కూడగానే పడిపోతున్న దానవుణ్ణి పైకెత్తి గిరగిర త్రిప్పి యోజనదూరం వడిసెలరాయివలె విసరివేశాడు. ఆ కళేబరం

వాయుపథంలో పోతూండగా నోట స్రవిస్తున్న నెత్తురు వాయువశాన మతంగాశ్రమంలో పడి అపరిశుద్ధం చేసింది. మతంగమహర్షి ఆ రక్తప్రదేశాన్ని చూచి ఆగ్రహించి ఏ పరమపాతకుడు, దురహంకారి, నీచుడు. గర్వి ఈ పనిచేశాడని వెలుపలికి వచ్చిచూచాడు పర్వతంలా పడివున్న దుందుభి కళేబరాన్ని గాంచి, జ్ఞానదృష్టితో జరిగిన సంగతి గ్రహించి, "నా ఆశ్రమంలోని సంస్కృతలతాదులు పాడుచేసి, నేలంతా నెత్తుటి మడుగులుగా నొనర్చి అపవిత్రం ఎవడు చేశాడో వాడు యోజనవిస్తీర్ణంగల నా ఆశ్రమభూమిలో ప్రవేశిస్తే ఆక్షణమే యమలోకానికి ప్రయాణం చేస్తాడ"ని శపించాడు అంతతో ఆగక ఆ మర్కటపతి ఇష్టులైనవారంతా ఈ చోటు ఇప్పుడే విడిచిపోండు. తెల్లవారినతర్వాత ఒక కోతికూడా నాకిక్కడ కనపడరాదు. బిడ్డలవలె పెంచుకున్న నా ఆశ్రమంలోని చెట్లూ, తీగెలూ సర్వనాశనం చేసినవారు పాపఫలం అనుభవించి తీరాలి నా ఆజ్ఞమీరి ఏ కోతివున్నా అనేకవత్సరాలు శిలలై పడివుండాలని శపించాను" అని ఆ కపికోటికి చెప్పాడు. ఆ శాపానికి భయపడి వానరాలు గుంపులుగట్టి పసవులుతీసి వాలికి వార్త వినిపించినై. ఆ భయంకర శాపవార్త వాలిని కలవరపరచింది వెంటనే ముని ఆశ్రమానికిపోయి "తెలియకచేసిన తప్పిదం క్షమించి అనుగ్రహించు"మని ఎంతగానో అర్థించాడు కాని మహర్షి వినిపించుకోకుండా లోపలికి వెళ్ళిపోయాడు. అప్పటినుండి భయంతో ఈ ప్రాంతానికి వాలిరాడు. దూరంనుంచైనా చూడడు ఆ కారణంచేత నేనిక్కడ ప్రాణభయం లేకుండా బ్రతుకుతున్నాను. ఆనాడు అన్న విసిరివేసిన దుందుభి కంకాళం అదిగో అక్కడ పడివుంది. ఆ ప్రక్కగా ఏడు మహావృక్షాలున్నై. ఆ చెట్లు తమ కొమ్మలు వేలాడుతున్న కారణంచేత సూర్యకిరణ ప్రవేశానికి చోటివ్వవు సరికదా, ఆ కొమ్మల తొంగించి మూలాన్ని గుర్తించటానికి కూడా అవకాశం ఇవ్వవు. అంత సాంద్రశాఖా సంకులంగావున్న ఆ వృక్షాలను ఒక్కడే ఒక్కొక్కసారి ఆకులన్నీ మాపిపోస్తుంటాడు. రామచంద్రా! వాలి శక్తిసామర్థ్యాల గురించి వివరించాలంటే ఎన్నోవున్నై మచ్చుకు ఒకటి రెండు చెప్పాను. విషయాలు విన్నావు కనుక నీకు తోచినవిధంగా నిర్ణయం

సాధించుమని ముగించాడు. అంతవరకూ వింటూ వుపేక్షాభావంతో వున్న సౌమిత్రి సుగ్రీవుని చూసి, "పూజ్యుడా! ఈ వృత్తాంతం చెప్పటంలో నీ వుద్దేశ్యం స్పష్టంగా అర్థంకావటంలేదు. దానివెనుక అంతుపట్టని అనుమానం వున్నట్లు స్ఫురిస్తోంది. అంత పరాక్రమవంతుణ్ణి మా అన్న జయించలేడేమోనని. ఆ శంకను అన్యాపదేశంగా మాటిమాటికీ తెలుపుతున్నావు. మిత్రులమధ్య సంకోచాలకు తావుండరాదు. మా అన్న ఏమిచేస్తే నీ అన్న వాలిని జయిస్తాడని నీవు నమ్ముతావో స్పష్టంగా చెప్పు. ఆ కార్యం నెరవేర్చి నీకు విశ్వాసం కల్గించుతాడు" అని అన్నాడు. రాముడు మౌనంగా విని లోపల నవ్వుకున్నాడు.

"రామభద్రా! నీ మార్గము అలౌకికమై తీవ్రమైనదయినా, నిర్దుష్టము, శ్లాఘాపాత్రము. నీ దృష్టిలో మాయామర్మాలు నిలువవు. నా హృదయాంతరాళాల్లో దాగి బాధిస్తున్న శంకాశల్యం పెకలించివేశావు. ఇప్పుడు చూపిన సాలవృక్షాన్ని వాలి ఎన్నిమార్లో వివస్త్రం చేశాడు. మూలం కదలని ఈ వృక్షాల్లో ఒకేఒక బాణంతో ఒక సాలాన్ని భంజిస్తే నా అన్నకు తగిన శక్తిమంతుడని నమ్ముతాను. ఇప్పుడు దూరంగా మీకు చూపిన దుందుభి కాయాన్ని కాలితో తన్ని రెండుమార్లధనువుల అవతలకు చిమ్మగలిగేటట్లయితే బలసత్వ సంపన్నతలో వాలికి మించినవాడని విశ్వసిస్తాను. మీ మూర్తులూ, మీ ధనువులు, మీ చరిత్ర, ఎంతశక్తిసంపన్నులో చెపుతున్నా నేను ప్రత్యక్షంగా చూడలేదు ఒకే కారణంగా వాలికి భయపడుతున్నాను. కాని, నేనూ అంతటివాడనే. అతడు శత్రువులపట్ల ప్రవర్తించిన తీరూ, స్వయంగా సమరంచేసి గ్రహించిన తీరూ కన్నులకు కట్టినట్లున్నవి. అతిలోక ధనుర్విద్యావేత్తలైన మిమ్మల్ని అవమానించి అవహేళించటం నా సంకల్పం కాదు. అతనిచే నేపడినపాట్లు తలచుకుంటే మీది ప్రాణాలు మీదనే పోతవి. ఈ సారి నన్ను యుద్ధభూమిలో చూస్తే తిరిగి పర్వతానికి ప్రాణాలతో రానీయడు. అదినాకు తెలిసే ఇంత దిగులుపడుతున్నాను. ఈ దీనునికి ధైర్యం కల్గించుమని కోరుతున్నాను." అని సూర్యసూతి చెప్పాడు.

## రాముడు దుందుభి కాయాన్ని కాలిబొటనవేలితో చిమ్ముట

దరహాసవదనుడైన దాశరధి వాయుకంపిత ధరణీరుహంలాగా ఆర్తితో వణుకుతున్న అనవరుణ్ణి చూచి "వెర్రీ! బలమయిన నీ ప్రతీకారవాంఛ, ప్రాణాలు నన్ను నిన్ను పూర్తిగా నమ్మనీయటంలేదు. ఇందుకు నిన్నవ్యధా భావించనక్కరలేదు. బ్రతుకుపై భ్రాంతివున్న ప్రతిజీవికి ఇది సహజ లక్షణం కేవలం ధైర్యసాహసాలు కార్యసాధనకు సంపూర్ణసామర్థ్యాలు కలవి కావు వాటికి త్యాగం అనే ఉత్తమోత్తమమూ, ఉన్నతోత్తమమూ ఐన గుణం తోడుకావాలి. ఆ లోపం నేను తీరుస్తాను నీకు విశ్వాసం కలిగిస్తాను. ఆ కళేబరం వున్నచోటికి పోదాం పద నీవు కోరింది ద్విశతసంఖ్యా ప్రమాణం గల ప్రదేశాంతానికి దానిని త్రోసివేయమన్నావు కాలితో తన్నమన్నావు" అని పలుకుతూ వెంటగొనిపోయి వామపాదంతో అంగుష్ఠ స్పర్శచేతనే పదియోజనాల దూరం పోయిపడేటట్లు చిమ్మారు. "ఇప్పుడు నీకు కొంత విశ్వాసం కలిగిందనుకుంటాను" అని అనగానే. "రామ ప్రభూ! నన్ను క్షమించు ఈ కళేబరం వాలిచేత విసరబడ్డప్పుడు, రక్తమాంసాలతో నిండి సవ్యంగా వుండి వచ్చింది. ఇప్పుడు పూర్తిగా ఎండి అస్థిపంజరం మాత్రం మిగిలింది. ఈ పని నేనూ చేస్తాను. పూర్తిగా నాకు సంతోషం, సంతృప్తి దీనివల్ల కలగలేదు. ఏకశర ప్రయోగంతో నేను చూపిన ఏడు చెట్లలో ఒక్కదాన్ని సమూలంగా ఛేదిస్తే వాలికంటే అధికుడవనే కాదు నీసాటి నీవే అని త్రికరణ శుద్ధిగా విశ్వసిస్తాను నీ శరానికి. నీ వాక్కుకూ, లోకంలో తిరుగులేదని శ్లాఘిస్తాను. నిరంతరం నీ సన్నిహితుడనై సేవిస్తాను. ఇక నిన్ను పరీక్షకు పెట్టను ఇప్పటికే మిత్రధర్మాన్ని అతిక్రమించాను. మిత్రమా! నేను సౌమిత్రివంటి వానిగా భావించి నా అపరాధం మన్నించమంటూ దినకరసుతుడు పాదాక్రాంతుడైనాడు

## శ్రీరాముడు సాలసప్తక భంజనం చేయుట

మిత్రుణ్ణి లేవనెత్తి "సుహృద్వరా! ఇంకొకటి నా చేత నీకు విశ్వాసం కలిగించమని నాకూ ముందే తెలుసు ఇప్పుడు నీవు కోరిన

పనే అప్పుడు చేసేవాడివే. కాని, నీలో రెండురకాల నమ్మకాలు కలిగించాలని ఆ పనిచేశాను. వాలి విసిరినప్పుడు రెండుచేతుల సహకారంతో యోజనాల దూరం పడింది. ఇప్పు డ ది అంగుష్ఠ పీడనంతో పదియోజనాల దూరం పోయిపడింది. ఆ తారతమ్యం నీవు లెక్కించలేదు. దీనితో నా శరీరపాటవం కూడా తెల్పదలచాను తెలిపాను. ఇక నా శరశక్తి ఎంతటిదో ఇప్పుడే చూపిస్తాను" అని చెప్పి భుజం నుండి కోదండం తీసుకుని వంచి గుణం తగిలించి సారించాడు. ఆ టంకారధ్వనికి పర్వతం ప్రతిధ్వనించింది. వనసత్త్వాలు భయంతో పారిపోయినై. తూణీరంలో నుంచి కాంచన పుంఖమైన దీప్తాశుగాన్ని తీసి తొడిగి సాలసప్తకాన్ని గురిమాచి, "సూర్యపుత్రా! వృక్షాలవంక చూడు నీవు కోరింది ఒకటి నేను కూల్చేది ఏడు" అంటూ శరముక్తం చేశాడు. కన్ను మూసి తెరిచేలోపల ఏడు చెట్లూ మొదళ్ళతో పెల్లగిల్లి తలక్రిందులై, దగ్ధమై, బూడిదరూపాన్ని పొందినై. ధనుర్నిర్గత బాణం ధరణిలో దూరి, తత్క్షణం పైకిలేచి వెనుదిరిగి అంబులపొదిలో విశ్రాంతి పొందింది. కపిశ్రేష్ఠుడయిన సుగ్రీవుడు సాలంకృతంగా వున్న తనువుతో సీతాపతి చరణాలు సోక మొకరిల్లాడు అందరి నేత్రాలల్లో ఆనందబాష్పాలు వెల్లివిరిసినై. అప్పటి అనుభూతికి భానుజుడు పరవశుడైనాడు గొంతు జీరవారింది. మాటలు తడబడ్డాయి అనిర్వచనీయమైన ఆ ఆనందలోకంలో నుంచి శ్రీరాముని పాణిపల్లవ స్పర్శ బాహ్యలోకానికి కొనిరాగా, "రామా! రామా! ఆర్తుడనై, అనాథుడనై, ఆశంకితుడనైన నన్ను, చంద్రజ్యోత్స్న కన్నా, చందనచర్చ కన్నా, కర్పూరపరాగ మల్లికా విరచిత శయ్యకన్నా చల్లనైన నీ కడగంటి చూపుల ప్రసరింపజేసి, ప్రాణమిత్రుడవై పరీక్షకు నిల్చి నాకు తృప్తి సాధించి పెట్టితివి. నీముందు వాలికాదు ముక్కోటి దేవతలు, చతుర్దశ భువనాలు మొకరిల్ల వలసిందేకాని ప్రతిఘటించి బ్రదకటం సాధ్యం కాదు. ఎవని ఆదరాభిమానాలు, చండశాసనుడైన వానరపతి నుండి బ్రదికి బయటపడటానికి హేతువులైనవో ఆ హనుమ లోకోత్తర మూర్తులైన మిమ్మల్ని ప్రసాదించినాడు. నా దురదృష్టాన్ని అదృష్టంగా మార్చాడు. అతని సహకారంతో సీతమ్మవార్త తెలుసుకొని నీ అం

పీఠంపై ఆసీనురాలిని చేసి మాతాపితరులవలె మిమ్మల్ని సేవించినా, మీ ప్రత్యుపకృతి భారం తీర్చుకోలేను. మా బాహ్యాభ్యంతరాలు రెండూ మీ సుందరదరహాస భాసుర ముఖాంబుజ వీక్షణంతో నిండి తరించేలాగా అనుగ్రహించు" మంటూ సుగ్రీవుడు కన్నీరు తుడుచుకున్నాడు. రాముడు ప్రియమార మిత్రుని కౌగలించుకుని, "చెలికాడా! చెప్పానుగదా నీవు దీనవాక్కులు పలుకవలసని ఆత్మస్తుతి ఎంత దోషమో, ఆత్మ ప్రశంసా కర్ణనంకూడ అంత దోషమే. తేపతేపకు నన్ను పొగడటం, నిన్ను నీవే తెగడుకోవటం మిత్రధర్మానికి వ్యతిరేకం. పైగా కొంత కాలానికి అది అన్యోన్య ముఖావలోకానికి దూరంకూడా చేస్తుంది. నీనుంచి నాకు కూడా కావలసిన విషయం నేను తెలుసుకున్నట్లే, నానుంచి నీకు కావలసిన విషయం నీవు తెలుసుకున్నావు. ఇప్పుడు ఇరుపురం శంకా రహితులం అయినాం. ఇకముందు జరుగవలసిన దాన్ని చర్చించుదాం.

## రెండోసారి వాలిమీదికి సుగ్రీవుడు యుద్ధానికి పోవుట

తమ్ముడా! సౌమిత్రీ! మీ వదిన వియోగానంతరం అన్ని విధాలా నీవే నాకు అండగా నిల్చావు కష్ట సమయాలల్లో ధైర్యం చెప్పి ఆదు కున్నావు. ఆగ్రహంలో అడ్డుపడి ధర్మోక్తులతో శాంతపరచి విపరీత కార్యం నుంచి విముక్తుణ్ణిచేశావు. రవి పుత్రుని చెలిమికి శకునం చెప్పి వెంటకొనివచ్చి ఫలితం చేకూర్చావు. ఇప్పటి వరకు నడచిన విషయాన్ని సింహావలోకంచేసి కర్తవ్యం నిర్ణయించుమని కోరాడు. అందుకు లక్ష్మణుడు అవనత శిరస్కుడై హనుమ వైపు చూచి. "మహామతీ: అన్న నాపై కార్యభారం ఉంచామోపాడు అన్నతో తుల్యబలం కలవాడననీ, ఒక కారణంచేత అతనికి లొంగావనీ మిత్రుడు చెప్పాడు కాని. కారణంమాత్రం చెప్పలేదు. అది తెలియక కర్తవ్యం నిర్ణయించటం కష్టం కదా" అని అన్నాడు. "పూజ్యుడా! అర్థవంతమైన విషయం అడిగావు వాలి, ఇంద్రుడైన సురపతి మెచ్చియిచ్చిన రత్నమాలధరించి. ఆహవంలో నిల్చుంటే ఎదుటనిల్చి పోరి ఎవ్వరూ నిగ్రహించ లేడు. అవసర సమయంలో తప్ప

అన్నివేళలా అది ధరించడు అతడు సహజంగా లోకైకవీరుడు ఎదురు నిల్చిన వైరిశక్తి అది ఆకర్షించి అతనిలో పూరిస్తుంది అభయం చేతనే సుగ్రీవుడు వాలితో యుద్ధమంటే వణకుతాడు" అని హనుమ చెప్పాడు. అది విన్న లక్ష్మణుడు "అన్నా! ఇప్పుడు కార్యం సుగమమైంది, ప్రత్యక్షంగా మిత్రుడు పోరాడుతాడు. పరోక్షంగా నీ వాగ్దానం నీవు నెరవేర్చు" అని చెప్పాడు. అందరికీ ఆ మార్గం సమ్మతం అయింది. రాముడు రవి సూనుణ్ణి వీపుతట్టి "మిత్రమా! నీవు విశ్రాంతితో సమరానికి సన్నద్ధుడవు కమ్ము. పోదాం పద నీవు కిష్కింధకుపోయి వాలిని పోరాటానికి పిలువు. ఇంద్రసుతుడు రాగానే తలపడు. తరువాత కార్యం నేను చక్కచేస్తాను." అని కర్తవ్యం తెలిపాడు అప్పుడు రామ సుగ్రీవులూ, లక్ష్మణ పావనులూ అమాత్య భృత్యులు ఋశ్యమూకం తరించి కిష్కింధా నగర పరిసర, వనం చేరారు సూర్యాత్మజుడు ఏకాఏకి నగరంలో జొచ్చి బిగ్గరగా వాలిని యుద్ధానికి పిల్చాడు. ఆ నాదం చెవి సోకగానే వాలి అస్తమయ భాను మండలం వలె అవని అదిరేలాగా అంగలు వేస్తూ వచ్చి అదాటుగా సుగ్రీవునిపై విరుచుకుని పడ్డాడు అపాటు తట్టుకుని విజృంభించి ఎదిరించి వాలిని బలమైన గ్రుద్దులతో, పిడికిటి పోట్లతో బాగా బాధించాడు. వాలి ఆ దెబ్బలకు నొచ్చి ఆజ్యం పోసిన అగ్నివలె భగ్గు భగ్గున మండుతూ సుగ్రీవుని రొమ్ముపై చేకొలది ఒక్క దెబ్బ కొట్టాడు, అది తట్టుకుని అన్నను తలపట్టి వంచి వీపుపై పిడుగువంటి పిడి గ్రుద్దు గుద్దాడు. ఆ గ్రుద్దుకు వాలి అదరిపడ్డాడు ఆశ్చర్యంలో మునిగాడు. కంఠం వైపు చూచుకున్నాడు గనమాల లేదు. ఇక పోరాటం పొడిగించటం ఇష్టం లేక తమ్ముని కంఠం రెండు చేతులతో పట్టుకున్నాడు సుగ్రీవుడు కూడ అన్న గళాన్ని ఆ విధంగానే బలంగా పట్టుకున్నాడు. అప్పటి ఆ ఇద్దరి యుద్ధం బుధాంగారక గ్రహాల పోరాటంవలె వున్నది ఇద్దరిలో ఒకడు మాత్రమే వుండాలన్న పట్టుదలతో కంఠ పీడనం చేసుకుంటున్న సమయంలో, చేత విల్లుంది రాముడు సజ్యం చేసి బాణం తొడిగి లక్షించాడు. ఆయన ఆశ్చర్యం ఏం చెప్పను! వాలి, సుగ్రీవుల భేదం తెలియలేదు విధి ఒకే మూసలో రెండు మూర్తులు చేసినట్లున్న అన్నదమ్ములలో సుగ్రీవుని పోల్చుకోలేక పోయాడు అంతకు పూర్వం వాలిని చూడలేదు. పెద్ద సమస్య ఏర్పడింది. శర

ప్రయోగం చేయటమా? మానటమా? అన్న ఆలోచనలో పడి నిశ్చల దృష్టితో చూస్తుండగానే: అన్న దెబ్బలకు అలసిపోయి చంపుతాడనే భయంతో తిరిగి చూడకుండా రవిసూతి పర్వతానికి పారిపోయాడు. వాలి వెంట తరిమి "ఛీ పౌరుష హీనుడా. పందా! ఇంతకే అంత కేకలు పెట్టావు ఈ నాటికి బ్రతికిపోయావంటూ దుర్భాషలాడి మరలి పురం చేరు కున్నాడు. రామాదులు మళ్ళీ ఋశ్యమూకాన్ని చేరారు.

## వాలిని చంపనందుకు రాముణ్ని సుగ్రీవుడు ఘోరంగా నిష్ఠురాలు పలుకుట

కులిశాహతికి పర్వతం వలె శరీరం హూన హూనమై కొన ఊపి రితో పైకెగిరి వాయు వధాన వచ్చి గుహ ముందు పడి స్పృహ తప్పాడు. కపులు శీతలోపచారం చేయగా చేయగా తెలివి తెచ్చుకుని సుగ్రీవుడు తన దురదృష్టాన్ని నిందించుకుంటూ వృక్షమూలంలో పడివున్నాడు. హను మదాదులు సేవించగా రామ లక్ష్మణులు అక్కడికి వచ్చి పడివున్న మిత్రుణ్ణి చేరదీసుకొని శరీరం నిమిరి సేదదేర్చారు కాని సుగ్రీవుడు సిగ్గుతో వంచిన తల ఎత్తలేను అవనత శీర్షుడైన సూర్య సూనుడు. "రామా! నా మర ణావస్థను చూడవచ్చావా? నా అన్న ఆగ్రహంతో ముందు వచ్చినా, చివరకు చంపకుండా అనుగ్రహించి పెద మోముతో విడిచి వెళ్ళాడు. అతనికి కలిగిన జాలికూడా నీ మిత్రుని పై నీకు కల్గలేదా? పరీక్షకు నిల్చి, నాకంత నమ్మకం పుట్టించి దురాశకు పురికొల్పింది ప్రాణమాత్రావశిష్టుడుగా నేను బయట పడటానికేనా? ఇటువంటి దుస్థితి ఇప్పటి కెన్నిసారులో అనుభవించాను తుదకు రాజ్యం వద్దు భార్యవద్దు బ్రతికితే చాలని మనస్సు రాయి చేసుకుని గదా ఇక్కడ బ్రతుకుతున్నది? నా కంటబడి మరలనని మాటయిస్తే నమ్మి పోరుకు పిల్చావు. కాని అన్నను నిగ్ర హిస్తావనే ఆశతో కాదుకదా. నీ కంటపడి, నీ మిత్రుణ్ణి హింసించి, విజయ గర్వంతో పోటికిపోయాడు వ్యర్థమైన నీ వాక్కు. వ్యర్థుడనైన నా ఆశా మిగిలినవి మొదటనే వాలిని చంపనని చెబితే. పూర్వంలాగే ఈ నగరి అపారంగా ఇక్కడనె పడివుండేవాణ్ణి లేనిపోని రిక్తాశ కల్పించి బలవంతు

దైవ శత్రువు వాత పడవేస్తే నీకు కలిగే మేలేంటి? నా గొంతుపట్టి పిసికినప్పుడు ప్రాణంతో బయట పడతాననుకోలేదు. ఆ పట్టు చంపటం ఇష్టం లేక సడలించబట్టే తప్పించుకుని పారి వచ్చాను. పూజ్యుడా! నిన్ను గాని, మరి ఇంకెవరినిగాని దూషించవలసిన పనిలేదు. నిజంగా నీవు అప్రతిమాన వీరుడవు. సత్యసంధుడవు. నా దుర్విపాకం నీకు దయ కలిగించలేదు. నా కర్మ పరిపాకం ఇంకా కాలేదు. నా కష్ట జీవితయాత్ర గమ్యం చేరలేదు. రఘుకుల భూషణా! రామా! నాకు నీ ఇచ్చిన మాట వ్యర్థమైనా, నేను నీ కిచ్చిన మాట వ్యర్థం కానీయను. యుద్ధంలో నేను పొందిన శరీరబాధ ఉపశమనం కాగానే నా కున్న పరిమిత బలంతోనే సీతాన్వేషణ చేయిస్తాను. నేను పొందుతున్న దుఃఖం నీవు పొందకుండా చేస్తాను." అని అతి కరుణంగ ఆక్రోశించాడు. ఆ మాటలకు సౌమిత్రికి పట్టరాని కోపం వచ్చింది. ఎట్టకేలకు తమాయించుకుని "పూజ్యుడా! భరించరాని బాధలో పలికిన పలుకులుగా భావించి వదలుతున్నాను. అన్నకు ఆప్తమిత్రుడవు కనుక నీవాడిన పరుషభాషణాలు సహిస్తున్నాను మీరెంతటి వారైనా మీలో జాతి లక్షణం పోలేదు. నా అన్నమాట వ్యర్థమైతే నీమాట సార్థమవుతుందా? రవికుల మండనుడయిన రాముని మాట వ్యర్థమైందని ఏ మొగంతో అన్నావు? సూర్యగమనం భూభ్రమణం, వాయు సంచారం తేజఃప్రకాశం యథావిధిగా జరుగుతున్న వంటే నా అన్న సత్య నిష్ఠ సడలలేదన్నమాట ఆయన అనృతవాది కాలేదన్నమాట. నిన్ను పగవాని కప్పగించి భార్యాన్వేషణం ఎవరిచేత చేయించుకుంటాడని పదిరావు? ఆయనకు వున్న బాధ చాలక అంతదూరం నిన్ను వెంటగొని కిష్కింధకు నడిచింది నీ రక్షణకూ, శత్రురక్షణకేనా? వాలి నిజంగా పరాక్రమశాలే కాక వివేకశీలికూడా. ఇరువురిలోనూ ఇహసుఖాపేక్ష ఎక్కువగా వుండటంచేత కాని కార్యానికి వాలి దిగాడు. నీవు ఖద్యోతాన్ని (సూర్యుణ్ణి) ఖద్యోతంగా (మిణుగురు పురుగు) భావించి తీవ్రనిందకు దిగావు నీ పట్లనా అన్న చేసిన దోషం ఏమిటి? శరముక్తం చేయక ఉదాసీనంగా ఊరకున్నాడు. నీవు అడుగవలసింది అందుకు గల కారణం. అంతేకాని వ్యంగ్యంగా నిష్ఠురాలు పల్కటం కాదు." అని మర్యాదావచనాలతో మందలించాడు. సుగ్రీ

వునకు వాలిచేతి దెబ్బల కంటే సూటిగా మర్మాన్ని ఛేదిస్తున్న, సౌమిత్రి మాటలు మిక్కిలిగా బాధపెట్టినై. అంతలో రాముడందుకుని "తమ్ముడా! బాధతో మిత్రుడెంత తొందరపడ్డాడో, అదిలేని నీవు కూడా తొందరపడ్డావు మర్మ భేదకాలైన వాలి ముష్టి ప్రహరణాలతో ప్రాణావశిష్టుడై బయటపడిన చెలికాడు ఆశించిన పని ఆగిపోతే అంతమాత్రం అనే అర్హత లేదా? అందుకు నీవు ఆగ్రహపడటం భావ్యమా? మిత్రమా! ఆపదవేళ అడ్డు పడనివాడు మిత్రుడే కాదు. శత్రువుకంటె శత్రువు. నాకు అది తెలుసు. నే చెప్పబోయే విషయం శాంత మనస్కుడవై విను.

## వాలిని వధింపని కారణం రాముడు సుగ్రీవునితో వివరించుట

నిన్ను పరులకప్పగించే ప్రయత్నంతో నేను కిష్కింధకు రాలేదు. వరునివల్ల కలిగిన బాధ పోగొట్టడానికే. కాని, అక్కడ ఆ సమయంలో జరిగిన సంఘటన వేరుగా వుంది. నీవు వాలిని యుద్ధానికి పిలిచావు. అతడు వచ్చాడు. ఇరువురూ తుముల సంగరం సాగించారు. నేను మీకు దూరంగా వున్నాను. వాలిని పూర్వం ఎరుగను కదా? రూపరేఖావయోవస్త్ర విద్యా విలాసాల్లో అభేదంగా వున్నారు. మీలో ఎవరు ఎవరో పోల్చుకోలేక పోయాను. ఎంత పరిశీలించినా నాకాభేదం తెలియనేలేదు. నేను ఆ స్థితిలో అప్రతిహతశక్తిమంతమైన దివ్యాస్త్రాన్ని ప్రయోగిస్తే అది అతనికి కాక నీకే తగిలితే ఏంకాను? ఇంత ప్రయత్నం చేసింది చేసేతుల నిన్ను చంపటం కోసమేనా? ఇక నిన్ను చంపుకుని నేను జీవించి చేసేదేముంది? నీ అంత చూచుకొని కదా కొండవంటి కోపాన్ని తరింప చూచాను. అభయమిచ్చిన నేనే నిన్ను వధిస్తే ఆ పాపం జన్మ జన్మాంతరాలకు పోదు కదా, రాముడు వివేకంలేని వెర్రివాడనీ, వ్యర్థ ప్రతిజ్ఞుడనీ, మిత్రద్రోహి అనీ, ఇంకా అనేకవిధాల లోకం ఆడిపోసుకునే అవకాశం కూడా కల్పించదా? నీవాని నిగ్రహించలేకపోతే పూర్వంవలెనే వెనుకకు వస్తావనీ. నీకు మర్మ చర్మ కర్మాలు వివరింపవాననీ, అస్త్రప్రయోగం చేయకుండా ఆగిపోయాను. ఇప్పుడు చెప్పు. రాముడు మిత్రవంచకుడేమో. నేనూ, సౌమిత్రి, సీతా, నీ వాళ్ళం. వేరుగా భావించి నన్ను విశ్వాసహీనుడుగా చూడకు. నేను నీ-

పట్ల భిన్నభావం కలవాడనయితే ప్రథమంగా నీ కార్యసిద్ధికి ఎందుకు ప్రయత్నం చేస్తాము? అనవసరంగా నీకీ శ్రమ ఎందుకు కలిగిస్తాను. ఈసారి వాలి వధ తథ్యం. నీవు శారీరక బాధలో వున్నా, వెంటనే కిష్కింధకు పోదాం పద. నన్ను విశ్వసించు నా మాట ఎన్నడూ వ్యర్థం కాదు మాటలెందుకు నీవే చూస్తావు. నాకు గుర్తుగా ఒక చిహ్నం ధరించు అదిగాదు లక్ష్మణా! నీవుపోయి విడగపూచిన ఆ గజపుష్పలతిక తెచ్చి మిత్రుని గళసీమ నలంకరించు" అంటూ సుగ్రీవుని మేను పరమ పవిత్ర పాణిపల్లవంతో నిమిరాడు వృశ్చికదష్టమైన శరీరి పొందే బాధను పొందుతున్న భానుజుడు సుఖసుషుప్తి నందిన వానివలె స్వస్థుడయి లేచాడు. రామునికి పాదాభివందనం చేశాడు నా తొందరపాటు మాటలు మన్నించి నీ వానిగా ఏలుకొమ్మని ప్రాధేయపడ్డాడు. నిరంతరం చూచే కిష్కింధా వాసులే వారిని గుర్తించలేనప్పుడు నూతనంగా వచ్చిన వాడెట్లు గుర్తిస్తాడని తలపోసి శర ప్రయోగం చేయకపోవటమే శ్రేష్ఠమైన కార్యమని శ్లాఘించాడు. ఇంతలో లక్ష్మణుడు గజపుష్పలత ఖండించి తెచ్చి రవిపుత్రుని కంఠంలో హారంలాగా చేసి వేశాడు. ఆ దండ ధరించిన వానర శ్రేష్ఠుడు తారా పరివేష్టితుడైన సూర్యుడులాగా శోభించాడు సంధ్యాకాలంలో బలాకా సహస్రంతో కూడి భాసించే మేఘంవలె వున్న మిత్రుణ్ణి గాఢాశ్లేషంతో రామచంద్రుడు గౌరవించి అనుజుడు ముందు నడువగా పయనించాడు

## శ్రీరాముడు వనచరులతో కూడి మరల కిష్కింధకు పోవుట

ధనుర్ధారియై సౌమిత్రి దారి చూపుతూ ముందు నడుస్తుంటే రాఘవ రవి తనూజులు ఇష్టాగోష్ఠితో వెంట నడిచారు వారివెనుక నలనీల వాయునందన తారులు ప్రయాణించారు వారందరికీ చక్రాకారంగా వానరశతం పరచింది. రమణీయ సువర్ణపుంఖ శరాసనాన్ని ధరించి అర్కసన్నిభమైన అస్త్రాన్ని కుడిచేతిలో పట్టుకుని రామచంద్రుడు మదమాతంగ విన్యాసంతో గమిస్తూ, మధ్యలో సుందర కందర బృందాలనూ. మంజు సుమపుంజరంజిత కుంజాలను, వికిర వికర సమూహులోర్వీ ధృవంతులనూ, పాటలీకేతకీ పున్నాగవృక్షకూటలైన గిరికూట వాటాలనూ. మొగడలతో, వైడూర్యపు

జిగిలతలతో, తమ్మి, చెంగల్వల పూలతో వొప్పుకారంతో వెలుగులు చిమ్మే కొలకులనూ, కారండవ జల కుక్కుట కలహంస చక్రవాక నాద ముఖరిత జలాశయాలనూ, మిట్టలనూ, గుట్టలనూ కన్నులపిండుగా కాంచుతూ, నిర్మలోదక పానంతో దప్పిక తీర్చుకుని, శీతలవాత సంస్పర్శతో దేహ తాపం అపనయించుకుంటూ, వారిధరాభాలూ, జంగమాద్రులూ అనదగిన మత్తవారణాలనూ, అవి ఘీంకరించి చేసే కోలాహలాన్నీ కొమ్ములతో ఒడ్లను కోరాడి దుమ్ము చల్లకుంటూ స్వేచ్ఛగా తిరిగేవాటిని విహారవిన్యాసాన్నీ తిలకించి మేను మరుస్తూ నడకను సాగించారు. దారిలో ఆకాశం అంటపెరిగి కారుమబ్బులు క్రమ్ముకున్నట్టు ప్రవేశదుర్లభంగా పత్రసాంద్రతతో వున్న గొప్ప కదళీవనం కనుపించింది దాన్ని చూచి దాశరధి సుగ్రీవుని చూచి ఆ వన వివరం అడిగాడు. అందుకు ఇనుజుడు సంతోషించి, "రామచంద్రా ఈ కదళీవన కథ మహా అద్భుతమైంది. శ్రమనాశకరమైనది కూడ. సప్త జనులనే పేరుగల సంయములు ఏడుగురు అశ్మరమ్ములయి, (తల క్రిందుగా) వాహవిహారకు మాత్రమే నీరం, ప్రాణరక్షణకే పవనభక్షణంగా ఏడువందల దివ్యవత్సరాలు మహావ్రతులయి తపస్సు చేసి శరీరంతో స్వర్గం చేరుకున్నారు. వారి తపోమహిమకు ఈవనం ప్రత్యక్షసాక్ష్యం. దీనిలో ప్రవేశించి తిరిగి వచ్చిన ప్రాణిలేదు తెలియక ప్రవేశిస్తే యుగ యుగాలు గతించినా ఆ ప్రవేశించిన జీవి అందులోనే తిరుగుతు పడుతుంది కాని తిరిగి వెలికి రాదు ఆ కారణం చేత ఆ వనంలో దేవదానవ యక్ష గంధర్వాదులు చొరరు సరికదా వనచరాలు కాని, ఖచరాలు కాని రావు మొనవు. రాత్రివేళల్లో కరకంక పదమంజీర నాద మేదురంగా, కర్ణ మోహనంగా గానం వినిపిస్తుంది. కామవాంఛా దోషదూషిత మనశ్శోష ణాలయిన భాషణాలు వినవస్తై. ఇప్పటికీ ఆనాటి వారి త్రేతాగ్నులు ఆర లేదు. ఆ ధూమం చూడు. కపోతాంగారకరుచితో వాతాపీతమై వృక్షాగ్ర భాగాల చుట్టూ తిరుగుతూంది. వానకారులో మొయిళ్ళు, వియదధ్వం ఆక్ర మించినట్లు ఎల్లప్పుడూ ఆ హోమకుండాల్లోనుంచి వెలువడి కదళీతరు శిఖ రాలను ఆ ధూమం క్రమ్ముతూనే వుంటుంది. రామప్రభూ! తమ్మునితో కలిసి ఆ మునులకభివాదం చేయి. ఆ మహాత్ములను అంజలించినవారికి,

దేహరోగ పీడలు కానీ, కోర్కెలు ఫలించకుండటం కానీ జరగవు" అని చెప్పగా సోదర సహితుడయి రాముడు శ్రద్ధాభక్తులతో సమస్కరించి క్రమంగా వాలి పాలిత కిష్కింధానగర పరిసరారణ్యానికి చేరాడు పరి రక్షిత భద్రసూక్తి అయిన రామమూర్తితో పాటు సముదగ్ర సముచిత తేజశ్శక్తి సంపన్నుడయిన సుగ్రీవుడు శత్రుసంహరణ శక్తితో చనుదేర గానే అందరు ఆ వనంలో మంత్రాంగం సలిపారు.

## రాముడు రవిజుని ఉత్సాహవాక్యాలతో ఉద్బోధించుట

రామచంద్రానుమతిని రవిపుత్రుడు శీర్షం ఎత్తి నలుమూలల పరి క్రమించి చూచాడు. ఝంఝూతరః పురస్సర వారిధర గర్జల వంటి గర్జలు చేసి ప్రభాత సూర్యునివలె ప్రకాశించే రామునితో "రామప్రభూ! వాలి వాగురా యంత్రరక్షితమైన కిష్కింధ చేరుకున్నాం. నీవు సలిపిన ప్రతిన సఫలం చేసేసమయం ఆసన్నమైంది. వనాలను వసంతరాజు అలరించిన విధంగా నన్నలరించు" అని అన్నాడు. ప్రత్యుత్తరంగా కోదండపాణి "రవిపుత్రా! మనవాళ్ళుచేసిన మంత్రాంగం విన్నావు కదా. వ్యవధితక్షువగా ఒకేనాడు రెండు సారులు నీవు యుద్ధానికి సిద్ధం కావటం వాలికి అనుమాన కారణం కావచ్చు. అతడు పోరుకు రాకయేపోవచ్చు. అయినా వాలి మహా శూరుడు. కనుక అతడు సహించలేని మర్మోద్ఘాటనం చేసేమాటలు పలికితే తప్పక సమరానికి రావచ్చునని నా అంతరాత్మ బోధిస్తూంది అందుకు తగినట్లుగా నీవిప్పుడు లక్షణ పవిత్రహస్తాలం కృత గజపుష్ప మాలాధారివై చుక్కల్లోని సూర్యునివలె ప్రకాశిస్తున్నావు విజయం నిన్నీనాడు వరిస్తుంది నేడు నాకంటబడి నీ విరోధి వెనకకు పోలేడు. మాటలతో కాలహరణం మంచిది కాదు. కుడువబోతూ కూడ రుచి ప్రస్తావన ఎందుకు? నీవు కన్నార చూచేలాగా మున్నాసాల సప్తకభంజనం చేసినట్లే నీ శత్రుకంఠ లుంఠనం చేస్తాను. అన్నమాట నిలుపుకోలేని అశక్తుణ్ణిగా భావించక జయలక్ష్మీకర గ్రహణం, విజదార కరగ్రహణం చేయబోతున్నానని భావించు. ఎన్ని విపత్తులు నన్నావరించినా ధర్మలోపం నేను చేయలేదు. నీవు విగత భయుడవై విజృంభించి విక్రమించు. నా మాటను సజీవం చేస్తాను. ఇంద్రుడు

వర్షించి భూమిని సస్యవంతం చేసినట్లే, శరప్రయోగంతో వాలి ప్రాణం నీ మనశ్శల్యం ఏక కాలంలో పెకలిస్తాను. ఇంతకు పూర్వం నీ చేత వాలి పరాభూతుడు కాలేదు కనుక, పౌరుషప్రధానుడు కనుక వస్తాడు. ఆడవాళ్ళ మధ్యలో వుండి వింటే అభిమానం హెచ్చుతుంది. కాబట్టి అవశ్యం కయ్యానికి అరుదెంచుతాడు. వైరికృత తిరస్కార వాక్యాలు శూరులు సహించలేరు. ఏ గర్జన చేస్తే వాలికి రక్తం వుడుకుతుందో ఆ గర్జన చేయ"మని ప్రోత్సహించాడు. అమాత్యులూ, వానరులూ ఆనంద నృత్యం చేసి పుష్పాలతో ముంచెత్తి తురంగా పోయి విజయంతో రమ్మని ఆశీస్సులు వర్షించారు. రాముడు వెన్ను తట్టి "విజయం భూయాత్" అన్నాడు. లక్ష్మణుడు దక్షిణ హస్తం చేతగొని కొంతదూరం నడిచాడు.

## రవిపుత్రుడు రణానికి వాలిని పిలుస్తూ సింహనాదం చేయుట

ఆప్తుల ఆశీర్వాదాలందుకుని నగరప్రవేశ సింహద్వారం చేరి, ప్రస్ఫుటంగా, దిక్పటల స్ఫోటంగా, అశనిపాతభీషణ ఘోషణంగా సింహనాదం చేశాడు. అతిభయంకర ఘోషణం ఆ పురవాసులు పుట్టిననాటి నుండి నేటివరకు వినని కారణంగా గగ్గోలపడి లక్ష్యంలేకుండా పరుగెత్తుతుంటే అంగనలు ఆర్తలై ఆవాసాలు విడిచి, ఆశ్రితుల వెంబడిస్తున్నారు. సంగరరంగంలో భంగపడిన తురంగాలచందంగా, సారంగాలూ, వన్యసత్త్వాలూ ధరాధూళిరేగంగా పరువెత్తుతున్నై. నింగినుండి తిరుగుతున్న పతంగాలు క్షీణపుణ్యుల గ్రహాల్లాగా భూమిపై పడిపోతున్నై. ప్రచండ వాతాహతి సంక్షోభితాంబుధికి ఆమ్రేడితం అన్నట్లుగా, సూర్యసుతుడు కుంభించి తీవ్రధ్వానం చేయగా, నిర్గతమవుతున్న వాయుప్రసారణానికి సమూలంగా వృక్షసంతానం పెల్లగిల్లి తలక్రిందులైంది. ఆ ఘోషగర్జనకు రామాదులు దిగ్భ్రమచెందారు. కిష్కింధ అల్లకల్లోలంగా మారిపోయింది. ప్లవగపదసంఘట్టనానికి భూమి అదరసాగింది. ఆ అలజడి అంతఃపురంలో హాయిగా విశ్రమించిన వాలి విన్నాడు. అంతవరకు శరీరంలోవున్న మదంతోపాటు మత్తుకూడా దిగిపోయింది. ఎక్కడలేని కినుక తలకెక్కింది. అత్యధిక రోషపరీత సర్వాంగుడై

సంజకెంజాయవలె ప్రకాశించే వాలి కేతుగ్రస్త సూర్యబింబంవలె తేజోహీనుడైనాడు. వికటదంష్ట్రాకరాళుడూ, ప్రకటకోప భీషణుడూ, ప్రళయ వహ్ని సంకాశుడైన ఇంద్రతనయుడు హుంకరించగా తూడుటతో మిగిలిన కాసారంలాగా వెలవెలపోయాడు. "ఆ విధంగా అంతటి భయంకర గర్జనం అనుజుడు అంతకుపూర్వం ఎన్నడూ చేయలేదు. పదిగడియల క్రిందట బాధించి ప్రాణదానం చేసిన ప్రత్యర్థికి ఇంతలో ఇంతశక్తి ఎలా వచ్చింది? బలమైన పరప్రాపకం వుండివుంటుంది" అని అర్ధనిమీలిత లోచనుడై, అంతర్ముఖుడై ఆలోచించాడు. తనకు అవసాన కాలం ఆసన్నమైందని గుర్తించాడు. జనకదత్తమైన కాంచనమాలను కంఠంలో ధరించాడు పండ్లు పటపటగిటుతూ, ఒక్క ఉదుటున శయ్య నుండి లేచి క్రిందికి దూకి భూమి బద్దలు కాగా సుగ్రీవుడున్న చోటికి బయలుదేరాడు.

## కయ్యానికిపోతున్న కాంతుని తార అడ్డగించుట

ప్రళయమూర్తియై పోతున్న ప్రాణేశ్వరుణ్ణి వెన్నంటివచ్చి ప్రేమ పూర్వక బాహాద్వయ వలయంతో బంధించి "ఆగు నాథా! ఆగు. కల్యాణకారకమైన నా పలుకులు విను. ఇప్పటికి నీ ప్రయాణం ఆపు. రాత్రి ముగిసి, ఉదయం త్యజించిన పూలదండవలె రోషాన్ని విసర్జించు. అరుణోదయం కాగానే అతనిపై కదలవచ్చు. అసమయంలో పోరాటానికి పోనందుకు నీకు అగౌరవంగానీ, అతనికి గౌరవంగానీ రాదు. యుద్ధానికి ఇది వేళకాదు. నిశాసమయం అన్న నెపంతో ఆ మాట అనలేదు. దానికి కార్యకారణ సంబంధం వుంది. కొంచెం కాలానికి పూర్వం నీతో తలపడి బహుకాలం వరకు బాధ దాపుకోలేని విధంగా తన్నులుతిని, ఇంతలో ఇంత శక్తిమంతుడై తిరిగి నీ పైకిరావటం శంకకు తావిస్తుంది. అతడు చేసిన సింహధ్వని నీవుకూడా ఏ సమయంలోనూ చేయలేవు. అంతశక్తి కలగటానికి అంతకంటే అధికమైన శక్తి తోడ్పాటు అతనికి వుండితీరాలి. అంతటివాడు అతని అనుచరులలో హనుమంతుడు తప్ప ఇంకొకడు లేడు. అతడు నీపైకి రాడు. అతనిని పంపడు. అతడు కల్పించుకొనదలిస్తే ఇదివరకే

ఆ పని చేసేవాడు. నీ తమ్మునకు పుట్టుకతోనే తెలివితేటలు, నేర్పు పుట్టినై. అంచేత అందగా నిల్చినవానిని అనేకవిధాల పరీక్షించి తృప్తి పడిన పిదప వెంటగొని వచ్చివుంటాడు. నాథా! ఇంకా పరోక్ష భాషణం ఎందుకు? ఇంతకు ముందే అంగదునిచే అన్ని సంగతులు గ్రహించాను మన వానరులు పంపాసరోవర ప్రాంతంలో తిరుగు తున్న ఇద్దరు పురుషుల్ని హనుమ పర్వతంపైకి తీసుకుని పోవడం చూశారట. ఆ సంగతి నాకు చెపితే, అబ్బాయిని రహస్యంగా ఆ వృత్తాంత శోధనం నిమిత్తం ఆజ్ఞాపించాను. వాడు అంతా గ్రహించి వచ్చి నాకు తెలిపాడు నాకు తెలిసింది నీకు తెల్పుతున్నాను. అయోధ్యాపతి దశరథుని తనయులు రామ లక్ష్మణులు. వారిని గురించి విశేషంగా నీకు వివరించ పనిలేదు. అయినా చెప్తున్నాను. ఇద్దరూ విశ్వామిత్రుని అంతేవాసులు. సమరదుర్జయులు. అందులో రాముడు అహితవిరాముడు, అతులవిలయ సమయత్రిధాముడు. విస్తృత కీర్తి ధాముడు. ఉచితానుచిత కళాసీముడు.

శిష్టులకు కల్పవృక్షం. దుష్టులకు కృష్ణపక్షం ఆర్తులకు మహా గతి. అపన్నులకు సదాగతి శరణాగతులకు అభయ క్షేత్రం యశస్సుకు ఏకైకపాత్రం సర్వశాస్త్ర సంప్రదాయశీలి. సమరకర్కశ పరాక్రమ శాలి. పలుపలుకులెందుకు? ప్రాణేశా! అన్నిధాతువులకు అవనీధరం ఎలా ఆధారమో అలాగే అన్ని సద్గుణాలకు అతడు ఆవాసం. కన్న తండ్రి కామగత ప్రవర్తనను అతిలోకౌదార్యంతో చేయగలిగిన త్యాగ మూర్తి సత్యధర్మమార్గానువర్తి. విషయం తెలిసి విషాన్న భక్షణం చేయడం వివేకం కాదు. నీ వేరాలెత్తి నీతులు బోధించలేను కొంత కాలం మన మనుగడ సాగించుకునే నిమిత్తం పక్కన పడకులు మాత్రమే. రామునితో వైరం నేరం. తమ్మునితో పగ ఆశ్రయం లక్ష్యం కాగానే అంతమైంది. అతని అదృష్టం కొద్ది అసాధారణమూ, అసాధ్యమూ అయిన ఆశ్రమం దొరికింది. నా మాట విను మన రాజ్యానికి మంగళం చేకూర్చు. నాకు తోచిన నీతి చెప్తాను. విని

నీ ఇష్టంవచ్చినట్లు చేయి. తమ్ముడు సబలుడై యుద్ధానికి వచ్చాడు కనుక, మంచిమాటలతో సన్మానించి యువరాజ పట్టంకట్టు. అసలికి అతడే కాదు అతని మిత్రులు అందరూ సంతోషిస్తారు. రాముడు కూడా నీవాడవుతాడు.

నీకైనా ఇంత విరోధం ఎందుకు? ఒక్కగానొక్క తమ్ముడు. అతడు కూడా నీవలె తండ్రి సొత్తు అనుభవించటానికి అర్హుడు కాడా? చిన్నతనపుచేష్టతో ఏనాడో నీకు అపకారం చేశాడని ఇంతవరకూ భార్యాభర్తల విడదీసి నగరం వెళ్ళనడచి తీరని అవమానం నీవూ చేశావు. అయిందేదో అయింది. అతడెన్నడూ నీవల్ల అనుచితంగా నడవలేదు నీవు రాగానే రాజ్యం ఇస్తానన్నాడు కదా. పొరపాట్లు అయినవాళ్ళలో కాక పరాయివారిలో వస్తవా? వచ్చినా పట్టించుకుంటారా? నేను నీ హృదయేశ్వరిని. నీ చరణదాసిని. నా నీతిని సవ్యంగా, శాంతంగా, సంతోషంగా జరిగేవనికి ప్రళయం సృష్టించి విలయం పొందటం వివేకి లక్షణంకాదు. నావల్ల నీకు నిజమైన ప్రేమా, అభిమానంవుంటే దానికి నిదర్శనంగా నా నీతి పాటించు నీవిప్పుడు యుద్ధానికిపోయేది నీ తమ్ముని మీదికి కాదు. జగదేక వీరుడైన శ్రీరామచంద్రుని మీదికని భావించు. ఆ మహాసహానితో విరోధం వద్దు. ప్రదికిచేయగలిగిన సమ ఉన్నై. కాని చచ్చిసాధించే కార్యం జగత్తులోలేదు నా సాహసం క్షమించు. నీ ప్రాణేశ్వరి ప్రార్థన ఆలకించు. నాకు సుమంగళీత్వం దీర్ఘంగా ప్రసాదించు నా ఈ చివరికోరిక నెరవేర్చి భర్త్రునామం భద్రపరచు" అంటూ తార, రాజసాంఘిక న్యాయధర్మ సారాలైన పలుకులు పల్కింది.

## తారకు తగు సమాధానంచెప్పి వాలి పోరాటానికి పోవుట

తార గుణోదార, నీతికళాధార, సుఖరుచిర నిటితతార, ప్రియదార ప్రియసారసల్కుతున్న పల్కులు ఆమూలాగ్రం ఆలకించి వాలి, ప్రణయ భావంతో కపోలాలు నిమిరి "ప్రాణేశ్వరీ! నీ నీతి లోకసమ్మతం. అవశ్యం ఆచరణీయం. అర్ధాంగివి. ఆ పాటివచనవు నీకు లేకపోలేదు. తగిన సమయంలోనే ధర్మోపదేశాన్ని తగినవిధంగా చేశావు. అయినా,

నా నిర్ణయం మార్చుకో తలచలేదు. నీవు చెప్పినవన్నీ నేను ఆలోచించే కర్తవ్యం నిశ్చయించాను. వాడు నా తమ్ముడా? నన్ను తను చంపలేక సహాయంకూడా పొంది వచ్చినవాణ్ణి క్షమించమంటావా? శూరులకూ, వీరులకూ, ప్రాణాలేతీపి కావు. భార్యా బంధు మిత్రాదులు తీపి అవుతారా? అపరాజితులకూ, రణమందు వెనుకంజవేయని దుర్ధర్షులకూ, శత్రువు సమీపంలో నిల్చి సమరానికి ఆహ్వానిస్తే, కాలుకదల్చక కళ్ళుమూసుకొని అవమానం భరించుటకంటే చావటం శ్రేయస్కరం కాదా? వాడు శూరుడై పిలిస్తే, నేను భీరుడనై అంతఃపురాంగనలతో ఆడుకోమంటావా? అంత చెడ్డవ్రాత విధి నా మొగాన వ్రాశాడా, పౌరుషహీనుడనై బ్రతికిన నన్ను పతియని చెప్పుకొనుట నీకు లజ్జాకరం కాదా? వాడెన్నడూ నన్ను జయించలేడు ఇక రాముణ్ణి గూర్చి అసలే భయంలేదు. నీవు వర్ణించిన లోకోత్తర గుణాలన్నీ ఆయనలో వుంటే అధర్మంగా అన్నదమ్ముల తగవులో ప్రవేశించి నన్ను చంపడు. ఆతడంత నీతిమాలి ఆహవం చేయటమే జరిగితే అతణ్ణి జయించినా కీర్తే, మరణం అతనిచేత పొందినా కీర్తే. నాకు తెలిసినంతవరకు నా కంటపడి యుద్ధం చేయడు. చాటునచేసే సహాయం ఎంతైనా చేయనీయి. వానివల్ల సుగ్రీవుడు వాలిని నిర్జించటం నీటిమీద వ్రాతవంటిది. కాలహరణ అవుతూంది. వాడు కారెనుబోతువలె కన్నుమిన్ను తెలియకుండా పరవళ్ళు త్రొక్కుతున్నాడు. వాడి వున్నతి నాకు బాధాకరం. లోకంలో వాడికి నా బాధ నేటితో లేకుండాపోవాలె. మీరంతా అంతఃపురానికి పొండు నా మీద నీకు ఒట్టువేస్తున్నాను. ఒక్క అడుగు ఇక ముందుకు వేయవద్దు. అన్నదమ్ముల కలహానికి అత్యాపాంతం పలుకుతాను మళ్ళీ ఇటువంటి వుత్పాత ప్రదర్శనం చేయనని ప్రమాణం చేయించి ప్రాణాలతో వదులుతాను. కాని నేను మాత్రం నా చేతి మీదుగా వాణ్ణిచంపను. నీకా భయం అక్కర్లేదు" అని గట్టిగా చెప్పి సమాధానపరిచాడు. తార చేసేది లేక లోలోపల దుఃఖిస్తూ భర్తకు ప్రదక్షిణం చేసి ఇంద్రవత్తం చేసి స్వస్త్యయనం సలిపి అంగనలు సేవింపగా ఆవాసానికి వెళ్ళింది.

# వాలి సుగ్రీవులు రెండోసారి పోరాడుట

మహాబలపరాక్రమ సంపన్నుడైన వాలి అంతఃపురాంగనల అడ్డు తొలగించుకుని, ఓష్ఠ మంత్రపఠనంతో విరూపాక్షుని ధ్యానించి, ఆగ్రహంతో అంతకంతకు శరీరం పెరుగుతూ పొంగులారగా, శత్రుదర్శన కాంక్షతో చకచక నడచి పురినిర్గమించి, దిక్కులు కలయనరికించి, దీప్తానిలధామునీ, అవష్టబుద్ధినీ, హేమపింగళ నేత్రుణ్ణీ, సముత్సాహినీ, రవిపుత్రుణ్ణి చూచాడు. నడికట్టుగట్టిగా బిగించాడు. భుజాస్ఫాలనం చేశాడు. ముష్టి బిగించి బాహుదండం పైకెత్తి సుగ్రీవుణ్ణి చురచుర చూస్తూ ఎదురుగా నడిచాడు. సూర్యసూనుడు కూడ నదురు బెదురు లేకుండా తన దక్షిణ బాహుదండం పైకెత్తి గుప్పిలి బిగించాడు. అభిముఖంగా అతడు కూడ రాసాగాడు. తమ్ముని ఇప్పటి తలపడే ధోరణి చూస్తున్న వాలికి తల తిరిగిపోయింది. "వెంట ఎవ్వరూ లేరు. కనుచూపుమేరలో కూడ కనుపించలేదు. వీడి రాకలో అప్పటికీ, ఇప్పటికీ తేడా కంఠంలో గజపుష్పమాల వుండటమే. దీన్ని దేనికి ధరించాడు? ఇది ఏదో శక్తిమంతమైందనీ నేను భయపడాలని భావించాడా? తనవలె తాను కూడ హారం ధరించాలని తలచి ధరించాడా? ఏమైనా, తెలియరాని కుట్ర ఏదో దీనివెనుక వుండివుంటుంది. అందుకే ముందుచూపుగల తార ఆగి ఆలోచించి ఆహవానికి పొమ్మంది. వచ్చి వైరికి వెన్నిచ్చి పారిపోవటం సంభవమా? గెలిస్తే జయం, ఓడితే మరణం. ఈ రెండూ శూరులకు సన్నిహితంగా వుంటై. బహుకాలం ఇహలోక సుఖాలు అనుభవించాను. మరణం మహర్షులకే తప్పలేదు ఏనాడో ఒకనాడు అది రాక మానదు నేను ఆజన్మవీరుణ్ణి. వీరుడుగానే మరణించి వీరభోజ్యమైన నాకలోకసుఖం నా జనకుని సమక్షంలో అనుభవిస్తాను. అంతేకాని వెనుకడుగు వేయను" అని నిశ్చయించటం సుగ్రీవునిపై లంఘించటం ఏకకాలంలో జరిగిపోయింది. "ఓరీ! అవివేకీ! మళ్ళీ ఎందుకు వచ్చావు? పనిలేని మంగలి పిల్లితల గొరిగు నట్లున్నది నీ బుద్ధిలేని పని. వజ్రం వంటి నా ముష్టి చూచావా? ఈ ముష్టిఘాతంతో ప్రాణరక్షణ కోసం పారిపోలేవు సుమా. కాచుకో" అంటూ వెన్నుపై కొట్టాడు. ఆ దెబ్బకు మరొకడయితే సర్వాంగాల్లో నెత్తురు చిమ్మా

ల్పింది. కాని, సుగ్రీవుడు తట్టుకున్నాడు. అయినా వీపు చిట్లి కొండ నుండి సెలయేరువలె, వీపునుంచి నెత్తురు ధారగా ప్రవహించింది.

ఆ భయంకర ముష్టిఘాతానికి నొచ్చి, తోక త్రొక్కిన నాగేంద్రుడు వలె సమీపంలో వున్న పెనువృక్షాన్ని పెకలించి గురితప్పక శిరంపై మోదాడు. అంతబలశాలియైన వాలి, కన్నులకు చీకట్లు క్రమ్మగా, కాయం కంపించి విహ్వలించాడు. సముద్రమధ్యంలో ఓడ తుఫాను తాకిడికి పరిభ్రమించినట్లు పరిభ్రమిస్తున్న శరీరాన్ని నిలవరించుకుని సుగ్రీవుని డొక్కలో పొడిచాడు. అతడు గుండెపై గుద్దాడు. ఈ విధంగా, అనిల సుపర్ణవేగులు, మహాబలులు, వాలి సూర్యజులు, ఘనత వర్ధమాన పరస్పర విజిగీషాభావులై సూర్యచంద్రుల్లాగా, మేరువింధ్య పర్వతాల్లాగా, వృత్ర వాసవుల్లాగా, ఘోరంగా పోరాడసాగారు. ముష్టాముష్టి, కచాకచి, కరాకరి హేమాహేమీలు విడువియక పెనగులాడుతుంటే దేవతలే విస్మయం పొందారు. పాకశాసన తనయునిచే భగ్న దర్పుడవుతున్నా రవిజుడు సాహసంతో, కొండలతో, బండలతో, చెట్లతోనూ, చేమలతోనూ, కాళ్ళతోనూ, చేతులతోనూ నొప్పిస్తూనే వున్నాడు. తమ్ముని పోరులో ప్రతీకార వాంఛే కాని, పసలేదని వాలి గుర్తించాడు. తనచావు ఈనాడు తప్పేట్లు లేదని సుగ్రీవుడు నల్దిక్కులా చూడసాగాడు. అశక్తుడయి అలసిపోయిన తమ్ముణ్ణి వాలి పరికించాడు. అవకాశం దొరికిందని ఆనందించాడు. పైకెత్తి గిరగిర త్రిప్పి పదిక్రోసుల దూరం పారవేసి, శనగలు తిని చేయి దులుపుకున్నట్లు విజయంతో వీటికి పోదామనుకున్నాడు. అయస్కాంతాల వంటి బాహువులు సాచి వైరిని పట్టబోతున్నాడు.

## శ్రీరాముడు వాలిని నేల గూల్చుట

అనుచరులూ, అమాత్యులూ, సుగ్రీవుని పాటుకు శోకం పొందుతుంటే లోలోపల క్రుంగుకుంటూ రామునివైపు దీనవదనాలతో చూడసాగారు. ఇంతవరకు వాలి సుగ్రీవుల పోరాటంలో శరప్రయోగానికి సమయం దొరకక విచారపడుతున్న రాముడు సజ్యం చేసిన ధనువులో వాలి వధకు తగిన బాణాన్ని పొదినుండి లాగి నారికి సంధించి పొదరులవంక

చూశాడు. సుగ్రీవుడు వాలిచే పైకెత్తబడి వడిసెల వలె త్రిప్పుతుండటం, సుగ్రీవుడు శక్తిహీనుడై వాలి చేతిలో వగుదాకువలె తిరుగుతుండటం కన పించింది. క్షణకాలం జరిగితే సుగ్రీవుడు కొన్ని యోజనాల దూరంలో పడి ప్రాణాలు విడుస్తాడు. మౌర్వీటంకారం, శరగమనం, వైరివక్షఃస్థల ప్రవేశం, వాలి "అబ్బా!" అన్న ఆక్రందనతో అవనిపైపడటం శ్రీరాముడు సంకల్పమాత్రంతో సాధించాడు. రామకోదండ జ్యానిర్గత టంకార నాదానికి కిష్కింధానగరం చెవుడు పడింది. పర్వత బిల ప్రతిరావాలలో వన చరాలు, ఖచరాలు స్మృతిహీనమై పడిపోయినాయి. పడిపోతున్న వాలి చేతులు పట్టు సడలటంతో సుగ్రీవుడు నేలపైకి దూకాడు. ఘోరకుఠా రఘా రాహతికి కూలిన వట వృక్షంలాగా, కులిశప్రహారానికి పక్షనిర్మూలమై పడిన కొండలాగా రాముని శరం గుండెనాటి వనేచరపతి వాలి నేల గూలినా, తేజం తప్పలేదు. అసువులు పోలేదు.

ఇంద్రదత్తమైన మణిఖచిత కనకదామశక్తిచే, తేజోబల పరా క్రమ శ్రీవాసవి మేనిని విడిచి వెళ్ళక, సంధ్యా సమయారుణ రంజిత జల ధరంగా ప్రకాశింపజేసింది. ఆవేళ ధర్మాంచిత మాలికతో, మర్మోద్ఘాటనం చేసే మహీ సుతాపతి శరంతో, నిర్మలమైన దేహకాంతితో వాలి మూడు రంగులతో ముప్పన్నె మేఘంలాగా గోచరించాడు. వీరుడైన వాలికి రామ చాప నిర్ముక్త నారాచం పరమగతి కారణమైంది. జ్వాలలు లేని అగ్నివలె ప్రళయవేళ పతితమైన భాను బింబం వలె, సుకృతం నశించగా సుర లోకంనుంచి అవనిపై పడిన యయాతివలె, ఇంద్రవిలాగా అసహ్య బలుడూ, అతిదురా ధర్షుడూ, విపులోరస్కుడూ, విశాలవక్షుడూ, దీప్త ముఖుడూ, దీర్ఘబాహుడూ అయిన వాలి ధరణి వ్రాలి "తన్నింత చేసిన ధన్వి ఎవడా!" అన్నభావంతో ఆ ప్రదేశమంతా ఆలోకిస్తున్నాడు. అతని చూడాలని ఆకాంక్షించాడు. తనకోసం కూలిన వాలి చూస్తున్న భావం సూర్యవంశ్యుడైన రాముడు గ్రహించాడు. అతనికి కనుపించాలనీ, అతని ప్రశ్నలకు ప్రత్యుత్తరం ఇవ్వాలనీ కూడా తలంచి తమ్ముడి సమీపించాడు

## శ్రీరాముణ్ణి చూచి వాలి దూషించుట

మేరుమందర పర్వతాలు జంగమాకారంతో వచ్చినట్లు వచ్చి ఎదురుగా నిల్చిన రామలక్ష్మణులను వాలి చూచాడు. సముద్రతరంగాల వలె ఎడతెగక వస్తున్న భావపరంపర క్రమబద్ధం చేసి కీశపతి, ప్రస్ఫుటంగా ధర్మంగా, మృదువుగా, కటువుగా వుండే మాటలు రాముణ్ణి లక్షించి పలుక సాగాడు. "ఏమి రామా! నీవు సుక్షత్రియుడవు గదా? శాస్త్రజ్ఞాన సంవేదివి గదా? కులీనుడవూ, స్థిమశ్రీ నిధివీ, తేజస్వివీ, యశస్వివీ కదా? ఈ అధర్మం ఎందుకు చేశావో చెప్పగలవా? జనరహితుడూ, జ్ఞానప్రకాశుడూ, సమయజ్ఞుడూ, సత్యవ్రత సాధురక్షణ గలవాడూ, జితేంద్రియుడూ అని లోకం నిన్ను పొగడటం అస్థాన ప్రశంస కాదుగదా? దమం, శమం, క్షమం, ధర్మం, ధైర్యం, సత్యం, పరాక్రమం, దండం మొదలైన రాజలక్షణాలు అపరాధులయందు సముచిత సద్గుణాలని విశ్వసించిన వాడను కనుక భార్య వద్దన్నా. ఈనాటి యుద్ధంలో కుటిలనీతి వుందని చెప్పినా వినక, పౌరుష ప్రధాన జీవితం గలవాడిని కావటం చేత పోరుకు వచ్చాను. నీ చేత చచ్చాను. నిజంగా నీ పట్ల ఇన్ని సద్గుణాలు వుంటే, ఇతరునితో సమరం చేస్తుంటే ఎందుకు నీవు కల్పించుకున్నావు? నీ మొగం నేనెరుగను. నా మొగం నీవెరుగవు. మరి మనిద్దరి మధ్య తగాదాకు ఏకారణం ఎన్నుకున్నావు? తృణచ్ఛన్న కూపానివనీ, మేకవన్నె బెబ్బులివనీ, నివురు కప్పిన నిప్పువనీ, మధులిప్త గరళానివనీ, పాపచారుడవనీ, మాయల మారివనీ నేను నిన్ను ముందుగా భావించితే నిన్నే ఎదుర్కొని విజయమో, వీరస్వర్గమో పొందేవాణ్ణి. నీచాతినీచులు కూడ చేయని ఈ యధమకృత్యం దాశరథివై ఎందుకు చేశావు? కాయలూ, కూరలూ తినే శాఖామృగాలను కూడా రాజులు వధిస్తారా? ఇట్టి చేయరాని చేత మీ పూర్వులెప్పుడయినా చేశారా! లేక ఇతరలోకాల్లో ఇంకెవరైనా చేశారా? ఈ జటాజినవల్కల ధారణానికీ, ఈ శరచాప ధారణానికీ, అడవుల్లో ఆకులలములు తిని తిరిగే మాబోటి వానరులే దండనానికి తగినవారేమో నాకుతెలియదు. నేలకోసమో, వెండి బంగారాలకోసమో, ఆపేక్షించిన అంగనకోసమో కలహించటం లోకంలో

సరిపాటి. నా రక్షణలో వున్న ఈ కొండలు, గుట్టలు, చెట్లు చేమలు నీవాన పడి ఈ దురాగతచర్యకు ఒడిగట్టావా?

నయమూ, దుర్నయమూ, అనుగ్రహమూ, నిగ్రహమూ, సజ్జనదుర్జన భూపతుల లక్షణాలని కదా బుధోక్తి. ఇంటిలో ఏ జాతికి చెందినవాడవో ఎరుకపరచగలవా? క్షత్రియులకు సమరం సమ్మతమైనదే. అయినా, దేశకాలపాత్రాలు లేవా? ఉన్నా నీవు వాటిని పాటించవా? ఇంద్రియోద్వేగంతో కామదాహం కళ్ళకు మనకు కన్పిస్తే చాటునుంచి బాణం సంధించి పాపరాధుడవైయినావు ఇప్పటి నీవు చేసిన పని ఎవరయినా ధర్మమంటే నీ పాదాలంటి క్షమాభిక్ష కోరుతాను దొంగ, హంతకుడు, సూచకుడు, గురుతల్పగుడు, భూరమణఘ్నుడు, లుబ్ధుడు, మిత్రబ్రాహ్మణ గోనాశకుడు, నాస్తికుడు, అన్నకంటె ముందు పరిణయమాడే తమ్ముడు, వీరంతా నరకంలో పడి యమునిచే శిక్షింపబడతారు నీవు సజ్జనుల్లో చేరినవాడివి కదా? పాపం! నా తోలు నీవు కప్పుకుంటావా? నా మాంసం తింటావా? నా ఎముకలూ, వెంట్రుకలూ నీకేమైనా ఉపయోగపడతవా? ఏమాశించి నన్ను వధించావు? ఐదుగోళ్ళున్న జంతువులలో, అడవి ఏదుపంది, తాబేలు, ఉడుము, కుందేలు, ఇవి ఆహారంకోసం వధించవచ్చు నేను పంచనఖాన్నే మరి నేను దేనికీ పనికిరాను కదా? మృగభావంతో చంపటానికి ఎందుకు సిద్ధపడ్డావు? పరమ పతివ్రత నా గృహిణి తార ముందు జరిగే పరిణామం వూహించే వద్దని బ్రతిమాలుకుంది. దుర్బుద్ధినై క్రోపి వచ్చినందుకు, క్షత్రియ రూప దురాచారుని చేతిలో జీవాలర్పించా. నిన్ను నాథుడుగా పొందితే ధరణి అనాథవలె పొర్లుతుంది. ధూర్తపతిని కట్టుకున్న ఇల్లాలు భర్తృసుఖం పొందలేదుకదా? నీవు శఠుడవు. నీచమతివి. వికృతివి. ధర్మరతుడైన దశరథునకు దాంభిక జితేంద్రియుడవెట్లు పుట్టావు? భిన్న చారిత్ర కక్ష్యతో, శీలధర్మాభిమాన మార్గాతివర్తనంతో, త్యక్త సత్య సృణియైన రామ గజంచేత చిక్కి నాకర్మ కాలుని పురానికి కాపురానికి పంపింది. ధర్మ మెరిగిన పెద్దలు ఛీ కొట్టగా మొగమెత్తి తిరుగగలవా? వారి ప్రశ్నలకు సముత్తరం ఈయగలవా? తగవుకు రాని నన్ను చంపి మగతనం చాటుకున్నావు కాని, పగవాళ్ళపై నీ మగతనం

ఏమైంది ? ఇది ఎట్టి మగతనం ? నీ వెట్టి మగవాడవు ? నా ఎదుట నిల్చి కలహానికి నీవే దిగితే ఇంతకు పూర్వం ఈ స్థితిలో నిన్నే చూచేవాణ్ణి. అపరాజిత విక్రముడనైన నేను అల్పుడవైన నీచేత చాటుగా చంపబడ్డాను. తనివితీర త్రాగి నిద్రించిన త్రాగుబోతు సర్పదష్టుడై చచ్చినట్లు ఇంత పాడుపని ఎందుకు చేశావో నాకు తెలుసు. ఆ సహాయమే నన్ను కోరితే ఆ రావణుని చెంపలు వాయించి, చేతులు గట్టి తెచ్చి నీ పాదాలపై పడ వేయనా ? సీతాదేవిని నీ సన్నిధానానికి చేర్చనా ? ఆమెను పాతాళంలో దాచినా, సముద్రగర్భంలో దాచినా, హయగ్రీవుడు శ్వేతాశ్వతరి తెచ్చినట్లు కొనిరాకపోయానా ? వ్యర్థుని చెలిమిచేసి కాలం వ్యర్థం చేసుకున్నావు. నా అనంతరం రాజ్యార్హత గలవాడు కనుక సుగ్రీవుడు నన్ను చంపవచ్చు. మరి నీవేం తలంచి నన్ను చంపావో నీకే తెలియాలి పుట్టిన ప్రాణి గిట్టటం అనుస్యూతంగా వచ్చే ఆచారమే. అందుకు నేను విచారించను. అనూహ్య పద్ధతిలో అక్రమంగా చావవలసి వచ్చిందే అని కుందుతున్నాను. ఈ పాప కృత్యానికి నీవు నాకేం ప్రత్యుత్తరం ఈయగలవో, అది ఏ విధంగా వుండాలో ఆలోచించి చెప్పు" మంటూ నోరెండగా, బాణ ఘాతానికి పరి పరి విధాల బాధపడుతూ, తేజశ్శక్తులు క్షీణిస్తూండగా రాముని వంక చూస్తూ మౌనముద్ర వహించాడు. రాముడు రెండడుగులు ముందుకు వేశాడు.

## వాలి ప్రశ్నలకు శ్రీరాముడు సమాధానం చెప్పుట

ధర్మార్థయుక్తమూ, హితమూ, పరుషమూ అయిన భాషణాన్ని వాలి పల్కగా, కాంతి హీనమైన దిన కాంతునివలె, జలంలేని మేఘంవలె, చల్లారిన అగ్నివలె అవనిపై పడిన అగచరపతిని రాముడు అవలోకించి, ధర్మార్థగుణసహితమైన రీతిలో "వానరపతీ ! బాలిశుడవై ఆగ్రహావేశాల్లో అన్న మాటలు విన్నాను. అందుకు ప్రత్యుత్తరం ఇస్తాను అది శేషం వుంటే తెలుపు. నీవు ధర్మార్థకామ త్రివర్గ మర్యాదకానీ, లౌకికాచారం కానీ విచారించక కేవలం బాలకుడువలె పరుషంగా భాషించావు. దానికి నేను నిన్ను తప్పుగా తలంచను. నన్ను నీవు నిలబెట్టి ప్రశ్నించవచ్చును. అందుకు బదులు చెప్పవలసిన వాణ్ణి నేనే కనుక. ఆచార్యుల,

వృద్ధుల, బుధుల నిందించి నీక్రోధ లక్షణం కనపరచుకున్నావు. శైలకానన నదీనదద్వీపాంతరాకలిత విశాల విశ్వంభర మొదట ఇక్ష్వాకుల పాలనలోని దని తెలుసుకో. ఈ చతుస్సముద్ర ముద్రిత విశ్వంభరలోని మనుజులుకాని మృగాలుకాని, పక్షులుకాని, ధన కనక వస్తువాహన వివిధవిశేషాలు కాని వారి పాలనలోనివి పాలించటానికీ, తూలించటానికీ వారే ప్రభువులు, కర్తలు. ఇప్పుడు ధర్మలాభరతుడైన భరతుడు, ఋజుశీలి, త్రివర్గ తత్త్వజ్ఞుడు, విగ్రహానుగ్రహ నిపుణ శక్తిమంతుడు అయోధ్యాపతియయి, అవనిని పాలిస్తున్నాడు. నే నతని అగ్రజుడను సత్యము, నయము, వినయము, శౌర్యము ఏ నృపాలుని పాల వసిస్తుందో అతని ఆజ్ఞమేరకు విశ్వరక్షణ వాంఛతో, నేనూ, నాయట్టివారు కొందరూ సంచరిస్తున్నారు. ఆ మహా మనీషి ధర్మపాలనలో అధర్మంగా ఎవరు ప్రవర్తించి బ్రదకగలరు? ఇక మేమో, స్వ ధర్మం వదలక, ధర్మహీనులుగా సంచరించే వారిని దండిస్తూ తిరుగుతున్నాం. ఇందులో దోషం ఏమీ కనపడలేదే? ఇక నీ సంగతి విచారిద్దాం. ధర్మగర్హిత కర్మరుడవై, కామపరతంత్రుడవై, నీవు భూపతి వన్న నీతి మరచి సంచరిస్తున్నావు. నీ దోషాన్ని నీవు గుర్తించక పరులను అన్యాయంగా నిందించటం మొదలు పెట్టావు తండ్రి, అన్న, విద్యచెప్పిన గురువు. ధర్మవర్తనులైనవారికి తండ్రి వంటివారు తమ్ముడూ, తన శిష్యుడూ, తన పుత్రుడూ, తన బిడ్డలవంటివారు ఈ వాక్యాలకు శాస్త్రాలే ప్రమాణం నేను నీకోసం కల్పించిన కారు కూతలు కావు.

నీకు ధర్మసూక్ష్మం తెలియనట్లున్నది. అవును తప్పులేదు. మహా మనీషులైన మహర్షులకే ఒకొక్కప్పుడు అదిమహాగహనం దృశ్యాదృశ్య ప్రపంచంలో అంతర్వర్తిగా ఏ తేజస్సు ప్రకాశిస్తుందో అదే సమగ్రంగా తెలిసింది. నీవు చపలుడవు, నీవంటి చాపల్యం గల క్రోతులు కొన్ని మిత్రామాత్యులుగా సేవిస్తున్నై. పుట్టుగ్రుడ్డి వేరొక పుట్టుగ్రుడ్డిని ఆలంబనం కోరి ఏమి సాధిస్తాడో నీవూ అదే సాధించావు. నేను చేసిన కార్యాన్ని గురించి, మాయామర్మాలు లేకుండా స్పష్టంగా చెప్తున్నాను విను. కేవలం కోపంతో అభిశాపాలు పెట్టి నన్ను తిట్టకు. నీ వధకు కారణం నే నిప్పుడు వివరంగా విశదీకరిస్తున్నాను. నీవు సనాతనంగా, సంప్రదాయ

బద్ధంగా వస్తున్న ధర్మాన్ని కాలదన్ని, తమ్ముడు జీవించి వుండగా అతని అర్ధాంగి రుమను బలాత్కరించి రమించావు. ఇది మొదటి కారణం. ఈ పని నీవు చేశావా? లేదా? నీపట్ల తెలిసో తెలియకో అపరాధం చేశాడు. తప్పు, అజ్ఞానకలితమైందని పాదాలపై పడ్డాడు. రాజ్యం పౌరుల బలవంతంపై చేకొన్నదే కాని, దుష్టబుద్ధితో కూడింది కాదనీ, నీవు మళ్ళీ గ్రహించుమనీ నీ తమ్ముడు కోరితే క్షమించతగిన తప్పుకు తన్ని రాజ్య బహిష్కారం దారగ్రహణం శిక్షగా విధించావు. ఇది రెండవ కారణం. పరమ పవిత్రమైన ఇక్ష్వాకుల వంశంలో పుట్టి, సుక్షత్రియ ధర్మం చేపట్టి అగ్నిసాక్షిగా మిత్రకార్యం నెరవేరుస్తానని ప్రతిజ్ఞ కట్టడం మూడవ కారణం.

తన కూతురుతో, చెల్లెలితో, తమ్ముని భార్యతో తగులం చేసే కామ ప్రవృత్తునకు విధించతగిన దండనం వధ ఒక్కటే. ఈ పుడమికి భరతుడు రాజు. మేం మాతని ఆదేశానుసారం ధర సంచరిస్తూ, ధర్మేతరులను దండిస్తుంటాము. సుగ్రీవుణ్ణి మిత్రునిగా గ్రహించినందువల్ల నా తమ్ముడు సౌమిత్రి, అతడూ నాకు ఒక్క రూపు. అతడు నాకు కాదగిన కార్యం సాధించి మేలు కూరుస్తాడు. నేను నీ తగవెరుంగక ముందే ప్రమాణం చేశాను. అన్నమాట తప్పటం మా వంశాచారం కాదు. ఈ పాలిత భూమి మాకు చెందింది. దుష్ట శిక్షణం, శిష్టరక్షణం మా విధి. నీవు తమ్ముని భార్యనూ, ఇల్లూ, వస్తు వాహనాలూ హరించి తప్పుచేశావు. ఆ తప్పుకు మరణమే శిక్ష. నే నాతనితో చెలిమి చేశాను. మాట ఇచ్చాను. ఇందులో అసత్యమేదో నీవే చెప్పు. ఇన్ని ధర్మాలు నేను నీపట్ల చేసిన పనికి ఆధారాలు. నీవు రావణుని బంధించి, సీతతో నాకర్పిస్తానన్నావు. నీవంత వాడవని నాకు తెలుసు. నిన్ను వీరుడు కాదని ఎన్నడూ నేను భావించలేదు. కాని, ఆ సహాయం నీ వల్ల పొందతలచలేదు. నీవు ధర్మాతిరిక్త సదామవర్తివి. ధర్మజ్ఞుడైన మిత్రుడు ఎంతచేసినా నాకదిచాలు. చేయకున్నా నేను బాధపడను.” అని ఆగాడు.

# వాలి రామునితో ధర్మాన్ని చర్చి తర్కించుట

వాలి, రాముడు చెప్పిన సమాధానం ఆమూలాగ్రం ఆలకించాడు. "తన శంకకు తగిన పరిహారవాక్యాలు రాలేదు ఎందుకో రాముడు చేసిన పని ధర్మదూరం అని మనస్సు నొక్కి చెపుతూంది ఆధిక్షేపం వుంటే అడగమన్నాడు కదా? అడుగుతాను" అని నిర్ధారించుకుని, "రామా! నీవు చాలా శ్రమించి ధర్మ సూక్ష్మాలు నాకు తెలిపావు. అవి నిజంగా నా శంకా శల్యం పెకలించలేక పోయినై. పైగా డొంకతిరుగుడుగానూ, తాడిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడమేతకన్నట్లుగానూ వున్నై. నేనడిగిన వాటికి సూటిగా ప్రత్యుత్తరం ఇవ్వు. ఈ విశాల విశ్వంభర ఎవ్వరిదైనా, నా పూర్వులు కానీ, నేనుకానీ, సామంతులంగా ఏ రాజుకూ కప్పం చెల్లించలేదు. మా సార్వభౌమాధికారాన్ని ఇంతవరకు ఎవ్వరూ ఆధిక్షేపించలేదు కనుక మేం స్వతంత్రులం. ధర్మ రక్షణ మీ వంశాచారమైతే, నా చేత వెళ్ళగొట్టబడి, నేటికి నీ మిత్రుడుగా చెలామణి అయిన నా తమ్ముడు నీ తండ్రిని కూడ రక్షణ కోరాడు. నా దుష్ప్రవర్తన కూడ చెప్పివుంటాడు? అతడేల నన్ను దండించలేదు? భరతుడు రాజన్నావు అయితే నీ పాదుకలెందుకు సింహాసనం పై వున్నవి? తమ్ముడు జీవించివుండగా అతని భార్యను అపహరించటం అకర్మమైతే, నేను బ్రదికి వుండగా నాభార్యను వాడెట్లు గ్రహించాడు? మా కుటుంబ కలహంలో నీ వెందుకు జోక్యం కలిగించుకున్నావు? నన్ను వీరుడని అంగీకరించావు. వీరునితో వీరుడు పోరే విధానం ఏతీరుగా వుంటుంది? ఏక పక్ష నిర్ణయం ఎంత వరకు ధర్మం? ధర్మం ధర్మం అంటూ చాలా సార్లు వుద్ఘాటించావు. అందులో కూడ సూక్ష్మాలున్నవన్నావు నన్ను మృగంగా భావించావా? రాజుగా భావించావా? కోపంలో నేను నిన్ను దూషించాను, నిజమే నీ మాటల్లో అన్యాపదేశంగా నిందలేదా? భరతుడు నిన్ను దుష్ట శిక్షణకు నియోగించాడా? భార్యా సంపాదనకు సాహసం కాక, క్రోతి సాయం కోరిన నీవు నన్ను కోతి లక్షణాలు పోలేదని ఆక్షేపించవచ్చునా? నా ఎదుట నిల్చి పోరక చాటున దాగి శర ప్రయోగం ఎందుకు చేశావు? ఏ ధర్మశాస్త్రంలో ఈ సూక్ష్మార్థం వుంది? చావబోతున్న నాకీ విచారణ ఎందుకంటావేమో? బ్రదికినా, చచ్చినా, మా

జీవితాలు మానవులకు మార్గదర్శకాలు కావు. నీవు కాబోయే అయోధ్యా పతివి నాకంతా తెలుసు. నీ నడక లోకానికి ఆదర్శం అవుతుంది. అందుకని నీ లోకాపవాద కళంకాన్ని నేనే తుడిచివేద్దామని. రామా! ఇక నీవేం చెప్పదలిచావో చెప్పు" అని వూరకున్నాడు.

## వాలి ప్రశ్నలకు రాముడు సధర్మంగా సమాధానం చెప్పుట

"ప్లవగనాథా! అడుగదలచిన అనుమానాలన్నీ అడిగినట్లేనా? సమాధానం తర్వాత మళ్ళీ ప్రశ్నిస్తావా?" అని రాముడు వాలిని అడిగాడు. "సమాధానం సహేతుకంగా, సంతృప్తికరంగానూ వుంటే ఇంకా ప్రశ్నలకు తావెక్కడ? చెప్పేది మాత్రం సూటిగా చెప్పు" అని వాలి బదులుపల్కులకు నిరీక్షిస్తున్నారు. రాముడు నిశ్చలుడై, నిర్మలుడై, నిశ్చయబుద్ధితో ఇలా చెప్పసాగారు. "వనేచరవల్లభా! నీవు కోరినవిధంగా ధర్మనిర్ణయం చేస్తాను. నా నిర్ణయం దోషభూషితమైతే నా చేతికోదండం తునిగిపడుతుంది ఇందుకు సత్యధర్మాలే సాక్షులు. మొదటి ప్రశ్న. నీవు స్వతంత్రుడవనీ, సామంతుణ్ణి కావనీ కదా? మా తాతలు దిగ్విజయం చేసి సార్వభౌములైనవారు ధర్మప్రవర్తకులైన వారిని ప్రభువులుగానూ, కొందర్ని సామంతప్రభువులుగానూ మన్నించారు. అనపరాధుల వారు దండించలేదు. దురాక్రమణ వాంఛ వారికి లేదు కనుక రాజ్యాలను కబళించలేదు. ఆ విధంగా నీవు స్వతంత్రుడవు. రెండవ ప్రశ్న. నీ తమ్ముడు నీ తప్పు తెలిపినా నా తండ్రి ఎందుకు దండించలేదని. నీవన్నది నిజమే కావచ్చు. ఆయన నిన్ను దండించవలసినదే. కాని ఆయన నీకన్నా బలవంతుడు కాదు. పరశురాముని పట్ల కూడా ఆయన వుదాసీనంగానే వున్నాడు. వివేకశాలి తెలిసి తప్పు చేయడు. కాలం కలిసి వచ్చేవరకు పౌరుషవంతుడైనా అజ్ఞాతంగా వుండటం రాజనీతే అవుతుంది. అందుకు నీ తమ్ముని చరిత్రే తార్కాణం. మూడవది- భరతుడు రాజైతే పాదుకలు సింహాసనంపై ఎందుకున్నవని. నిజంగా భరతుడే రాజు. నా తండ్రి నా పినతల్లి కోరికలను మన్నించారు. ఆ కోరికల్లో అయోధ్యకు రాజు భరతుడు

కావటం వుంది. అందుకు నే నంగీకరించి అడవికి వచ్చాను. నా తమ్ముడు రాజ్యం స్వీకరించమంటే నేను తిరస్కరించి తండ్రి కోరిక మన్నించుమన్నాను. అతడు పోలికలేని తమ్ముడు కనుక నాపైగల భక్తి కొద్దీ ఆవిధంగా నన్ను గౌరవిస్తున్నాడు అతని ఆజ్ఞ అవనిపాలురు అంగీకరిస్తున్నారు. అతని సత్ప్రవర్తనం చేతనయితే ఆచరించతగ్గది. అధిక్షేపించే అవకాశం లేదు. నేనాతని పాలనలో విధి తెలిపినటిచే ప్రథమ పౌరుడను. నాల్గవప్రశ్న. బ్రదికిన తమ్ముని భార్యను గ్రహిస్తే తప్పయినప్పుడు బ్రదికిన అన్నభార్యను గ్రహించటం తమ్మునికి తప్పు కాదా ? అని

ఇది సామాన్యధర్మంలో తప్పే అవుతుంది. వివేకంలో విశ్లేషిస్తే కాని గుణదోషాలు తెలియవు దాన్నే ధర్మసూక్ష్మం అంటారు. నీ తమ్ముడు నీ కోసం సంవత్సరాలు కాచి, ఆపై నీవు మరణించావనే విశ్వాసంతో లఘుకర్మచేసి కిష్కింధకు వచ్చాడు. నీవు జీవించినదీ, మరణించినదీ పౌరులకు చెప్పలేదు. మంత్రులు విచారించి అరాజకం కాకుండా అతణ్ణి రాజును చేశారు. ఎంతకాలానికి నీవు రాకపోవటంతో నీ భార్య అతణ్ణి ఆశ్రయించింది. అతడు అపహరించలేదు మీ జాతిలో అనులోమ విలోమాలు తప్పుకాదు. ఆమె ఆవిధంగా చేయటానికి కారణం నీవు మరణించావని ఆమెకూడా నమ్మటమే. నీవు రాగానే మళ్ళీ ఆమెను స్వీకరించావా ? లేదా ? కాబట్టి ఆమె, అతడూ చేసినపని దోషం కాదు. ధర్మ సమ్మతం నీవు చేసినపని అమానుషం. ధర్మదూరం. ఐదవ ప్రశ్న. మీ కుటుంబకలహాలలో నా ప్రవేశం ఎందుకని. నేనై నేను కల్పించుకుంటే గర్హనీయమైన కార్యమే మీలో ఒకడు నా సాయాన్ని అర్థించాడు. అటు సార్వభౌమాధికారం, శరణాగత రక్షణం, ఇటు మిత్రధర్మం, ప్రతిజ్ఞాపాలనం సాధించబడ్డది. ఆనాడు నా తండ్రి చేయక విడిచిన పని ఈనాడు నాచేత చేయబడింది ఆరవప్రశ్న. వీరునితో వీరుడు పోరేతీరు ఎట్టిదని. ఈ ప్రశ్నలో నేను చాటునుండి శరప్రయోగం చేసి చంపానని కదా నీ వుద్దేశ్యం. నిజమే నేను మరుగున నిలిచే నిన్ను బాణంతో కొట్టాను. అందుకు బలమైన ధర్మాలు రెండు కారణంగావున్నై.

నీ తండ్రిఇచ్చిన కాంచనమాల ధరించివచ్చావు. అది ప్రత్యర్థి బలాన్ని ఆకర్షిస్తుంది. సురసార్వభౌముడిచ్చిన బలాన్ని గౌరవించాలి కాని వ్యర్థం చేయకూడదు. అది ఎంతదూరంలో వున్నవాడిశక్తి గ్రహిస్తుందో నాకు తెలుసు. అందుకే నీవు చూచినా విపర్యం రాదనే దూరవేధి శరాన్ని ప్రయోగించాను. ఆ కాంచనమాల నీకంఠంలో వుండగా నీవు మరణించవు. అది గ్రహించినవాణ్ణి కనుక నిన్ను తగలంగానే చచ్చే బాణంతో కొట్టలేదు. పరశురాముని వైష్ణవధనువు ఎక్కిడినానే కాని అతని పంపలేదు. అందుకు కారణం అతడు చిరంజీవి అతని పుణ్యలోకాలను దగ్ధంచేసి వచ్చినవాడి కంటే హీనంచేసి విడిచాను. ఆవిధంగానే, వరతపః ప్రభావంవల్ల అజేయులైనవారు దుష్టులయితే ఆ శక్తులమన్నించి, గౌరవించి సూక్ష్మ ధర్మదర్శనంతో దండించాలి. హిరణ్యకశిపుడు మృత్యువులేని వరం కోరాడు. దానిని వివరించుతూ, కోరినకోర్కెల్లో, ధర్మాతిరిక్తం కాకుండా సూక్ష్మదృష్టితో పరిశీలించి నరసింహాకారమూ, నఖాయుధంగా అవతరించి లోపదర్శనంతో రూపుమాపిన కథ నీకు తెలుసును. నేనూ, నీ తండ్రివరాన్ని కాంచనమాల శక్తినీ మన్నించి నిన్ను దండించాను. ఇది మొదటి కారణం రెండవకారణం— నేను చాపధారినై ఎదుట పడితే నీవు పశ్చాత్తాపంతో శరణాగతుడవౌతావు. శరణాగత రక్షణం నా విధి. అప్పుడు నేను అనృతవాదినీ, మిత్రవంచకుణ్ణీ కావలసి వస్తుంది. నీవా చేయరాని తప్పు చేశావు శిక్షార్హుడవు. నీవు తమ్మునికి ప్రతీకారవాంఛతో ద్రోహంచేశావు కాని, ఇంకెట్టి పాపకార్యాలు చేయలేదు. ధర్మంగా పాలనావిధి నిర్వర్తిస్తున్నావు. నా సంగతి పరోక్షంగా నీకు తెలుసు. నేను ధర్మదూరంగా వ్యవహరించనని పరిపూర్ణ విశ్వాసం నీకు వుంది. ఆ విశ్వాసంతోనే యుద్ధానికివచ్చావు. అదీ నాకు తెలుసు. అయితే నాపై నీవు పెట్టుకున్న నమ్మకం లౌకికంగా నీకు తెలిసిన ధర్మాలు ఆధారంగా పెట్టుకున్నది కనుక ఆ దృష్టితోనే నన్ను దూషించావు. ఏడవ ప్రశ్న. నా నిర్ణయం ఒక్కడి వాదన విని చేసిందని. అందుకే ఆ నిర్ణయం పాక్షికమైనదనీ, అధర్మమైనదనీ నీ ఆక్షేపణ. అవునా?

ఇదికూడా యుక్తియుక్తంగా అడిగినదే. నేను ప్రధమంగా నీ తమ్మునితో అగ్నిసాక్షిగా కోరింది స్నేహం మాత్రమే మిత్రునకు మిత్రుడు చేయగలిగిందంతా చేస్తానని మాట ఇచ్చింది నిజం. ముందుగానే నిన్ను చంపుతానని బాసచేయలేదు. తర్వాత క్రమంగా అతనిబాధ చెప్పాడు. ఆ చెప్పటంలో తన కాపురం పాడుచేసి తన్ని తగిలేశావనే చెప్పాడు కాని, మీకు వచ్చిన వైరికారణం చెప్పలేదు. నేను శంకించి ఆ రహస్యోద్ఘాటనం చేయించాను. అదివిన్న తర్వాతనే నిన్ను వధిస్తానని చెప్పాను. అతని వాక్కులలో అసత్యం వుంటే హనుమంతుడు అంగీకరించడు ఆతడెందుకో కారణ జన్ముడుగా కనిపించాడు. నన్ను చూచి అంతా భీరులై పారిపోతే ఆతడు భిక్షుకవేషంతో వచ్చి మా రాకనుగూర్చి తెలుసుకుని, తన యజమాని పాటుచెప్పి మిత్రత్వం చేకూర్చాడు ఆతడు పల్కినదానికీ, సుగ్రీవుడు చెప్పినదానికీ భేదం లేదు. అంత మతిమంతుడైన హనుమంతుడు నిన్ను వదలి అతనికి అండదండగా వున్నాడంటే నీవు నీ తమ్మునిపట్ల చేసింది తీరని ద్రోహం అని విశ్వసించటమే అందుకు కారణం. సంఘంలో ప్రబలస్థానంలో వుండి, పలుకుబడి కల్గినవారిపై ఏదైనా అభియోగంవస్తే, మేధావులైన మంత్రుల ప్రత్యక్షంగా పిలిపించి విచారించరు వారికి ఆప్తులైన గూఢచారుల నియోగించి రహస్యాలను రాబట్టి ప్రభువు సమ్ముఖానికి పిలిపించి శిక్షిస్తారు. నీపై నీతమ్ముడు అభియోగం మోపాడు. అది ప్రభువులకు మారుగా నేను స్వీకరించి వాడిని విచారించాను ప్రశ్నించాను. పరోక్షంగా హనుమచే రహస్యం గ్రహించాను. నీకు మరణశిక్ష విధించాను. అది అమలుపరిచాను. నేను ధర్మం తప్పినవాడనైతే నీ ఎదుటికి ఎందుకు వస్తాను? నీవు బ్రతికివుండగానే నీలోవున్న దోషాన్ని నీకు విస్పష్టంగా చెప్పి పశ్చాత్తాపంతో పరిహారం చేయించి, విశుద్ధమనస్సుతో వీరమరణం కల్పించి వుత్తమలోకాలను పొందింపచేయాలనే వచ్చాను. ఇంకొకరైతే నీవు పడిపోగానే, తాను తప్పుచేశానన్న భయంతో సమక్షానికే రాడు.

వనచరేశ్వరా! నీవు అడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చాను. ఇటువైపు చూడు. నా చేతి కోదండం భగ్నంకాలేదు. పైగా

వ్యప్రకాశంతో తేజరిల్లుతూంది. మీరు నరరూపం, వానరలక్షణం
'లవాళ్ళు. అందుచే రాజావుఅవుతావు మృగమూ అవుతావు. నీపట్ల నాకు
?ండు భావాలూ లేవు నీపైన స్వీయమైన వైరమూలేదు. నిన్ను దోషిగా
?త్రమే భావించాను. కేవలం ఇంద్రియవశుడనై భార్యావార్త తెస్తాడనే
?నభావంతో అధర్మంగా నిన్ను వధించలేదు. మిత్రునికిచ్చిన మాటకై
[మ]ర్యాదా దూరమైనపని చేయలేదు. తగినతప్పు వుండబట్టే దండించటం
?రిగింది. నీకు మనశ్శాంతికై మరికొన్ని మాటలు చెపుతాను నాపై
ద్వేషం వదలి వాటిలో సత్యాన్వేషణం సలుపు.

## శ్రీరాముడు వాలికి ధర్మశాస్త్రంలోని వాక్యాలు చెప్పుట

సర్వ ధర్మాలూ మనువిరచితాలు. మా పూర్వుడు మనువు. ఆయన చెప్పిన ధర్మాలను మేం అక్షరాల పాటిస్తాం. ప్రభువయినవాడు పౌరులు తప్పులు చేస్తే దండిస్తారు. ఆ దండనం అనుభవించిన వాళ్ళకు, నరకం కాక, నాకం ప్రాప్తిస్తుంది ఇక్కడ దండనం తప్పించుకుంటే యాతనా శరీరంతో యమదండనం అనుభవించి తీరాలి. అది ఇంతకంటె ఘోరం. దొంగతనం చేసినవాడు శిక్ష ఇక్కడ అనుభవిస్తే, మిగిలిన మంచి పనుల ఫలితానికి అనుభవం కోసం అమరలోకం పోతాడు. అలా కాకపోతే వచ్చి యమలోకంలో పాపానుభవం అయ్యేదాకా వుండి మళ్ళీ జన్మ ఎత్తుతాడు. అంతేకాని స్వర్గానికి పోడు. యాతనా శరీరం స్వర్గలోక ప్రవేశానికి అర్హం కాదు తప్పు చేసినవారి దండించని భూపతి ఆ పాప ఫలం అంతా అతడే అనుభవిస్తాడు. మా పూర్వుడయిన మాంధాత తప్పు చేసిన శ్రమణుని ఘోరంగా శిక్షించలేదా? ప్రపంచంలో ప్రభువులు వుదాసీనంగా వున్నా, న్యాయనిర్ణయ సమయంలో జాగ్రత్త పడి దండించి దండ్యుల పాప కూపంలో పడకుండా వుద్ధరించిన గాథలెన్నో వున్నై. ఇంతవరకు మానవ ధర్మాలను చెప్పాను నీవు మానవుడవు కనుక. నీవు శాఖామృగానివి కాబట్టి ఆ లక్షణం కూడ చెపుతాను. మృగాలను వేటాడేవారు, పట్టదలచినవారు వలలు పన్ని, గోతులు తీసి, మాటుపెట్టి చెట్లెక్కి, దాగి, అనేక విధాల

వ్యవహరిస్తారు. వారి లక్ష్యం మృగలాభమే అందుచేత నేను చాటున వుండి చంపినా దోషం లేదు నేను వేటభావంతో కానీ, వైరభావంతో కానీ వధించలేదు. నీవు అవితర సాధ్యమైన తపస్సు చేసి ఈశ్వరానుగ్రహానికి పాత్రుడవైనావు. ధర్మం తప్పక పాలించావు. బలవంతుడవని దురాశాపరుడవై అన్యరాజ్యాల ఆక్రమించలేదు. నీవు ఒకేఒక తప్పు చేశావు. ఆ తప్పుకు నాచేత శిక్షింపబడ్డావు. ఇక నీకు మిగిలింది వీరమరణం. ఉత్తమ లోకాలు. అవి నీకు తప్పక లభించుతై. నేను చెప్పవలసినవన్నీ చెప్పాను. శస్త్రచికిత్సకుడెట్లో ప్రభువూ అట్లే రోగి బాధ పడతాడనీ, చేసేది శస్త్రం అనీ వైద్యుడూ, దోషి, పాటిమానవుడనీ,, స్వేచ్ఛగా బ్రతికే హక్కు వానికున్నదనీ, విధించేది మరణదండనం అని ప్రభువూ తలిస్తే, ఇంక వైద్యుడెందుకూ? ప్రభువెందుకూ? పాలనం ఎందుకు? చికిత్సలెందుకు? వాళ్ళల్లో మానవత్వం లేకకాదు వాళ్ళూ మానవులూ, కష్టసుఖాలూ తెలిసినవాళ్ళే. ఆ వృత్తి అటువంటిది. ఆ సమయంలో వాళ్ళకు ధర్మ పాలనం తప్ప దయాదాక్షిణ్యాలుండవు అందు వల్ల రాజును దూషించటం కానీ, చంపటం కానీ, హేళన చేయటం కానీ చేయరాదు దేవాంశతో కొందరు భూ వాదులుంటారు వారే ధర్మ రక్షణ చేస్తారు. నేను నువ్వన్న మాటను పాటించలేదు ఇకపై పాటించను కూడ. ఇక నీవు ప్రశ్నిస్తావో, పశ్చాత్తప్తుడవవుతావో నీ ఇష్టం" అని చెప్పి రాముడు వాలివంక సాపేక్షగా చూశాడు.

## వాలి రాముని సమాధానానికి సంతృప్తుడై క్షమించ వేడుట

రాముడు శాంతంగా, సూటిగా అడిగినవాటి కన్నిటికీ ప్రత్యుత్తరం చెప్పగా వాలి విన్నాడు రంధ్రాన్వేషణం చేశాడు.కాని, ధర్మలోపం కనపించలేదు. తన తప్పు తనకు స్పష్టంగా కనుపించింది. తాను దండనార్హుడని గుర్తించాడు. రాముడన్నట్లుగా, తానేపాపం చేయలేదు. చేసిన పాపానికి ఇక్కడ శిక్ష పొందటమే యుక్తమని తలంచాడు. రెండు చేతులూ మోడ్చి నమస్కరించాడు. "రామచంద్రా! నీవు పల్కిన పలుకులు దుర్బుద్ధులు విశ్వసించక నీవు చేసింది దోషమనే అంటారు. అది వారి అజ్ఞానానికి

చిహ్నం, అధఃపతనానికి మార్గం అవుతుంది. నేను ధర్మమని విశ్వసించాను నాకిది తగిన దండనమే. నేను గాక నా జాతిలో ఇట్టి దుష్కార్యం జరిగితే ఇదే శిక్ష నేను విధిస్తాను తార నీవెవరవో నాకుతెలిపింది. నేను కొంత విన్నాను దానవులచే ధర్మదూషితమైన ధరణీదేవి భారం తగ్గించటానికి రఘువంశ రత్నంగా రాముడవై అవతరించిన ఆదివిష్ణువే నీవు. నీచేత దుష్టదానవ సంహారం జరిగి ధర్మం ప్రతిష్ఠింపబడుతుంది. నీ చేత వీర మరణం పొందుతున్న నాకు అన్ని ఉత్తమ లోకాలు స్వాగతం పలకగలవు. ధర్మం సామాన్యమైనది. ధర్మసూక్ష్మం అసాధారణమైంది. నాకిప్పుడు నీవు నొక్కి నొక్కి చెప్పిన ధర్మసూక్ష్మం అనే మాటకు ధర్మంలో ఇంత లోతుకు పోతేకాని తెలియదు. అది తెలియటానికి కేవలం చదువు చాలదు. సంస్కారం గల మనస్సు కావాలె. నేనిప్పుడు పాపపంకిలంనుంచి బయట పడ్డాను. నా మరణానికి చింతించను. ప్రియదార తార దూరమవుతూందని శోకించను. నాకు ఒక్కగానొక్క బిడ్డ అంగదుడు. వాడి భవిష్యత్తును గూర్చే దుఃఖపడుతున్నాను. ఆ శోకం కూడ నీవే శమింపచేసి నన్ను ఉద్ధరించు. నీ బాణఘాతానికి కలిగే బాధ భరించలేక, నీవు అధర్మంగా నన్ను వధించావన్న ఆక్రోశం ఆపుకోలేక, అనరానిమాటలు అన్నాను. కరుణా స్వభావుడవు గాబట్టి మన్నించి, నా తప్పు నా చేతనే ఒప్పించి, పశ్చాత్తాపం చేకూర్చి, నరకద్వారం మూయించి, నాకద్వారం తెరిపించావు. మనసమాగమం అపసవ్యంగా జరిగింది. సవ్యంగా జరిగితే ఉభయులం ఎంతో సంతోషించేవాళ్ళం?

## అంగదుని వాలి శ్రీరామునికి అప్పగించుట

ఈ జన్మలో నాకా ప్రాప్తి లేదు. నీకు పలుసార్లు చెప్పవలసిన పని లేదు. సంకల్పమాత్రం చేతనే సమస్తం గ్రహించగలవు. అయినా, గతానుబంధ దోషం కొన్నిమాటలు చెప్పిస్తూంది. నా బిడ్డ అంగదుడు తల్లికంటె చనవు నా వద్ద కలవాడు. వాడు కలిగిననాటినుంచి పరస్పరం ఎడబాసి ఎరుగం. ఇంకా బాల్యం వదలలేదు. తప్పు ఒప్పు తెలిసి నడిచే జ్ఞానం ఇంకా రాలేదు. అయినా అన్నివిధాలా గుణవంతుడు. తండ్రిని

మరపించే శక్తి కలవాడు. చెప్పినపని జీవం వుంటే చేయకవదలడు. వాడికి ఇక నేను లేను కనుక నీకే అప్పగిస్తున్నా. పితృభావంతో వాణ్ణి తీర్చి దిద్దు తల్లి దండ్రి నీవే. నీవు చల్లని దృష్టితో సంరక్షిస్తానంటే నేను సంతోషంతో మరణిస్తాను నీ సోదరులపై ఎటువంటి వాత్సల్యం నీకు వుందో, అటువంటి వాత్సల్యం అంగద సుగ్రీవులపై వుంచు అంగనా జనానికి ఆరాధ్యయైన నా భార్య తార నేను చేసిన తెలివిలేని పనికి ఆమె కూడ కృతదోష అయింది. అందుకు నీ చెలికాడు ఆమెను అనాదరించి అవమానం చేయకుండా కాపాడు. సుగ్రీవుడు సరిగా నిన్నర్థం చేసుకుని నీ అభిమానానికి పాత్రుడయితే ఈ కిష్కింధ ఏమిటి? పదునాల్గు లోకాలూ పాలిస్తాడు. నీవెంతటి వాడవో, నీవెవరవో స్వయంగా తెలిసినవాణ్ణి కనుక భార్య వద్దన్నా యుద్ధానికి వచ్చింది నీచేత మరణించటానికే. ఇదివరకే నా తప్పు నాకు తెలుసు. కాని, "కార్పణ్య దోషోపహతమైన స్వభావాన్ని మార్చుకోలేకపోయాను. ఆ అపుణంబాలం నీ కరుణావీక్షణామృతవృష్టిచే కడుగబడి అమలినుడను ఐనాను. నాకిక ఇహవాంఛలపు ప్రవృత్తి లేదు. వేదన భరించలేకుండా వున్నాను. నాపై నీకు అనుగ్రహం ఎలా వస్తే అలా చేయి. నా జవసత్వాలు క్షీణిస్తున్నై" అని స్పృహ కోల్పోయాడు.

## శ్రీరాముడు వాలిని ప్రియంతో ఓదార్చుట

"ఇంద్రతనయా! వగవకు. నీవిప్పుడు మనఃపూర్వకంగా పశ్చాత్తప్తుడవయి పున్నమినాటి వెన్నెలరేడు వలె ప్రకాశిస్తున్నావు. నీ చివరి కోరికలు రెండూ నువ్వు కోరిన విధంగా నెరవేరుతవి. నన్నుగూర్చి కాని, నిన్నుగూర్చి కాని, నీ అకృత్యాన్ని గూర్చి కాని విచారించకు. నీ పాపానికి నాచేప్రాయశ్చిత్తం చేయబడింది. కారణం నీవైతే అందుకు కార్యంనేనైనాను. అది అంతమాత్రమే. నేను దండుడనై నీవు దండ్యుడవై నిరయమార్గనుంచి ఇరువురం బయట పడ్డాము. ఈ పని ఏనాడో జరగవలసింది. నా జనకుడు శక్తి లేనివాడు కనుక నరకం పొందలేదు. శక్తి వుండికూడ నిన్ను దండించకపోతే నీతో పాటు నరకలోక యాత్ర నాకు తప్పదు. విధివిధానంలో నేను నిమిత్త మాత్రుణ్ణి. ఇక నువ్వు ఎట్టి ఆయాసం, ఈసూ,

రోషం పొందవద్దు. ప్రాణపరిత్యాగ సమయంలో ఏమి కోర్కెలు ఉంటవో అవి వాసనారూపంగా పునర్జన్మకు ప్రాతిపదికలవుతై. నీ బిడ్డ అంగదుని కోసం నువ్వు అంగదపడవద్దు. అతడు నీకెట్లో, నాకు, రవిసుతునకు అట్లే నీ దారగురించి కూడ వ్యసన పడవద్దు ఆమె అన్ని విధాల అత్యుచ్చ స్థాయిలో గౌరవించబడుతుంది. నీకు ఉత్తమలోకాలు చేకూరతవి ఇంక నీకేం కోరికలున్నవో ఎరిగించు. శక్తివంచనం లేకుండా చేస్తాను" అని రాముడు పలికాడు రాముని వాక్యామృతాన్ని శ్రవణాంజలి గ్రహిస్తుంటే వాలి కొంచెం తేరుకున్నాడు. "రామా! రవివంశ సోమా! ధన్యోస్మి ధన్యోస్మి, చాలయ్యా చాలు. అవధులతిక్రమించిన నీ ఆదరానురాగానుగ్రహాలకు పాత్రమైన నా జన్మ సార్థకం అయింది. ఇక మిగిలింది నీ నామస్మరణతో పూర్తిగా కన్నుమూయటం ఓం నమశ్శివాయ, ఓం నమో రామచంద్రాయ" అంటూ, గాఢమైన తమ్ముని ముష్టిఘాతాలూ, వృక్షపర్వత తాడనాలకూ, రామబాణాగ్నికీ శిథిలమైన శరీరాన్ని నిగ్రహంతో నిలువరించుకో లేక మళ్ళీ మూర్ఛిల్లాడు. రాముని నయనాలు అశ్రుపూర్ణాలైనై.

## వాలి వధ ఎరింగి తార కిష్కింధ వెడలి వచ్చుట

దూరంగా వుండి దారుణంగా వధింపబడిన వాలి సంగతి వనచరులు పరుగెత్తి వెళ్ళి తారకు తెలిపారు. ఆ వార్తవిని తార శోకభారంతో కుమారుని వెంటగొని కిష్కింధ వదలి భర్త పడిన ప్రదేశానికి బయలు దేరింది ఆమె వెంట అంగదుని అనుచరులు కొందరు ముందుగా వచ్చి ధనుర్ధారియైన రాముణ్ణి చూచి భయంతో లేళ్ళ గుంపులాగా చెల్లా చెదురుగా పారిపోసాగారు. వాళ్ళను చూచి తార పట్టరానికోపంతో "పారుబోతులైన వనచరులారా! ఎందుకు పారిపోతారు? ఇన్నాళ్ళు మీరంతా నా బిడ్డను సేవిస్తూ ఇష్టం వచ్చినట్లు తిని బలిసి ఈ సమయంలో గుహల్లోకి పారిపోతున్నారా? మీకు విశ్వాసం లేదా? రాజభయం లేదా? ప్రాణాలపై అంత తీపా? ఆగండి మీ పరుగుకు కారణం చెప్పండి. నా భర్త ఆగ్రహం మీకు తెలుసుగదా? అంత ప్రమాదం ఇప్పుడేమి అకస్మాత్తుగా వచ్చి పడింది? జరిగిన సంగతి వివరించండి" అని కఠోరంగా ప్రశ్నిం

71166

చింది. పారిపోతున్న కపుల ప్రాణాలు అరచేత పట్టుకొని వాళ్ళల్లో వాళ్ళు మంతనం చేసి, కల్లబొల్లి మాటలు కల్పించి తారను భయపెట్టే తలంపుతో ఈ విధంగా చెప్పారు.

## వానరులు వాలి పాటు తారకు చెప్పుట

"అమ్మా ! తారాదేవీ ! ఏం చెప్పం. ఈ సమయంలో నీవు ఇల్లు వదలి రావడం మంచిపనికాదు. నగరంలోకి వెళ్ళి నీ బిడ్డను రక్షించుకో. యముడే రాముడుగా వచ్చి ప్రభువును దూరపాతిత శరంతో వధించాడు. సుగ్రీవుల, కొండలు, బండలు, చెట్లు చేమలతో తీవ్రంగా మోదుతుండే, ఆ రాముడు బాణ వర్షం కురిపించి చంపాడు మా ప్రభువు పాటుచూచి మన వాళ్ళు చెట్టుకొక్కడూ, పుట్టకొక్కడుగా పరిగెత్తిపోయారు. ఆ క్రూరులు పురంలో ప్రవేశించకుండా గవనులన్నీ మూయించు. అంగదునకు వెంటనే ప్రభువుగా అభిషేకం చేయించు. దండోరావేయించు. వానరులంతా వచ్చి పురంలో ప్రవేశిస్తారు. ఏం చేయకుండా నీవు ఒక్కతెవే ఇక్కడవుంటే ప్రమాదమే వస్తుంది ఏమంటావా ? ఇది వరకు ప్రభువుచే వెళ్ళగొట్ట బడినవాళ్ళతో కలిసి భార్యలు లేని వాళ్ళూ, వుండి దురాచారులైన వారూ పురంలో చొరబడతారు. అప్పుడు నిన్ను నీవు రక్షించుకోవటం కష్టం. ఇక ఇక్కడి వారికీ, వచ్చినవారికీ ఎడతెగని పోరు సాగుతుంది. చెప్పవలసిన మాటలు చెప్పాం. తల్లీ ! ఇక నీ ఇష్టం" అని. ఆ మాటలు విన్న తార కట్టతెగిన వరదలాగా వస్తున్న కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ తనకు తోచిన తీరిగా చెప్ప మొదలు పెట్టింది.

"అవివేకులారా ! ఏమని ప్రేలుతున్నారు ? జగదేక వీరుడైన నా భర్త మరణిస్తే తగుదునమ్మా అని ధరణీ రాజ్యం తలనెత్తుకొమ్మనేనా ? ఆత్మ సదృశుడైన నాపతిపోతే ఈ క్షుద్రరాజ్య సుఖం నాకెందుకు? ఎక్కడి లోకం ? ఎక్కడి పుత్రులు ? ఎవరికి వారే యమునాతీరే అనుదానికి పతి వున్నంత కాలమే బ్రదుకుగాని, ఇహసుఖంకాని అతడు లేకపోతే జీవితంలో ఇక ఏమీ లేదు. మీ కంత ప్రాణాశవుంటే మీ చిత్తం వచ్చినట్లు చేయండి. నాకు మీహితోపదేశాలూ, నీతులూ అక్కరలేదు. నేనేంచెయాలో

అది నాకు తెలుసు. మీరేం చేయాలో మీకూ తెలుసు. సుగ్రీవుడు రాజు కాగానే ఆయన్ను ఆశ్రయించి బ్రదుకుతాడు. మీతో అనవసర ప్రసంగం నాకెందుకు? ఇప్పటికే కాలం మిక్కిలి గడిచింది. శరవిద్ధుడై నా పతి ఏ స్థితిలో పడివున్నాడో ఆయన పాదాల చెంతకు చేరుతాను. అతనితోనే అనుగమిస్తాను" అని చెప్పి అంగదునితో పాదచారిణియై సమర భూమికి సత్వరంగా చేరుకుంది.

## తార వాలిని సందర్శించుట

దారుణ బాణ తాడితుని, మదద్విరదాభుని, మహేంద్రతుల్య విక్రమున్ని, భూతలపతితున్ని, భృశార్తిధారయైన తార చూసింది. మొదలంట నరికిన కదళీ వృక్షంలాగా ధరపై పడి గాటంగా బాహువుల పొదివి "హా నాథా! ఎంత అన్యాయం చేశావు? ఎటువంటి సంగ్రామంలోనైనా ఎదురు లేని వీరుడవై పరాక్రమించి జయలక్ష్మీ సమేతుడవై వచ్చేవారివే? నేడిట్టిపాటు నీ కెందుకు వచ్చింది? నే చేసిన అపరాధం ఏమిటి? నీకై వచ్చి నన్ను పలుకరించవేమి? నీ మాటకెన్నడైనా ఎదురు చెప్పానా? నీకై రచించిన శయ్యపై శయనింతువు కావిలే. నీకేం తక్కువని ఈ కఠిక రాలపై పడియున్నావు? నీ స్వర్గ ప్రయాణంలో వేరొక స్త్రీపురి లభించిందా? ఇన్నాళ్ళు పాలించిన కిష్కింధ అప్పుడే అంత వెగటయిందా? నేనింక ఎవ్వరితో కలసి విహరిస్తాను? ఎవరితో ప్రియోక్తులు పలుకుతాను, మనోహర కుసుమ గుచ్ఛాలు నా సిగ ఎవరు ముడుస్తారు? ప్రాణేశ్వరీ! రమ్మని ప్రియమార పలుకరించే దిక్కెవరిది నాకు? ఎవని రాకకు ప్రతీక్షించుతూ ద్వారదేశంలో నిలిచి పరికించేది? నా ఆశలన్నీ అడియాలు చేసి అకాల దుర్మరణం పాలు కావటం నీకు ధర్మమేనా? అర్థసింహాసనాసీననై రాజ్య తంత్రాన్ని పర్యవేక్షించే యోగం ఇంక నాకు లేదుగా. ముంద మోపి మూల గూర్చుండి బ్రతుక గలనా నేను? సరినెలంతల చేత సపోపచారాలు చేయించుకుంటూ, ఆశ్రితులకు, ఆర్థులకు, అనాధులకు తృప్తిగా భోజన భాజనాలు సవరించి, కోరిన వస్తువులు ప్రసాదించి వారిచ్చే ఆనందాశీర్వాదాలు పొందే యోగం నా కింక ఎక్కడిది వస్తుంది? ఇంక

ఏకాంతంలో మనస్సులో కోరికలు ఎవరి శ్రవణేంద్రియాలకు ప్రీతిగా వని కేది? నీవే నన్నుబాసి పరలోకానికి పోతే నేనింకెవరికోసం జీవించేది? లోకంలో సాటిలేని మేటి పోటు మగవివని పేరుగాంచిన నీయట్టివాడు పతిగా లభించటం పూర్వజన్మల్లో చేసిన పుణ్యం అని ఎంతో పొంగి పోయాను. నా ఆశలన్నీ చవిటి నేల నాటిన బీజంవలె నిరుపయోగం చేసి నిర్జరలోకాన్ని చేరుకుంటున్నావా? నీ సహోదరుణ్ణి పురినుంచి వెడలనడచి అతని సతిని బలవంతంగా నేలిన పాపం ఈ నాటికి ఇలా పండిందా? నీ మేలుకోరి నేను హితం చెపితే నన్నే చీకొట్టి ఈ స్థితికోరి తెచ్చుకున్నావు. నేనేం చేసేది? ఇంత వరకు శోకం అంటే ఏమిటో నాకు తెలియదు. దైన్యం ఎరుగను. అన్ని అనర్థాలను నాకు వదలి ఆనందధామం నీ వరి గావు. మేరువు వంటి నిన్ను పోగొట్టుకుని విధవనై ఏ ఆశతో ఈ దేహాన్ని పోషించేది? నాథా! పలుకవా? ఇదుగో నీ బిడ్డ అంగదుడు నీ ప్రేమ మరగి నన్ను మరచినవాడు. వాడికోసమైనా కన్నులు తెరచిచూడు.

## తార ఘోరంగా శోకించుట

నాథా! ఇక నాగోడెవరు వింటారు? ఈ బిడ్డకు సంరక్షకులెవరు? బిడ్డపై నీ ముద్దుముచ్చట్లు ఏమైనవి? కంటికి కడివెడుగా శోకిస్తున్న పసి వాడే అశం శుభం తెలియనివాడే. ఇంత కాలం ఖేదరహితంగా బ్రదికి నందుకు చివరి మాట ఏ దైవా చెప్పవా? నా కర్మ అందుకు కూడ నోచుకో లేదా? అయ్యో! కార్చిచ్చువలె నా దేహం కాల్చుతున్న ఈ శోకం సహించటం ఎలా? అతిలోక వీరుడవైన నిన్ను చంపి రాముడు ఘన కార్యం చేశాడు. మిత్రుని కిచ్చిన మాట వడ్డీతో కలిపి చెల్లించాడు రవి పుత్రా! ఇక రుమతో హాయిగా సుఖించు. నీ కద్దం తొలగింది కదా? జీవితేశ్వరా! నీ పరాక్రమాన్ని, నీ సౌందర్యాన్ని, నీ సాధుగుణాన్ని చూసి ముగ్ధులై మోహించి నిన్నాశ్రయించి, నీచే ఆదరింపబడుతున్న ప్రియకాంతల నింకెవరాదరిస్తారు? వాళ్ళ గతి ఏమవుతుంది? నీ అజేయ విక్రమం పైనే విశ్వాసం వుంచుకున్నావు కాని, రాజనీతిజ్ఞురాలైన నీ దాస తార రానున్న వుపద్రవాన్ని ముందే సూచిస్తున్నదన్న విశ్వాసం కలిగించుకోలేక పోతివి

కదా ! ఎన్నడు నా మాట దాటని నీవు పెడచెవి పెట్టి, పిశాచం పోకిన వానివలె పోరుకు పోతున్నప్పుడే అనుమానించాను. రాముని మార్గాని విజయంతో మరలి రావని లోలోపల అప్పుడే ఏడ్చాను నాధా ! ఎంత ఏడ్చినా నీవురావు. ఇంత సుఖానుభవాలు ఇక నాకు లేవు, బ్రతికితే ఈ అనుబంధాలు పోవు. ఎవరెంత ఆదరించినా, ఎన్ని సౌఖ్యాలు కూర్చినా పతికి పతి ఇచ్చే సుఖానందాలతో సాటి రాగలవా ? నా జీవిత దీపం ఆరి పోయింది. జీవితేశ్వరా ! ఇక ఈ చీకటి బ్రదుకు బ్రదకలేను కనటం మాత్రమే నా వంతుగాచేసి, పెంచే బాధలన్నీ నీవే భరించి పెద్దచేస్తున్న నీవే మమకారం వదలి నాకలోక వాసానికి పోతుంటే నా కెందుకీ మోహం? ఎందుకీ అనురాగం ? పతికి పత్యనుసరణమే పరమ ధర్మం. మన సంసారయాత్రలో అజ్ఞాన కృతమైన దోషాలు నీపట్ల నేను ఏవైనా చేస్తే అవి ప్రేమతో మన్నించు. నీతో నేనూ వస్తాను. నిన్ను ఒంటరిగా పంపను అమరలోకంలో వాళ్ళచ్చే స్వాగతం ఇద్దరికీ ఇవ్వాలి ఇదే నా తుది నిశ్చయం" అంటూ పతి పాదాల చెంత ప్రాయోప వేశానికి సిద్ధపడింది.

## హనుమంతుడు తారను ఓదార్చుట

తారాపథం నుంచి రాలిన తారవలె తారపతి పాదాలపై పడిపోగానే, హనుమ ఆమెను సమీపించి వినారాదరభావాలు పెనగొనగా "అమ్మా ! ఎందుకు ఏడుస్తావు ? ఓర్చుకో తల్లీ ! దేహి జ్ఞానంచేతగాని, అజ్ఞానంచేత గాని చేసిన కర్మఫలం హేతువుగా మేలు కీడు ఇహపరాలలో అనుభ విస్తాడు. అంతేకాని, ఎవరు ఎవరిని ఏమీ చేయలేరు నీ భర్తచేసిన సుకృతఫలం మంచిది. వీరమరణం పొందాడు ఉత్తమ లోకాలు చూర గొన్నాడు. బుద్బుదప్రాయ (నీటి బుగ్గవంటి) మైన శరీరంకోసం బుద్ధి మంతులు శోకించరు. ఒకవేళ శోకిస్తే తనకోసం తానే శోకించాలి. పరుల కోసం దుఃఖించటం పాడిగాదు దీనుడు ఇంకో దీనుడికోసం ఏడిస్తే ఎంత లాభమో ఒక చచ్చిన ప్రాణికోసం బ్రతికిన ప్రాణిఏడిస్తే అంతే లాభం. అంగదుడు కేవలం బాలుడు. పరిరక్షకురాలవు నీవు. భర్తతో అనుగమించటానికి నీవు జీవ పుత్రకవు. వాని భావికుర్తాలన్నీ నీపై

వున్నవి. నీవంటి విదుషీమణి ఈ మాత్రం కూడా ఆలోచించ అవసరం లేదా? విపరీతమైన దుఃఖం వివేకం నశింపచేసిందా? పుడమిపై భూత కోటి పుట్టడం గిట్టడం రెండూ నిత్యంగా జరిగేవి కావు. వాలి శక్తి విజిత శూలి. పరాక్రమశాలి. ఆయనకు ఔర్ధ్వ దైహిక కర్మలను ఆచరించకపోతే ప్రేతత్వం నశించదు అది నశిస్తేగాని పుణ్యలోక నివాసం సిద్ధించదు పుణ్యలోక ప్రాప్తి కోరితే ఐహిక కర్మలకంటే అంతర్లోక నివాస కర్మలు చేయటం అవసరం. అవన్నీ నీవూ, నీ పుత్రుడూ చేయాలి అర్బుదన్యర్బుద సంఖ్యలను మించిన కపికోటిని పాలించాడు. ఆయినవారిని అనేక విధాల ఆదరించాడు ధర్మబుద్ధితో శాస్త్రదృష్టఫలతత్త్వ విధిజ్ఞత సామదాన శాంతులతో స్వీయ కర్తవ్యాన్ని నెరవేర్చి స్వర్గధామం చేరాడు ఆయన కోసం చింతింప పనిలేదు ఈ బిడ్డకూ, కపిలోకానికీ, కిష్కింధకూ ఇక నీవే దిక్కు? పిల్లవాడు పెద్దవాడయ్యేదాకా కిష్కింధ నీ రక్షణ క్రింద వుంచుకుని అనంతరం అతనికి అప్పగించితే అతడే పాలిస్తాడు. కొడుకు రాజ్యం చేస్తుంటే కళ్ళారా చూచి ఆనందించే కాలం చేరువలోనే వుంది. ఎందుకు పురుషులు సంతానం కోసం తపిస్తారో ఆ పని చేయటానికి అర్హుడు అంగదుడున్నాడు. అతనిచేత పరలోక క్రియలు పరిపూర్తి చేయించు. అనంతరం పెద్దల సమక్షంలో బిడ్డను రాజుచేసి రాజమాతవుగా రాజ్యాన్ని నడుపు అంతేకాని ఆత్మహత్యకు పాల్పడకు" అని బోధించాడు

## తార హనుమకు ఉత్తర మిచ్చుట

ఆదరంతో చెప్పిన హనుమ వాక్యాలు విని తార, ఆంజనేయా! నీవు ప్రాజ్ఞుడవు నీ జన్మ వృత్తాంతం నాకు తెలుసు. నీ శక్తి నాకుతెలుసు నీ మాట వినలేదని వేరే భావించకు ఆడుదానికి నూరుగురు కొడుకుల కంటే శౌర్యధనుడైన పతి ఆలింగనం గొప్పది. పతి విహీనవై ప్రమకు లోని మాధుర్యం పోగొట్టుకుని జీవించమంటావా? నా స్వేచ్ఛ, నాఆనందం నా గౌరవం, నా తెలివి అన్నీ నా పతితోనే పోయినై. ప్లవగ సమ్రాట్టునకు దైహిక సంస్కారం జరపటానికి నేనెవ్వతెను? అంగదుణ్ణి అభిషేకించే అధికారం నా కెక్కడిది? అవన్నీ తీర్పటానికి అధికారి, సమర్థుడు

పినతండ్రి సుగ్రీవుడు. కొండవంటి భర్తను కోల్పోయిన నాకు ఈ గౌరవంతా ఎందుకు? నా బిడ్డపట్ల నేను చేయదగింది ఏమీలేదు. కొడుకులకు తండ్రికంటే బంధువు ఇంకొకడులేడు. తెలియక తల్లి ఆప్తురాలని అనుకుంటారు. అది సత్యదూరం. ఎన్ని విధాల యోజనచేసినా ఇహపరాలలో పతి సంశ్రయం కంటే ఉత్తమమైనది సతికి వేరొకటి లేదు. గత కాలంలో సాధ్వులందరూ ఆదరించిన దారే నాకు దిక్కు. అందుకే నా పతి శయ్యపై నేనూ పండి ప్రాయోపవేశం చేస్తాను జరగవలసిన విధానం ఎలావుంటే అలాగే జరుగుతుంది. ప్రాణ పరిత్యాగ సమయంలో ఇంకా ప్రాపంచక భ్రాంతి నా కెందుకు? భర్తృ సహగమనంతో నా సర్వదోషాలూ హరించి పోతై. అందరిలోనూ నీవు ఉత్తముడవు, నీ మాటను సుగ్రీవుడు జవదాటడు. మీరు ఏం చేస్తే మేలో ఆలోచించి అదేచేయండి. సమరాంగణంలో హతుడైన వానికి స్వర్గద్వారం తనంత తానుగా తెరచి ఆహ్వానిస్తుంది. మీరు ప్రేత కర్మ జరిపినా, మానినా, రామునిచే రణంలో కూలిన నా భర్త రాకను చతుర్దశ భువనాలు ఏవి నిరోధించలేవు అతనితో అనుగమిస్తున్న నాకు సుమంగళీ పూజకు కొదువలేదు" అని పతి పడియున్న నేలపై పడింది.

## వాలి సుగ్రీవునితో గతాన్ని మరచిపొమ్మని చెప్పుట

రామ శరవిద్ధుడై భరించరాని బాధతో తెలివి తప్పిన వాలి బలవంతంగా పోతున్న ప్రాణాలను బంధించి, శ్వాస మెల్లగా విడుస్తూ, కన్నులు తెరచి చూచే సరికి కళాహీనమైన మొగంతో, అశ్రుల ధారికలు కట్టి, జుట్టు చెదరి శోకిస్తున్న అంగదుడు కనిపించాడు అతని ప్రక్కనే ప్రాప్త విజయుడైన భాను పుత్రుడున్నాడు. కర సంజ్ఞతో తమ్ముని దగ్గరకు పిల్చాడు. స్పష్టమైనట్టి, స్నేహపూర్వకమైనట్టి; వాత్సల్య భరితమైనట్టి వాక్యాలు చెప్పసాగాడు. తమ్ముడా! నిర్నిమిత్తంగా నీ పై దోషారోపణ చేసి వెళ్ళగొట్టానని నన్ను నిందింపవద్దు. తెలియని భావిఫలం తలపట్టి యాడ్చి: బుద్ధి తగులబెట్టింది. మనం సౌభ్రాత్రంగా కలసి సుఖించే యోగం బహుకాలం కరువై పోయింది. దైవకృతం తప్ప చూస్తే, మనకు విగ్ర

హించటం శక్య మవుతుందా ? నే నిక జీవించలేను. ఈ వనేచర రాజ్యం అంతా నీవే గ్రహించు. అన్ని విధాలా నాయంత వాడవు, నా జీవితాన్ని ఈ రాజ్యాన్ని, శ్రీవిభవాన్ని, త్రిజగద్విమతంబైన సత్కీర్తిని వదలి పోతున్నాను. బ్రతికినప్పుడే వైరం నేను మరణించగానే ఆ వైరం కూడా మరణిస్తుంది. మిగిలిన వారెవ్వరూ నీకు అపకారులుకారు. ప్రకృతులు ఎవరు ప్రభువైతే వాణ్ణే సేవిస్తూ బ్రదుకుతారు. పౌరులు ఎవరురాజైనా పట్టించుకోరు. వారు కోరేది ధర్మపాలనం. కాబట్టి నీ మార్గం ఇప్పుడు నిష్కంటకం రాజపదం వాంఛించదగిందే. కాని, అనుకున్నంత ఆనందం నిజంగా అందులో లేదు. పౌరునకున్న స్వేచ్ఛ ప్రభువుకులేదు. ఉన్నట్లు సంచరిస్తే అది అతని నాశనానికి ఇతర కారణం అక్కరలేకుండానే తోడ్ప డుతుంది. నీవు కొంతకాలం పాలించావు. కనుక నీకు లోటుపాట్లు, అనుపానులన్నీ అవగతమే. ఇక నే చెప్పదగింది ఏమీ లేదు. ఐనా, చివరి మాట చెపుతా.

## వాలి సుగ్రీవునకు అంగదుణ్ణి అప్పగించుట

ఈ దురవస్థలో మరణోన్ముఖంగా వున్న నేను చెప్పేది దుష్కర మైనదైనా కాదనకుండా నీవు చేయవలసివుంది. ఇంతవరకూ నీవు చూస్తూనే వున్నావు కదా, నా బిడ్డ అంగదుణ్ణి ? వీడు బాలుడు. బాల్యచయ రూపిత వక్త్రుడు సౌఖ్యపాత్రుడు. నా సర్వం నిలిపి పెంచిన ప్రేమ చిహ్నం. వీనిని నీకు అప్పగిస్తున్నాను. నేను నీ కపకారం చేశాను. కాని, అమాయకుడైన అంగదుడేమీ చేయలేదు. తండ్రిలేని కొరత తీర్చాలంటే నీకన్నవానిగా స్వీకరించాలె. అదే నేను నిన్ను అర్థిస్తు న్నాను. ఈ అభంశుభం తెలియని బాలుడు భయపడితే భయం బాపు. నాకై విలపిస్తే మంచిమాటలతో ఓదార్చు. బాలుడైనా వాలిబిడ్డ సుమా. విక్రమంలోగాని, రయగతిలో గాని నీకు సమానుడు. ముందురానున్న కాలంలో రాక్షసులతో యుద్ధం తప్పదు. అప్పుడు నీ పక్షంలో, నీవూ, హనుమంతుడూ కాక, అంగదుడు కూడా వుంటాడు. కళ్ళారా వాని పరాక్రమం చూసి నీవే గ్రహిస్తావు. అనుక్షణం నీ యాజ్ఞానుపాలనం

చేస్తూ నిన్ననుసరించివుంటాడు. మూడులోకాలూ ఎత్తివచ్చినా వెనకడుగు వేయడు. ఈ బిడ్డను గూర్చి ఇంతకంటే చెప్పవలసిన పని లేదు. ఇప్పుడు చెప్పబోయే విషయం నీకు ఇదివరకే పూర్ణంగా తెలుసు.

ఈమెను తార. సుషేణుని గారాబుకూతురు. సూక్ష్మార్థ నిశ్చయ నిష్ణాత్మ. ఔత్పాతిక జ్ఞానంలో పండితురాలు. ఈమె మంచిదన్న పని ఆలోచించకుండా చేయి. ఇక ఈమె నిషేధిస్తే అది ఎంతటిదైనా, అవశ్యమైనట్టిదయినా చేయ సాహసించకు. ఇన్ని మాటలెందుకు? ఆమె ఏం చెపితే అది జరుగుతుంది. ఆమె వద్దంటే వచ్చి ఎంతవాడను ఏమైనానో చూశావు కదా? ఇవి కుటుంబవిషయాలు. ఆఖరు మాట. తప్పక ఆచరించవలసిన మాట చెపుతున్నాను. ఈ విషయం కలలో కూడా మరువవద్దు. అది రామకార్యం. నా అనంతరం ఈ కపిలోకానికి నీవే రాజువు చిరకాలం కష్టాలతో గడిపిన నీవు భోగలాలసుడవై మరచిపోతావేమో. నా భార్యాపుత్రుల అలక్ష్యంచేసినా నీకు వాళ్ళవల్ల అపకారం ఏమీ జరగదు. ఆయన కార్యం ఆచరించక అశ్రద్ధచేశావో, ఆయన ఆగ్రహం నిన్ను అంతంచేస్తుంది. నీ అదృష్టంవల్ల అంతటివాడు చెలిమి కోరి నీ చెంతకు వచ్చాడు. చేయవలసిన పనులు చేతులతోకాక శిరంతో చేయాలి. ఒకవేళ శాంతమూర్తి రాముడు నిన్ను వదలినా, లక్ష్మణుడు మాత్రం నిన్నూ, కిష్కింధానగరాన్ని, నాశనంచేసి కాని శాంతించడు. ఈ విషయంలో జాగ్రత్తగా వుండు.

## వాలి అంగదునికి నీతి తెల్పుట

సోదరా! నేను మరణిస్తే ఈ అపూర్వమైన కాంచనమాల శక్తి హీనమైపోతుంది. ఇది దివ్యము. దీని ప్రభావం ఎన్నోసారులు నీవు చూచావు. నేను నీతో తలపడినప్పుడల్లా దీని ప్రభావంతో నిన్ను జయించేవాణ్ణని నీకు తెలుసు. ఇప్పుడే దీనిని పరిగ్రహించి ధరించు. దీని అనంత శక్తి సహాయంగా శత్రులోకాన్ని జయించు. నేను తీసి నీకీయలేను"

అనగానే రవిపుత్రుడు గ్రహగ్రస్త సోముడివలె వెల్లవోయిన వదనంతో ఆ కాంచనమాలను అన్న ఆజ్ఞానుసారంగా గ్రహించి ధరించాడు.

అనంతరం వాలి అంగదుణ్ణి గుండెకు హత్తుకుని, "నాయనా! అంగదా! నాకై విచారపడకు. దేశకాలాలు తెలిసి ప్రవర్తించు. ప్రియాప్రియాలైన సంగతులు కానీ, సుఖదుఃఖాలు కానీ క్షమతో సహించు. నీ ప్రవర్తనతో నీ పినతండ్రికి ప్రీతిపాత్రుడవు కమ్ము. నేను తండ్రిని. సుగ్రీవుడు పినతండ్రి. ఇకముందు రాజు. సర్వాధికారి. నాపట్ల నీవు చూపిన చనువే అతనిపట్ల చూపిస్తే నీకు అగౌరవంగం కలిగి అశాంతి వస్తుంది. కనుక అంతరం తెలుసుకుని, హద్దులు నిర్ణయించుకుని, అనుకూల సమయంలో అనుసరిస్తూ, ప్రతికూల సమయంలో వుదాసీనంగా వుంటూ అతని ఆదరణ సంపాదించుకో. అతని అహితులతో, అతని శాత్రవ మిత్రులతో నీతిమాలిన మైత్రి చేయవద్దు. నీకు అతడు నియమించిన పనులన్నీ నేర్పు, ఓర్పుతో నెరవేర్చు. అతనితో అతిస్నేహం కానీ, అస్నేహంకానీ వద్దు ఈ రెండూ కీడు తెచ్చేవే అందుకని మధ్యేమార్గం నీకు మంచిది. నాయనా! చెప్పింది కొంచెమే. బుద్ధిబలంతో తెలియ కలిగిందంతా తెలిసి జీవించి, వంశవర్ధనవై నా కీర్తి నిల్పు. అన్ని విధాలా నీ తల్లి నిన్ను రక్షిస్తుంది. ఆమె వున్నంతకాలం నీకేమీ లోటు రాదు. ఎప్పుడూ దైవశక్తి దాటరానిదని విశ్వసించి జీవయాత్ర సాగించు. ఆయుష్మంతుడవై కపి గగన సీమలో ధృవతారగా వెలుగొందు" అని దీవించాడు.

## వాలి మరణించుట

అదే, మహాబలశాలియైన వాలి ఆఖరుమాట. అంతకంతకు అస్త్ర పీడనం అధికంకాగా, గ్రుడ్లు గిరగిర త్రిప్పుతూ, పెదవులు దాటి శీకర రదములు పైకిరాగా, ఆ మహాకాయుని, ఆ అవక్రవిక్రముని, ఆ నిరంతర నీలగళ చరణసేవా నిష్ఠితుని ప్రాణవాయువులు అనంతపవనంలో కలిసి అంతర్ధానమైపోయినై. హాహాకారాలు మిన్నుముట్టినై. నిండువరలో

వెలుగుతున్న దీపం మలిగినట్లైంది. వికసితపుష్పాలతో నేత్రోత్సవంగా ప్రకాశిస్తున్న పుద్యానం ప్రళయమారుత హతికి పూలురాలంగా గోచరించే స్థితి గోచరించింది. దొంగలుపడి దోచిన కొంపలాగా కిష్కింధ శూన్యంగా కనుపించింది. ఆతని పాదసంచారంలో అనవరతం శోభించే పర్వత వనాలు పాడుపడినై నక్షత్రరహితమై కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటి క్రమ్మినట్లయింది. ఎంతలో ఎంతమార్పు! అంతకుపూర్వం వున్నదంతా వుంది. లేంది ఒక్కడు "ఏకచంద్ర ప్రకాశేన నక్షత్రైః కిం ప్రయోజనమ్" అన్నట్లు ఆ ప్రదేశం ఆతని మరణంతో శోభాహీనమైంది. "ఎవని వేగంతో భూరుహాలు పెళ్ళగిల్లి వెంటవస్తాయో, ఎవడు గోలభగంధర్వకుంజరునితో పదిహేను సంవత్సరాలు దివారాత్రాలు ఎడతెగక పోరి జయించాడో, ఎవడు అరివీరుని పదహారు వర్షాలు ప్రధనభూమిలో నిల్పి నేలపాలు చేశాడో, ఎవడు మాకు దిగులు లేకుండా కన్నతండ్రివలె కావలసినవన్నీ కూర్చి కన్నుల్లో పెట్టుకుని కాపాడాడో, ఆ విక్రమసింహం ఇంక మా కేది? అంతటివాణ్ణి వానరజాతిలో మళ్ళీ చూస్తామా?" అంటూ, పంచానన సంచారయోగ్యమైన భయాటవిలో గోపతి మరణించగా గోవులు దుఃఖించినట్లు కపులు కంటికి కడివెడు నీళ్ళుగా ఏడ్చారు. ఆ రోదనధ్వనితో కొండలునిండి ప్రతిధ్వనిస్తున్నై. మృతుడైన పతిముఖం చూచి, వితతవ్యసనాబ్ధిలో మునిగి విలపిస్తూ, పతిదేహాన్ని గ్రుచ్చి కౌగిలించుకుని హతవృక్షంతో వ్రాలే ఆశ్రితలతలాగా తార ఆతని వక్షంపై పడింది.

## వాలి మరణానికి తార ఏడ్పుట

ఆ విధంగా దిక్కుమాలిన తార పతివక్షస్థలంపై వ్రాలి, చేతితో చెంపలు విమురుతూ, చెక్కిలిచెక్కిలి చేరుస్తూ, "హా ఆత్మేశ్వరా! నా మాటవినక ఎంతపాటు తెచ్చుకున్నావు? సుఖశయ్యవదలి ఈ కటికి రాల మేను చేర్ప కాంక్షించావా? నీవు నరసుడవు. దక్షిణనాయకుడవు. కాబట్టే నేను చూస్తుండగానే భూకాంతను గాఢంగా ఆశ్లేషిస్తున్నావు. నాకంటే ఆమె అంత ప్రియురాలా నీకు? దేవేరినైన నాతోకూడ

మాటలాడనంతటి పరుసకొల్పిందా? ఆర్యా! ఇంతవరకూ నీకు అను కూలంగా వున్న విధి ఇప్పుడు సుగ్రీవవశమైంది. వర్తమాన జగత్తులో శూరుదెవరంటే సూర్యసుతుడనే చెప్పాలి. ఎందుకంటే ఇంతకుపూర్వం నిన్ను యుద్ధంలో తాకి ఏ వీరుడు బ్రతికాడు? నువ్వు ప్రభువై యుండీ, నన్నూ, ఓడ్డనూ, వానరసమూహాన్ని కన్నెత్తైనా చూడవేం? యుద్ధ ప్రియుడవూ, ఆజేయుడవూ, వీరశయనం ఎలావుంటుందో తెలుసు కోవాలనే కోరిక కలిగిందా? నన్ను దిక్కులేనిదాన్ని చేసి నీ వొక్కడవే పోవటం ధర్మమని తలంచావా? శూరులైన తండ్రులు శూరులైన వారికి తమ కన్యలను సతులుగా ఇవ్వరాదు. అందుకు నా చరిత్రే ఆధారం. మహావీరుడైన నా తండ్రి జగదేకశూరుడవని నీకు సమర్పిస్తే నా గతి ఏమైంది? నింద్యమైన వైధవ్యంతో జీవితాంతం గడపవలసి వచ్చింది. మానం శూన్యమైంది. పరమమైన గతి రిక్తమైంది. అంతు లేని దుఃఖాబ్ధిలో అట్టడుగువానమైంది. నా గుండె రాయి ఏమో. పరమసుఖ ప్రసాది భర్త మరణిస్తే, చూచికూడ ఖండఖండాలై, శరధా విభిన్నం కాదేమిటి; నా నెయ్యం, నా దైవం, నా పతి, నా హితుడు, నా నిధి నన్ను విడిచిపోయాడు. బిడ్డలు ఎందరున్నా, ధనధాన్య సంపదలు ఎంతవున్నా, మగడులేని స్త్రీని జనులు విధవంటూ వెలితిగా పిలుస్తారు కదా? అరుణ్రపురుగు దాలున, భానుచిరమైన పాన్పుపై పవళించినట్లు ఈ రుధిరమండలంలో పండుమని నీవి నిద్రించావా? నెత్తురుకారుతున్న తనువుపై వట్టంగా ధూళి గ్రమ్మి నీ శరీరకాంతి తొలగిస్తూంది. ఆప్యా యంగా ఆలింగనం చేసుకుందామంటే రొమ్ములో నాటిన శరం కారణంగా ఆ యోగంకూడా దూరమైంది. అయ్యయ్యో! తనువువీడిన నిన్ను కను గొనటం ఒక్కటే మిగిలింది" అంటూ మూర్ఛిల్లింది.

దయనీయమైన తార దుఃస్థితికి ప్రకృతి నిశ్చేష్టితమైంది. పౌరులు ప్రాణం వుండీ లేనివారైనారు. గుహలో బంధితయైన నాగకన్య వలె రోదనతో తార అవశురాలు కాగానే అంగదుడు "హా తండ్రీ హా తల్లీ" అంటూ బావురుమని ఏడ్చి తండ్రిపై బడ్డాడు. రామశరదీర్ణ వాలి వక్షస్థలం నుంచి నీలుడు బాణాన్ని పైకి తీశాడు. ఆస్తగిరి నాయకుడు గమనాన్ని

అడ్డగించగా దివకపక్షి వీకి వెనుకకు మరలి వస్తున్న తేజంలాగా అరుణ కాంతులతో ఆ బాణం ప్రకాశించింది. ఆ మహాకాయుని గుండెనుండి బాణం తీయగానే కట్ట త్రెంచుకున్న ప్రవాహం వలె రక్తం వెల్లువలై పార జొచ్చింది. ధాతురంజితమైన ధరణీధరంనుండి పారుతున్న తామ్రగైరిక సంపృక్తధార వలె వుంది ఆ దృశ్యం. శరనిపాతంతో ధరణి కూలిన పతిశరీరంపై క్రమ్మిన ధూళిని తార దుఃఖాశ్రువులతో సర్వాంగాలను సమ్మార్జనం చేసింది. కంపిత గాత్రంతో కొడుకును చేరదీసుకుని, "బిడ్డా! చూచావా నీ తండ్రిని, పాపకర్మచే ప్రాప్తమైన వైరం నేడితో మేనుతో నేలకూలి వదిలిపోయాడు. ఇది మనకు కడసారి చూపు ఇప్పుడే తండ్రికి పాదాభివందన చేయి మనమందరం బ్రతికి వున్నాం. సూర్య సన్నిభదేహుడు ఒక్కడే స్వర్గప్రయాణం చేస్తున్నాడు" అని అతి దీనంగా ఆక్రోశించింది. అంగదుడు మాతృదేవి మాటలు విని "తండ్రీ! కపిలోక సార్వభౌమా! నీ అనుంగుబిడ్డను అంగదుడు అశ్రుతర్పణంతో అభివందనం చేస్తున్నాడు. ఆదరంతో గ్రహించు" మంటూ రెండుపాదాలను స్పృశించి కళ్ళకద్దుకున్నాడు. తార గుండెలు కొట్టుకుంటూ "నాథా! ప్రేమతో నీ బిడ్డ అంగదుడు నమస్కరిస్తున్నాడు. కన్నులు తెరచి కాంచవేల? "దీర్ఘాయురస్తు" అని దీవించవేల? సింహంచే పసివి కోల్పోయి విడిచిపోలేక విలపిస్తున్న సవత్సధేనువు వలె వున్న నన్నాదరించవేల? చటులభయద సంగ్రామ యజ్ఞం చేసి జానకీపతి సాయకజలంలో అవభృథస్నానం ఆచరించటం నీకు అర్హమైనా పత్నినైన నన్ను పరిత్యజించి?

ప్రాణపతీ! సమరసమయంలో మేఘంలోని మెరుపువలె గళసీమ నుండి ప్రకాశించే నీ కాంచనమాల ఏది? ఈనాడు ధరించి రాలేదా? అస్తం గతుడయిన భానుని ప్రశస్తమహా శోభ రత్న సానువు విడనట్లుగా అస్తమితుడయిన నిన్ను రాజ్యశ్రీ ఆ విధంగానే విడువలేదు. అయ్యో! హిత మెంత చెప్పినా విననైతివి. అడ్డగించినా ఆగవైతివి. చివరకు భార్యా పుత్రులం దిక్కులేని వారి చేసి దివ్యలోకానికి పయనించావా? నీతోనే మా సౌభాగ్య లక్ష్మిని కూడా కొనిపోయావా? నాకిది జీవన్మరణ సమస్య. నీకు

ప్రతిబింబంగా పుట్టిన ఈ బాలుని వృద్ధికోసం జీవించనా? సహగమనం చేసి సతీ ధర్మంపాలించనా? ఈ విపత్సమయంలో ఎవరు నాకు కర్తవ్య బోధ చేస్తారు? అంతటి ప్రీతిపాత్రులెవరు?" అంటూ పతి మృత దేహంపై వ్రాలింది.

## సుగ్రీవుడు వాలి మరణానికి శోకించుట

ఘోరాతిఘోరంగా ఆయంగన అంగదునితో గూడి అంగదతో అంగలార్చి నిర్జీవప్రతిమవలె పతి రొమ్ముపై పడియుండగా, ఏడ్పుతో కన్నులు ఎరుపెక్క అశ్రుజలం అవరోధంకాగా, తలిదండ్రులపైబడి అంగదుడు పాలభంజిక కాగా, విశాల వక్షంతో, దృఢదీర్ఘదేహంతో, చంద్రబింబంలోని కళంకం వలె రొమ్మున పెనుగాయం రక్తం చిందగా నేలపై పడివున్న అన్న దైన్యస్థితి చూచి సుగ్రీవుడు ఆపుకోలేని దుఃఖ భారంతో "అన్నా!" అని కొండలదర పెనుకేక పెట్టి నేలపడి దొర్లి, లేచి "ఇంతపాపం తనవల్లనే కదా దాపురించిందని తల్లడిల్లుతూ, ఏమి పల్క టానికి నోరురాక, మూగవలె, బధిరుడవలె, అంధుడువలెనై ఇంతటి అకృత్యానికి పాల్పడిన తన్ను తాను నిందించుకుంటూ, సుగ్రీవుడు భాసుర సర్వ సన్నిభ బాణ బాణాసన పాణి రాముణ్ణి ఆశ్రితులతో చేరవచ్చి అంజలి బంధుడై, గద్గదగళుడై; వీతక్రోధుడై, పూరిత శోకుడై, "రామచంద్రా! ఆడినమాట తప్పని అమృతమూర్తీ! నీ కటాక్షలేశంవల్ల నా కష్టాలు పోయి రాజ్యసుఖ శ్రీలు లభించినై. బహుకాల వియోగానంతరం పత్నీ సమాగమం కూడ ప్రాప్తించింది. నన్ననుసరించి అల్లాడుతున్న అనుచరులకూ, ఆశ్రితులకూ అంతులేని ఆనందం చేకూరింది. నా అన్న చావుతో నాలో ప్రతీకార దాహం శమించింది. పశ్చాత్తాప వహ్ని ప్రజ్వరిల్లి ప్రత్యంగం దహిస్తూంది. నాకు జీవితంపై రోత జనించింది. నన్ను క్షమించు రామా! నేనుకూడ అన్నమార్గాన్ని అనుసరిస్తాను. బ్రదికినంతకాలం వైరం పెంచకుని అన్న అకాల మరణం పొందాడు. అతనిచావుకు నేనే కారణం. ఆగ్రహంలో; అవమానంలో అతని చావు కోరానే కాని, చస్తే ఏమవుతుందో వూహించలేకపోయాను.

ఆ తల్లి బిడ్డల ఆవేదన నేను చూడలేను. ఇంతటి లోకోత్తర విక్రమ సంపత్తి కలవాణ్ణి అన్నగా ఇక నేను సంపాదించుకోలేను. అతడు నా పట్ల చేయరాని పని చేసినమాట సత్యమైనా చంపించటం నాకు తగని పని. ఎన్నిసార్లు అన్న ఒంటరిగా చిక్కినా తన్ని తరిమేవాడు కాని చంపేవాడు కాదు. అదే అతని సంకల్పమైతే నా కథ గాథగా ఏనాడో మారిపోయేది. అంత వైరంలో కూడ నా చావు కోరని అన్నను నేను ఛల వంచన చంపించాను. నాకీ పాపం జన్మజన్మలకు పోదు. మా వదిన శోకం, అంగదుని ఆక్రందనం, పౌరుల దుఃఖం, అన్న మరణం అన్నీ కలిపి నన్ను విరక్తుణ్ణి చేస్తున్నై. పూర్వం రోషంతో, క్రోధంతో, రూక్ష విప్రదర్శంతో అగ్రజుని స్మృతి నాకు అభీష్టంగా వుండేది. కాని ఆదే ఇప్పుడు దుస్సహ తాపానికి దోహద కారి అయింది. అన్నను పోగొట్టుకున్న దున్నవంటి నాకు కిష్కింధా రాజ్యమే కాదు, స్వర్గధామం చేకూరినా సంతోషం కలగదు. పూర్వంలాగే ఋశ్యమూకం చేరి సచివాప్త వర్గంతో స్వవృత్తితో జీవిస్తాను. నా చావు సంగతి ఎత్తని అన్నను చావు సంగతితోనే సమాప్తం చేశాను. అన్న అంటే ఏక గర్భజాలం కావటం చేత వచ్చిన వావి మాత్రం కాక, ఇంతవరకు అగస్త్యభ్రాతగా వున్న నాకు వాలి తమ్ముడుగా వచ్చిన యశస్సే అధికం. అట్టి శూరవతంసుణ్ణి మాడు మోపి నిర్దాక్షిణ్యంగా నేలపాలు గావించాను. రాజ్యలాభం, అగ్రజుని వధ, ఈ రెండింటిలో నాకిప్పుడు అన్న వధ అనుచితమనీ, అఘసంపాదనమనీ, ఆర్ష ధర్మదూరమనీ, ఆత్మ ఘోషిస్తూంది రామా! ఘోరంగా గోల పెడుతూంది. కామపురస్కృతుడనై కాని కార్యం చేశాను. సంగరంలో చంపటానికి ఇష్టపడని వీరుడు అన్న. పెంపూ, తెంపూ, పేర్మి, ధీరం, దయాహృదయం గలవాడు కాబట్టే నా చావు కోరలేదు. దుర్బుద్ధిని ఆశకుణ్ణి కావటంచేత అన్న బ్రతికితే నాకానందం లేదని భావించాను. అందుకే నీతిని పాటించక దుర్మతినై, బాలకుడువలె వ్యతిక్రమం ఓర్చి అన్నను చంపించాను. ఈనాటి ప్రథమ ప్రథనరంగంలో ముష్టిఘాతాలతో నన్ను బాదినపుడు నేలరాలి ఏల ఏల తన్నుకుంటూంటే ఆ వీరుడు నన్ను చూచి "ఇకముందు ఇటువంటి బాలచేష్టలు చేయవద్ద"ని ఊరడింపుతో మందలిస్తూ వుసురుకొనక వదలి వెళ్ళాడు. నేనో పట్టు పట్టి ప్రాణం తీయించాను. రామా! గ్రహించావా

కదా మా సోదరుల ఔదార్యం? మేం జన్మచేత వానరులమయినా, భ్రాతృభావం, ఆర్యభావం, అధికధర్మం ఈ అనఘుని చేత రక్షితాలయినవి. కామక్రోధాదులూ, కపిగుణం నాయందు దృష్టమైంది.

అతులము, అచింతనీయము, పరివర్జనీయము, అనపేక్షణీయము, అనీప్సనీయము అయిన ఘోరపాపాన్ని విశ్వరూపుణ్ణి చంపి వృత్రవైరి ఒడిగట్టుకున్నట్లు, నేనన్నను నిర్జించి ఆర్జించుకున్నాను. ఆయన స్వరాట్టు కావటంచేత ఆ పాపం, భూమీ, జలం, ద్రుమాలు, వనితలు పంచుకున్నారు. క్రోతిపాపాన్ని పంచుకుంటానని ఎవరు కోరుతారు? పాపశీలుణ్ణి, నీచుణ్ణి, పరమ గర్హితుణ్ణి, లోకాపకారకార్యకారకుణ్ణి. వానరీఋక్ష పల్లానికిపాతినట్లు ఆ కిల్బిషం నాలోనే చేరింది. ఘోరమైన ఆర్తి నా గొంతు నులుముతూంది. అధర్మసంయుతం, అకృత్యం, వంశనాశనకరం అయిన పని చేశాను ఈ నీచుడు పౌరసత్కారానికి యౌవరాజ్యార్హతకూ తగడు. ఇక రాజ్య పరిగ్రహణానికి ఎలా పనికివస్తాడు? భ్రాతృవధవాలంగా, తాపభరంశిరస్సుగా, పశ్చాత్తాపందంతాలుగా ఈ కల్మషగజం ప్రవృద్ధమై ఏటిగట్టును కూల్చినట్లు నన్ను కూల్చుతున్నది. బంగారం అగ్నిలో క్రాగి వివర్ణమై మనటు పోగొట్టుకున్నట్లు, నాలో వున్న సాధువృత్తం ఈ పాపసంసర్గానికిలోస్తూ వివర్తమవుతూంది. నేను చేసిన ఈ పాప కార్యానికి భయపడి వానరులంతా తల్లిబిడ్డల దుఃఖం చూస్తూ ఓదార్పకుండా వూరుకున్నారు. బిడ్డలు అందరికీ కలుగుతారు. అంగదునివంటి సుజనుడు, సుమతి, వశ్యుడు పుత్రకుడుగా ఎందరికున్నారు? జాతివైరంవున్నా సోదరుని చంపుకున్న నావంటి నీచులైన తమ్ములు ఎంతమంది కున్నారు? అంగదుడు బ్రతికితే ఆతని తల్లి బ్రతుకుతుంది. ఆతని పరిపాలన చేస్తుంది. తనయుడు పోతే తానూ పోతుంది అన్ననూ, బిడ్డనూ అనుగమించే నిమిత్తం దీప్తాగ్నుల్లో దేహత్యాగం చేస్తాను వీరే వానరవీరులంతా వున్నారు. ఆంజనేయుని ఆజ్ఞానువర్తులై సీత వార్త నీకు తెలుపుతారు. నేను చస్తే నీ పని నిల్వదు నాకు తెలుసు. నీ పని నీవు చేసుకోగల వలంతివి. ఏమని వంశనాశకుడనైన నేను జీవిస్తాను? నా పాపపరిహారం కోసం నీ నామస్మరణ చేస్తూ మరణిస్తాను" అని పాదాక్రాంతుడైనాడు.

# శ్రీరాముడు తారను ఓదార్చపోవుట

పాదాంపై పడుతూ సుగ్రీవుడు పక్కన పక్కలా తన బాణంతో పరిశుద్ధుడై దేహత్యాగం చేసిన వాలి మృతశరీరం బాలుడైన అంగదుని బెంబేలతనం. రాజనీతి విశారద సర్వశాస్త్రమర్మజ్ఞ సాధ్వీలోకపూజనీయయైన తార అపస్మారకస్థితి మేరుగంభీరుడైన రాముడు చూచి కన్నుల్లో బాష్పపూరం క్రమ్ముతుండగా ముహూర్తకాలం అందరివలె ఆర్తుడైనాడు. క్షమను మించిన క్షమకలవాడూ త్రిజగత్పరిరక్షణకర్తా సత్యవ్రతుడూ సామరాగుడూ సాధుశీలుడూ అయిన రాముడు మాటిమాటికీ మాటాడలేక కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతూ చూచేదాన్ని వాలివట్టపుదేవేరిని అనాధను ఆదరించే నిమిత్తం అనుజునితో అమాత్యులూ అనుచరులూ అనుగమించగా సమీపించాడు. వారిలో ముఖ్యులు యత్నంతో సతీపతులను వేరుచేశారు. భర్తసన్నిధి వదలినతార ఆలంబనంనుంచి జారిన లతవలె అవనిపడి మూర్ఛిల్లి అతికష్టంతో తెలివి తెచ్చుకుని అటు ఇటు పరికిస్తూ పద్మపత్రాయతలోచనుడూ అఖిలమహాచాపశరపాణీ మార్తాండోపమసహజ ప్రభాసముజ్జ్వలగాత్రుడూ సుందరవిగ్రహుడూ జటావల్కలధారీ సాధువర్తనుడూ రాజలక్షణ లక్షితుడూ బుధమనోరంజనుడూ పురుషోత్తముడూ అదృష్టపూర్వుడూ అయిన మూర్తిని చూచి ఆ శీలవతి "ఇతడా రామభద్రు"డని నివ్వెరపోయింది. ఇంద్రసమానుడూ ఉదారవరుడూ పరమపూజ్యుడూ మహాత్ముడూ అయిన రామభద్రుణ్ణి వ్యసనాతిపీడిత పరివిహ్వలమతియైన ఆమె ఆతని లక్షించి చూసింది ఆ చూపులో కోటి జలధులు ఘూర్ణిల్లినై. దశకోటి కులాచలాలు కూలిపోయినై. శతకోటి అగ్నిపర్వతాలు బ్రద్దలై సెగలు క్రక్కినై "ఓయీ క్షత్రవంశజా! రామనామధారీ! నీ భార్యను పొందగోరి వంచనతో పొంచి అనపకారియైన నా ఆత్మేశుని వధించావా? పురుషుడవే ఇంత వ్యామోహపరుడవైతే భర్త బాసిన సతి గతి ఏమవుతుందని భావించావు? ఈచేత నీ భార్య భరించగలదా? ప్రశంసించగలదా? మారుమూల మహారణ్యమధ్యంలో ఆకులలములు తింటూ పడియల నీళ్ళు త్రాగుతూ బ్రతికే మా జంటను విచ్ఛిన్నం చేయటానికి వెదక్కుంటూ ఇంత దూరం వచ్చావా? వచ్చి చేసిన ఘనకార్యం ఇదేనా? నా పాతివ్రత్యం

చులకన చేశావా? నేనాగ్రహిస్తే నీచేత నున్న కోదండం నిల్వగలదా? నీవెందుకు ఈ పనికిమాలిన పనిచేశావో ముందు తెలుసుకుని ఆ తర్వాత జరగవలసిన సంగతి ఆలోచిస్తా" నన్న భావంతో ఆ చూపు పుంజుకుని రామబాణం వాలిని తాకినట్లుపోయి రాముని గుండెను తాకింది.

## రామునిచూచి తన్ను చంపమని తార ప్రలాపించుట

ఆ చూపుకు రాముని ధైర్యకవచం విచ్ఛిన్నమైంది. "ఈ సాధ్వి ఆగ్రహించదు కదా" అన్న సంశయం కలిగి క్షణంలో మాయమైంది. "ఈమెను శాంతింపజేయటం ఎలా"గని ఆలోచన కలిగింది. ఈ లోపల పగగొన్న త్రాచువలె బుసలు కొడుతూ, లేని శక్తి పూరించుకుంటూ తార రాముని చేరవచ్చింది. నవ్వుతున్న రాముడు ఆగి తరంగశూన్యమైన జలధివంటి చూపుతో ఆమెను చూచాడు. ఆమె కించిన్మితశిరస్కయై "రామా! అప్రమేయుడవు, జితేంద్రియుడవు, విశ్రుతైకధార్మికుడవు, అక్షయ్యకీర్తివి. విచక్షణుడవు. అవితరదుర్లభమైన బాణాసనబాణపాణివి. మహాసత్త్వుడవు. ఉత్తమ సంహననోపేతుడవు. మర్త్య విగ్రహాభ్యుదయం వదలి దేవవిగ్రహాభ్యుదయంతో వెలిగేవాడవు. పతిని చంపిన శరంతో సతినికూడ చంపి పుణ్యం కట్టుకో. భార్యలేని భర్తకు సుఖం లేదని నీకు తెలిసినదే కదా? నాకోసం పతి ఎదురుతెన్నులు చూస్తుంటాడు. నాకంలో అప్సరసలు వేయివిధాల అలరించినా నాపై గల మక్కువతో సుఖశయనం చేయలేడు. సతీపతుల కలిసిన పుణ్యం కోటిగుణితం. ఎన్ని సుఖాలు లభిస్తున్నా భార్య ఇచ్చే సుఖం ప్రాజ్ఞుడైన పురుషునికి లభించదు. దూరస్థుడైన పతి నన్ను స్మరిస్తూ అశాంతితో అలమటిస్తాడు. ఆ అశాంతి ఎట్టిదో అనుభవపూర్వకంగా నీకు ఇదివరకే తెలుసు. ప్రాయంలో వున్న దంపతుల వియోగం ఇహలోకంలో ఎంత దుస్సహమో నావంటిదైన సీతకు బాగా తెలుస్తుంది. ఈ దేహంతో కలియటానికి వీలులేకుండా నా భర్తకు తేజోరూపం ప్రసాదించావు. నాకూ ఆ విధమైన రూపం అనుగ్రహించు. రెండుచేతులెత్తి మ్రొక్కుతా. స్త్రీ వధ పాతకమని చింతించవద్దు. భార్యభర్తకు ఆత్మ. ఇది వేదవాక్కు. దయాబుద్ధి నన్ను వధించి

ఆత్మీయునిలో ఆత్మగా ప్రతిష్ఠించు దీనిచే పుణ్యమేగాని, పాపం రాదు. దానాలన్నిటిలో కన్యాదానం శ్రేష్ఠమైంది నీవు తండ్రివిగా నాకు వైధవ్యం లేకుండా భర్తకు మళ్ళీ దానం చేయి సంహరించిన పాపం విన్నించదు. రామప్రభూ శరణాగత రక్షణం నీకు వెన్నతో కౌసల్యపెట్టింది. శరణన్న సుగ్రీవుణ్ణి చేపట్టి రాజును చేశావు. మరి శరణన్న నన్ను నా శిరస్సుతో చేస్తూ దిక్కులేనిదాన్ని. అతిదీనను. భర్తృహీనను. నాకిక వున్న దిక్కు ఒక్కటే. అది వాలిని వధించిన బాణం. దానితో నా సర్వాశలు పండేట్లు చేయి" అని వర్మగర్భభాషణాలతో నిరుత్తరుణ్ణి చేసింది.

## శ్రీరాముడు తారను ఆశ్వాసించుట

ఆమె పల్కిన పల్కులన్నీ శాంతంగా, పాంతంగా రాముడు విన్నారు. రాకానుధాకర జ్యోత్స్న శీతలములూ, మధుర మంజులములూ అయినభాషణాలతో, "అమ్మా! ఎందుకేడుస్తావు? వీరపుత్రివి, వీరపత్నివి, వీరమాతవు ఏ స్త్రీకూడా చేయదు భర్తగా కోరదే. నీవుదే కావాలని ఎందుకు కోరుతుంటుంది? ఆ కోర్కెలో వైధవ్యం లేదా? బహిరంగా లభ్యమైన బాహ్యసుఖాలు నీరుదైనవతి ఇస్తాడన్నభావం బలంగా వుండటం చేత సూక్ష్మాతిసూక్ష్మంగా వున్న ఆ భావాన్ని మనస్సు స్పృశించదు. ఆ కారణంచేత మనకు స్పష్టంగా తెలియదు. విషం చంపుతుంది. అదే దాని గుణం అని అంతా అనుకుంటారు. ఆ విషమే రోగికి ఒకానొక స్థితిలో వాడితే అమృతంగా పనిచేస్తుంది. ఆ రహస్యం మర్మం ధర్మం తెలిసిన మహర్షులు గ్రహించారు ఆ రహస్యం లోకంలో చనివారు అలాగే ఇది కూడ. సృష్టిలో ఏ పదార్థంకానీ, ఏ గుణంకానీ, ఏ భావం కానీ కేవలం ఏకాంతత్ప్రయోజనంగా లేదు రుచిగల పదార్థం అధికంగా తింటారు. తినే సమయంలో దేహాపకారం చేస్తుందని అనుకుంటున్నారా? వెర్రితల్లీ! నేను నీకు వేదాంతం బోధించటంలేదు. నిన్ను గూర్చి మిత్రుడూ, నీ పతి చెప్పినమాటల్లోని సత్యం తెలుసుకుని పలుకుతున్నాను. నిన్ను చులకనభావంతో చూడటంలేదు. వీరపురుషుని మరణంతో వైధవ్యం ఒక్కసారే వస్తుంది. వందయైనట్టి పతితో బ్రతికినంతకాలం బాహ్యంగా

కాక అంతర్యంలో ఆమె అనుభవిస్తూనే వుంటుంది. క్షత్రియులకూ, అందులో ప్రభువులకూ వీరమరణం నిత్యం సన్నిహితంగానే వుంటుంది. ఈ దృశ్యప్రపంచం ధాతచే సృష్టింపబడింది. సంయోగ వియోగమే దీనికి ధర్మం. సంయోగవియోగ పరివర్తనమే సుఖదుఃఖాలుగా లోకం భావిస్తోంది. సృష్టివిరుద్ధంగా ఏర్పడిన జీవకోటి తద్భిన్నంగా నడవటం సాధ్యమా? అలా అనుకుంటే అది ఎంత అజ్ఞానం? నీవు దుఃఖంలో కొన్నిమాటలు అన్నావు. నేను వాటికి నా మనసులో చోటీయలేదు. అమ్మా! అనుగ్రహపడి ఒక్కమాట నిన్నడుగుతాను. బదులు చెప్పు. నన్ను వధించి నీ భర్తను చేరుమన్నావు కదా? ఆ పని నీవే చేయవచ్చుగా. సహగమనం భారతనారులకు వుండనే వున్నది కదా? ఆ మాటలో రెండర్థాలున్నాయి. నీ పతిని నేను అధర్మంగా చంపానని, సహగమనం చేస్తే బిడ్డగతి ఏమవుతుందని. బిడ్డపై మమకారం విడువలేక, సతీధర్మం త్రోసివేయలేక కర్తవ్యతా మూఢవై నా చేత బలాత్కారమరణం కోరావు. నీ కోరిక ఆగ్రహావేశాలతో కూడినదే కాని అధర్మం కాదు. అందుకు నిన్ను శిక్షించవలసిన అవసరంలేదు. జీవపుత్రలెందరో సహగమనం చేయలేదు. అంతతో వారి శీలం అపేక్షణీయం కాలేదు. నన్ను శరణుజొచ్చామన్నావు. శరణాగతుడు రక్షణకోరుతాడు కాని శిక్షణకోరడు కదా? నేను ధర్మదూరుడనై నీ భర్తను వధించలేదు. ధర్మాధర్మ విచారణ నీపతి నాతో చేశాడు. సమాధానం విని సంతృప్తిపడ్డాడు. ఇప్పుడు ఇంకా చర్వితచర్వణం ఎందుకు? నీ మనోగతం నాకు తెలుసు. న్యాయంగా నీ పతి అనంతరం రాజ్యానికి రాతగినవాడు నీ బిడ్డ అంగదుడు. అతడు బాలుడు. అదికాక వాలి స్వయంగా సుగ్రీవుడికే రాజ్యం అప్పగించాడు. అయినా రాముని మిత్రులు అన్యాయంగానీ, అధర్మంగానీ చేయరు. రాజుగా రవిపుత్రుడు అభిషేకం పొందే సమయంలో యువరాజుగా అంగదుడు అభిషేకింపబడతాడు. ఆ మహోత్సవం మాతృదేవతగా తిలకించి ఆనందించు" అని ఆమెను ఓదార్చి, సుగ్రీవాంగదుల పూరడించి, లక్ష్మణుడితో పాటు శోకసంతప్తులైన వానరులను చూచి, "కపిపుంగవులారా! శోకం మానండి. చచ్చినవారికోసం బ్రదికినవారు ఏడుస్తుంటే నిశ్రేయసం ప్రేతకు లభిస్తుందా? అనంతరకార్యాన్ని కూర్చి ఆలోచించరేం? లోకంతోపాటు

ప్రేతంకోసం వగవటం చాలు. కాలాన్ని మీరి మీరు చేయగలిగిందేమైనా ఉన్నదేమో చెప్పండి. నియతియే లోకానికి విధానం నియతి క్రియా సాధనం నియతియే భూతావళులను నియమించటానికి కారణం ఏ ఒక్కరూ దేనికీ కర్త కాదు ఏ ఒక్కరూ ఇతరులపై పనికొల్పటానికి అధికారికాదు. లోకంలో జరిగే పరిణామం అంతా స్వాభావికంగా జరిగేదే ఆ స్వభావం కాలాధీనం. కాలం ఎప్పుడూ కాలాన్ని దాటదు. దానికి అపక్షయంలేదు ఆ కాలం స్వభావంకలదై తన నిర్ణయాన్ని తానెన్నటికీ దాటదు (కాలం, స్వభావం, నియతి, ఈశ్వరపర్యాయ శబ్దాలు)

ఆ కాలానికి చుట్టాలూ, విరోధులూ లేరు. కారణం దానికి అక్కర లేదు మిత్రులు అంతకంటే లేరు. ఆత్మలకు అది వశంకాదు కాబట్టి కాల పరిభ్రమణంలోనే కార్యజాతం అని ప్రాజ్ఞుడు తెలుసుకున్నాడు అప్రాజ్ఞుడు తెలుసుకోటం మంచిది. ధర్మార్థకామాలు కాలాధీనంగా ప్రాప్తించుతవి అంతా నీవేచేస్తున్నట్లు భావించి అహంకరిస్తావు. అపై మరణిస్తావు ఏది నడిపిస్తున్నదో, ఏదిలేక నీవులేవో ఆ శుద్ధచైతన్యం అజ్ఞానబద్ధమై అణువణువూ క్రమగతిలో పరిభ్రమిస్తూంది ఇది సృష్టి లక్షణం. కావున, వాలి తానాచరించిన అధర్మానికి శిక్షపొంది, ధర్మాన్ని అనుభవించటానికి చేరవలసిన లోకం చేరుకున్నాడు తన ధార్మికబలంతో సాధించిన పుణ్యలోక సుఖాన్ని పాంచభౌతికదేహంతో పొందటం సాధ్యం కాదు. కనుక తేజశ్శరీరంతో చేరపోయాడు ఉత్తమోత్తమ పౌరుషశాలి వాలికై వృధాగా శోకించక కాలయోగ్యమైన కర్మాచరణకు పూనండి" అని అన్నాడు

## సౌమిత్రి సుగ్రీవునితో వాలికి సంస్కారం చేయించమని చెప్పుట

రామాజ్ఞానుసారం లక్ష్మణుడు రవిపుత్రుని దరిచేరి సమయార్హమైన సామోక్తులతో "మిహిరతనయా! విన్నావు కదా అన్న చెప్పిన మాటలు. ఇకనైనా శోకం వదలిపెట్టి కాగలకార్యానికి ఉపక్రమించు ఎండిన మంచి గంధపు చెక్కలు ప్రేతభూమికి చేర్పించు. అంగదుడు దీనుడై ఉన్నాడు.

అతని తేర్పు వస్త్రమాల్యాలూ, ఘృతతైల గంధాలూ, కొనిరావటం కోసం అంగదుణ్ణి పంపించు ఇప్పుడు నగరం నీ యధీనంలో వుంది. బాలిశత్వం పనికిరానిది కనుక పరిత్యజించు ధైర్యం పూనగా ఉహన కార్యం నెరవేర్చు తారుడా! శిబికను తొందరగా తీసుకునిరా. ఎంత తొందరపడితే ఇటువంటి సమయాల్లో అంతమంచిది. ప్రేతవాహుల పిలిపించు వారు బలిష్ఠులుగా వుండేటట్లు చూడు. నీవు శోకంమాని కార్యం నెరవేర్చు" మని హెచ్చరించి అగ్రజుని వద్దకు అరిగాడు లక్ష్మణ నిర్దేశితుడైన తారుడు గుహలోపలికేగి, అధికజవంతో భద్రాసనంతో కూడినదీ పక్షికర్మాంచితమైనదీ, అగకర్మభూషితమైంది. అమల చిత్రపంక్తి సమేతమైనదీ, జాలివాతాయనాన్వితమైనదీ, చిత్రహారగతమూ, విశ్వకర్మ నిర్మితమూ, విమలసిద్ధ విమాన సదృశమూ, దారుశైలమూ, కృత్రిమ కందరమూ, రక్తచందనలిప్తమూ, పుష్పబృందపద్మహార సంభిన్నమూ. ఉదయార్కవర్ణమూ అయినట్టి శిబికను కొనివచ్చారు. దానిని చూచి రాముడు తమ్మునితో "వాలిని ఇందు చేర్పించి ప్రేతకార్యం త్వరగా పూర్తిచేయించు"మన్నాడు

ఆ మాటలువిన్న అంగదుడూ, సూర్యసుతుడూ ఆక్రోశించి వేం వ్రాలారు బలవంతులైన కపుల సాయంతో వాలిని అమాత్యులు శిబిక లోనికి చేర్చారు. భూషణాలూ, వస్త్రాలు అర్పించారు. తేరుకున్న సుగ్రీవుడు లేచి "ఇద్దమనీములకు విరివిగా దానాలు ఈయండి. వనచరులారా! శ్మశాన క్షోణికి పదండి ఔర్ధ్వదైహిక క్రియలలో లోటు రానీయకండి" అని ఆజ్ఞాపించాడు. తారుడు మొదలైనవారు అంగదుని చుట్టి శిబికప్రక్క నడక సాగించారు కపిసమూహం రోదిస్తూ వెంటనంటారు వానరులంతా వాలి వెంట పోగా, వానరీసమయం ఏడుస్తుంటే ఆ నాదం వనులూ గిరులూ ప్రతిధ్వనించి అవి ఏడుస్తున్నవా అన్నట్లు భ్రాంతి కల్పిస్తున్నై ఆ శిబిక ఒక విజనంబైన ఏటినీటిఒడ్డున ఇసుకతో ఏర్పరచిన చితిపై దించి వాహకులు దుఃఖంతో ప్రక్కకు తప్పుకున్నారు తార శిబికలో దీర్ఘనిద్రా ముద్రితుడై పడియున్న పతిని చూపించి.

## శిబికలోవున్న వాలినిచూచి తార ఏడ్చుట

"హా నాథా! మహారాజా! హృదయేశా! శూరా! నన్నేల మన్నించవు? ఎందుకు నన్ను వీక్షించవు? ఇందరు నీ కోసం వందురుతుంటే వారిని పరామర్శించవేమి? విగతాసువైనా నీ మోము కళకళలాడుతూ కాంతిదేరుతున్నది కాని, కళ తొరగలేదే. అస్తమయ భానుబింబంలాగా క్రుంకినవానివలె భాసించుచున్నది కాని; మృతలక్షణం ఎక్కడా గోచరించలేదే నీవు మరణించావని ఎలా భావించేది? ఆ కాలుడే రామరూపంగా వచ్చి మా మాంగళ్య గౌరవాన్ని మట్టిపాలుచేశాడు నీకు వల్లభలై, నీ కూర్మికిపాత్రలై ఎండకన్నెరుగని ఏకాంతవాసినులు కాలి నడకన వస్తుంటే నీకు కష్టంగాలేదా? నీ మరణానికి కారకుడైనా పశ్చాత్తాపంతో పరితపిస్తున్న తమ్ముని ఆదరించవెందుకు? తారుడు లోనైన మంత్రులు వచ్చారు వారితో మంత్రాంగం చేయవెందుకు? నీ దర్శనార్థం పౌరులు వచ్చారు వారి అభిమతాలేమిటో అడగవెందుకు? వెంటనే వారినందరినీ ఉచితరీతిని సంభావించి పంపించు మనం రమ్యవనసీమల్లో హాయిగా సంచరిద్దాం లే నాథా! లే" అంటూ వక్షఃపీఠంపై వ్రాలిపోయింది.

## అంగదుడు వాలికి సంస్కార క్రియలు సల్పుట

అన్నివిధాల అనుకూలుడైన పతితో అనంతభోగాలు బహుకాలం కొరత లేకుండా ఆహ్లాదంగా అనుభవించుదామని కలలుకన్న తార స్వప్న జగత్తు వాలివధతో తెల్లవారింది ఉషోరేఖలతో పులుగుల కల కలలూ, వికసిత పుష్ప సౌరభాలూ, మందమారుత లీలా సంచార విన్యాసాలూ వెల్లివిరిసి ముగ్ధమనోహరంగా ఉండవలసిన కాలం ప్రచండ వాయు సంచారంతో, పిడుగులతో, ఉరుములతో, ధారాపాతవృష్టితో, గాఢాంధకారంతో దుర్దిన ప్రవేశం జరిగినట్లుగా తార జీవిత సౌభాగ్యశ్రీ తొలగిపోయింది అవశయై పతిదేహంపై పడియున్న తారను బలవంతంగా వేరుచేసి, శిబికం నుంచి వానరపతి కాయం చితిపైకి చేర్చారు. చిరకాలపు వాసిగా పరలోక ప్రయాణం చేస్తున్న కీశపరివృఢునకు అంగదుడు ప్రదక్షిణించి చితికి అగ్ని రగుల్కొల్పారు. అపసవ్యంగా ప్రదక్షిణించుమంటూ పెద్దలు పలుకగా,

తిరిగి ఆ విధంగా చేసి రెండవసారి హంకవహాని చితిలో ప్రతిష్ఠించారు. చితి నలుమూలల అంటుకుని ప్రజ్వరిల్లి అగ్నిదేవుడు ఊర్ధ్వలోకాభిముఖుండై ఒక్కసారి ఉవ్వెత్తుగా పైకి జ్వాలావృత ధూమరూపంతో లేచాడు రామలక్ష్మణ సుగ్రీవాంగద హనుమ జాంబవంతాదులు మౌనంగా అశ్రుతర్పణం చేస్తూ ఆ ధూమ గమనాన్ని చూస్తూ నిలబడ్డారు ఘటికా పంచక కాలం గడిచే సరికి వాలి భౌతికకాయం భస్మరూపంగా పరివర్తన పొందింది యథాశాస్త్రీయంగా కపిపతి కాయాన్ని సంస్కరించి, ఉదక క్రియ నిమిత్తం, బంధుకోటితో, వానరకోటితో సుగ్రీవాంగదులు జల పూర్ణంగా ప్రవహించే నది చేరారు. అందరు స్నానానంతరం క్రమంగా ప్లవనేశ్వరునకు ఊర్ధ్వలోక నిత్యనివాసం కాంక్షిస్తూ, పిండోదకాలు నిర్వర్తించారు బంధువుల బాధలో భాగం పంచుకున్న రాముడు హృదయ భారంతో ప్రేతకర్మ పూర్తి చేయించాడు. అనంతరం ఒక్కడే దగ్గరనున్న చెట్టునీడకు చేరి చాపంచేత పూతగా నిల్చి ప్రపంచ పరిణామం బహుముఖాలుగా పరిశీలించ సాగాడు ఆ మహావీరునకు, ఆ మహాభోగునకు ఆ ప్లవగ పట్టభద్రునకు వెలి తిలేకుండా దహనాంతరకార్యాలు సమాప్తం చేసి, అధోముఖుడై, మందగమనుడై, చేతులు వెన్నువెనుక పట్టుకుని గతచరిత్ర చర్వణం చేస్తూ, నిట్టూర్పులు విడుస్తూ రాముని సన్నిధానానికి రవిసుతుడు వచ్చాడు.

## హనుమ రవిపుత్రుని రాజ్యాభిషేకానికి రాముని ప్రార్థించి ఆజ్ఞ కోరుట

సూర్యుని మేఘం విడిచినట్లు, అంధకారలోకాన్ని పరిత్యజించినట్లు, దుర్దినం తెల్లవారినట్లు. క్రమంగా శోకాన్ని వదలి బంధువులు పౌరులు, అమాత్యులు, పరిచారికా పరిచారకులు రామ రవిసుతులున్న ప్రదేశంచేరారు. అంగదుని హనుమ వెంటబెట్టుకుని వచ్చాడు అంతఃపుర స్త్రీజనం అను సరించగా తార, నివార క్లిన్నవదనంతో వారికి చేరువుగా ఉన్న శాఖి చ్ఛాయలో నిలిచింది. మునులు పరివేష్టింపగా ఒప్పుతున్న బ్రహ్మవలె సుగ్రీవుడు ఉన్నాడు. ఆ వ్రీకాంత వాతావరణంలో హనుమ ముకుళిత

కరకమలుడై, వినయవిధేయతలు ఉట్టిపడగా శ్రీరాముని పాదారవిందముల
కభివాదం చేస్తూ! రఘువంశమణీ! రామప్రభూ! నీ అపార కరుణా కటాక్ష
వీక్షణామృత వృష్టిచే చింతలు తీరి ఏనాటికీ, ఎవరిచేతనూ పొందరాని
రాజ్యలక్ష్మిని గృహలక్ష్మిని పొందాడు. ఆశ్రయించి వున్న ఆప్తవర్గానికి
ఆనందం కలిగింది నీవు దయతో అనుమతి ఇస్తే, నీ మిత్రుడు కిష్కిం
ధకు పోయి. దివ్యౌషధులతో సుస్నాతుడై, కీలావళితో శేషించిన కార్యాలు
చేస్తాడు మీరు నగరానికి విచ్చేస్తే, హరిమణీ మృదుపరిమళ సుమాలతో
మీ పాదార్చన చేస్తాము. ఆ దూరంగా కనుపించేదే కిష్కింధ పర్వత
గుహాంతర్భాగంలో శత్రుదుర్భేద్యంగా, సమలంకృత సమస్త సంప
త్సౌభాగ్య సమృద్ధంగా వున్నది నీ సమక్షంలో నీ మిత్రుని కృతాభిషేకు
ని చేస్తారు. నీ ఆధ్వర్యవంలో అది జరిగితే మా కపికోటి ఆనందంతో
చిందులు వేస్తుంది. నీ ఆజ్ఞాబద్ధులమైన మేం సుగ్రీవుని ప్రతినిధులుగా అర్థి
స్తున్నాం అనుగ్రహించవలసిందిగా ప్రార్థిస్తున్నాం" అంటూ సవిని
చేశాడు ఆ మారుతి సమయోచిత వాక్కులకూ, యజమానిపట్ల వున్న
అప్రమత్తమయిన శ్రద్ధకూ, ఆ అమాయకతలో సర్వవేదాంత రహస్య
గ్రహణ దక్షతకూ, ఆ వినయ సంపదకూ. అప్రతిహతా వక్ర పరాక్రమ
ప్రతిమస్థాపీయుడైకూడ, లవలేశమైన గర్వం లేని ఆ హాస్య భాషణము
లకూ రాముడు ముగ్ధుడైనాడు. ఆయన హృదయంలో హనుమ
మూర్తి పూవులో తావిలాగా అచ్ఛేద్యమై కలిసిపోయింది. ముందు జరగిన
బృహత్కార్యంలో ఈ తేజస్వియే ప్రధాన భూమిక వహించవలసిన
వాడన్న భావకిరణం మెరిసింది. ఎందుకో అతి స్వచ్ఛమై, అమూల్యమైన
అనురాగం పొంగి పొరలింది. అంత దుఃఖంలో ఆనందాశ్రుబిందువులు
నేత్రారవిందాల్లో కందళించినై పాణిపల్లవంతో కన్నులు తుడుచుకుని
రెండు చేతులతో పైకి ఎత్తి ప్రత్యక్షరంగా, అనుగ్రహాశీర్వాదభిమతా
ర్థాలు జాలు వారగా, "పావనీ! నేనింతకు పూర్వం నా సోదరుల శక్తివిశ్వా
సాభిమాన గౌరవాదరాలు మాత్రమే ఎరుగుదును. ఇట్టి సోదర సంపద
పూర్వపుణ్యవల్ల నాకొక్కనికే పరిమితం అనుకున్నాను. ఆ భావం నీ
సాంగత్య సంభాషణా ప్రవర్తనలతో ఆకర్షింపబడింది.

# రాముడు రవిపుత్రుని అభిషేకానికి అనుజ్ఞ ఇచ్చుట

నా తండ్రి ఆజ్ఞచేత అరణ్యవాసాంతం వరకు, పల్లెలు కానీ, పట్టణాలుకానీ, ప్రవేశించను. హాయిగా అర్కసూతి సబాంధవ పరివారంగా నగరంచేరి, వేదమర్యాదానుసారంగా కపిలోక సార్వభౌమాధిపత్యం పొందుగాక. తారాంగదులు పూర్వ గౌరవమర్యాదలతో దుఃఖమారులై రాజశ్రీ వృద్ధికి హృదయపూర్వకంగా తోడ్పడుదురు గాక. అమాత్యులు మారుతి తారాదేవుల మంత్రాంగం పాటింతురు గాక" అంటూ, భానుజుని నిర్దేశించి "మిత్రమా! గతం మరచి కృతం స్మరించు. ఎంతటి వివేకులైనా అర్థకామాల మధ్యలో నిల్చి ధర్మమోక్షాలను చులకనగా చూస్తారు. అర్థకామాలు అనర్థపరంపరకు కారణాలు. అవే కాని జీవయాత్రకు అవసరాలు, అర్థంచేత పోషణా, కామంచేత సృష్టి జరుగుతుంది. కనుక ప్రాజ్ఞులు ధర్మబుద్ధితో అర్థగ్రహణం, మోక్షభావంతో కామం గ్రహిస్తారు. నీకొక ధర్మసూక్ష్మం తెలుపుతాను. వాలి మరణిస్తూ రాజ్యాధికారం నీకు దత్తం చేశాడు. అతడు రాజనీతిజ్ఞుడు కనుక దూరదర్శనం చేసి ముందే జాగ్రత్తపడ్డాడు. అతని హృదయం నువ్వు అర్థం చేసుకోలేదు. పుత్రుడుండగా రాజ్యం తమ్మునికి ఏ తండ్రీ ఇవ్వడు. నీకీయటంతో ఆపేక్షకంటే: అపకారం చేశానన్న పశ్చాత్తాపం కంటే భయంబలీయంగావుంది. ఆ భయం కేవలం నిన్నుగూర్చి కాదు నన్నుగూర్చి "అంగదునికి రాజ్యంఇస్తే నాసహాయంతో అతనిని నిర్జించి అపహరిస్తావు" అని నీకే రాజ్యమిస్తే భార్యాపుత్రులు కనీసం కొంతకాలం జీవించనైనా జీవిస్తారు. ఇది వాలి హృదయం. పత్నీపాలనాలు లభించినవని సంతోషిస్తున్నావే కాని ధర్మాతిక్రమణ జరుగుతున్నదని భావించటం లేదు. నీవు రాజువయినా: నీ సంతానం కావటానికి వీలులేదు. నీతోపాటు యువరాజుగా అంగదుణ్ణి అభిషేకం చేయించు. నీ వదిన అభిమతం తెలుసుకుంటూ ప్రవర్తించు. ఆమె యువరాజు మాత. త్యాగశీలియైన వాలి వీరపత్ని. ఆమె స్వభావం అనుక్షణం నీ క్షేమం చింతించేది. నేను నీ పట్టాభిషేకానికి నా నిర్ణయానుసారం మనఃపూర్వకంగా అంగీకరించి ఆశీర్వాదం చేస్తున్నాను. ఇది శ్రావణమాస ప్రథమ దివసం. వానకాలంలో వార్షిక సంజ్ఞతో ఇది వర్తిస్తుంది. కనుక నాల్గునెలలు ఉద్యోగానికి వీలు కాదు.

నీవు పురికి వెళ్ళి కాదగిన కార్యాలు ఘనంగా పూర్తి చేయి. నేను నా తమ్మునితో ఈ శైలగుహలో నివసిస్తాను. ఈ గుహ విశాలంగానూ, రమ్యంగానూ వుంది గాలి, వెలుతురు కొదువ లేకుండా లభిస్తుంది. కుముదసౌరభ కులంతో కొలకులు కులుకుతున్నై కార్తికమాసం రాగానే దశకంఠ వధకూ, సీతాన్వేషణకూ యత్నం చేయి ఎప్పుడూ నువ్వు ఏమరపాటులో వుండవద్దు కుశలంగా పోయిరా" అని ఆజ్ఞ ఇచ్చాడు.

## సుగ్రీవ పట్టాభిషేకం

ఆ విధంగా రాముడు చెప్పిన మాటలు రవిపుత్రుడు విన్నాడు. అందులోని అంతరార్థం హనుమ గ్రహించాడు. అందరూ రామలక్ష్మణులకు అభివాదం చేసి ప్రయాణించబోతున్నారు రాముడు సుగ్రీవునితో "మన విషయం మరచిపోవద్దని మళ్ళీ హెచ్చరిక చేశాడు. విగతశోకులై అత్తనూత్సాహులై గుంపులు గట్టి వానరులు కూడి రాగా సుగ్రీవుడు అన్న అంతఃపురానికి వెళ్ళాడు అప్పటికే మర్యాదా పురస్కృతంగా అంతఃపురాంతర్భాగంలో తార వుపాసీనంగా ఆసీనురాలై వుంది అంత వరకు చావుద్రముకుల సందిగ్ధావస్థలో కర్తవ్యం తెలియక తికమక పడుతున్న ఆమెకు శ్మశానభూమిలో రాముడు సుగ్రీవునికి చేసిన హితబోధ కళ్ళు తెలిపించి కర్తవ్యం బోధించింది. "ఆహో! ఏమి రామచంద్రుడు. ఎంత ధర్మమూర్తి ఎంత సూక్ష్మగ్రాహి! ఎంత దూరదర్శి! ఎంత గంభీరుడు! ఏమి న్యాయనిర్ణయం! ఏమి రాజనీతిజ్ఞత! మా దంపతుల హృదయాలను ఎంత నేర్పుతో ఆవిష్కరించాడు! నా పతి వధ ధర్మదూరం అనుకున్నాను ఇంత ధర్మమూర్తి అధర్మంగా నా భర్తను ఎందుకు చంపుతాడు! ఆయనకాయనే పాటి అరటిపండు ఒలిచి అందించినట్లు ఎంత మధురంగా మా మనస్సులు మరదికి విప్పి చెప్పాడు! కడసారి మాటలో నా నిర్ణయాలు మీరితే వాలి గతి నీకూ తప్పదన్న భావం సూక్ష్మంగా ధ్వనించాడు" అని లోలోన గతాన్ని పునశ్చరణం వ్యాఖ్యాన పూర్వకంగా చేస్తున్న తారను సుగ్రీవుడు సమీపించాడు "వదినా! జరిగింది పీడకలగా భావించు మీదంపతులకోర్కెలను అక్షరాలమన్నించుతాను ఇకనీవుచింతదక్కి

అంగదుని భావిజీవితప్రకాశానికి అంకురారోపణంచేయి" అని ఓదార్చి వెలుపలికి రాగానే దేవతలు కుమారస్వామికివలె కావిపోయి రాజ్యాభిషేకం వానరులు జయజయధ్వానాలతో చేశారు. తపనీయభూషితమైన ధవళాతపత్రం స్వర్ణదండస్థ చామరాలూ, రత్నాలూ, ఓషధులూ, పాలూ, పూలూ, ధాన్యం, సితవస్త్రలేపనాలూ, సుగంధాలూ, మెట్టతామరలూ, అగరూ, చందనం, అక్షతలూ, వ్యాఘ్రచర్మం, బంగారం, నేయీ. వనసూకర చర్మరచిత పాదరక్షలూ, గనగసాలూ, పెరుగూ, తేనే, మనశ్శిలతోనూ, రోచనంతోనూ మిశ్రమంగా తయారుచేసిన లేపనం సంతరించారు

పదహారుగురు కన్యలు రాగా, పరమహర్షంతో మణులు, వస్త్రాలు, భక్ష్యాలు మొదలైన వస్తుసముదాయంతో బ్రాహ్మణులను వారిచేత అర్చింప చేశారు. విధివిహితంగా దర్భపరిస్తీర్ణతలంలో జాతవేదుని ప్రతిష్ఠాపించి మంత్రాలతో హోమం కావించి, మంత్రవేదులు చిత్రమాల్యోపశోభిత ప్రాసాదతలంలో భద్రపీఠిపై భానుపుత్రుని ప్రాఙ్ముఖంగా నిల్పి, బహుళ నదీనదజలాలతోనూ, సాగరాంబువులతోనూ బంగరు కుంభాలు పూరించి, అందులో ఆబోతుకొమ్ముల ముంచి, మైందుడు, ద్వివిదుడు, గంధమాదనుడు, గజుడు, గవయగవాక్షులు, జాంబవన్నళశరభులూ, హనుమంతుడూ ఉత్సాహాతిరేకంతో ఋభువును వసుసంఘం అభిషేకించిన రీతిగా అభిషేకం చేశారు ఆ సమయంలోనే అంత గొప్పగా రామాజ్ఞ మేరకు అంగదుణ్ణి యువరాజుగా అభిషేకం చేశారు సభాస్తారులంతా సుగ్రీవుని ఔదార్యానికి స్వస్తివాచనం చేశారు. రామలక్ష్మణులను ఆవేశంతో అభినందించారు. కపికుంజరగృహశిఖరాగ్రాల్లో పతాకలు ప్రతిష్ఠించారు రాజ్యచిహ్నమైన ధ్వజంసాలంకృతంగా పైకి ఎత్తారు చిత్రవిచిత్ర దీపతోరణాలతో నగరమంతా శోభాయమానంగా వెలిగింది అభిషేక వార్త మిత్రుని పంపించి, ఆత్మపతి రుమతో అభిమతభోగాలు అనుభవిస్తూ భానుజుడు ఆప్తబాంధవ పౌరసామాత్యుల మన్నిస్తూ కాలం గడపసాగాడు.

## రామలక్ష్మణులు ప్రస్రవణగిరి గుహ చేరుట

కిష్కింధా నగర ప్రాంతారణ్యంలో నిలిచివున్న రామలక్ష్మణులు రవిసూనుని పట్టాభిషేక వార్త వార్తాహరులచే విని సంతోషించారు.

అనంతరం వ్యాఘ్రమహర్క్ష రవాన్వితమూ, వివిధలతాగుల్మగూఢమూ, అనేక భూరుహసంజాతసంకులమూ, వానర గోపుచ్ఛభల్లూక బిడాలాది మృగసేవితమూ, నీలమేఘరాశి సదృశమూ రమ్య జలాశ్రయమూ అయిన ప్రస్రవణాద్రికి పయనించారు. ఆ గిరివర పరివృత విశాల ప్రదేశాన్ని వీక్షించారు. రాముడు "తమ్ముడా! ఈ గుహను చూశావా? మానవ మేధను పరిహసిస్తూ విధాత ప్రాణికోటి నివాసయోగ్యంగా అన్ని అవకాశాలు ఇందు పొందుపరచాడు. ఈ గుహ లోపలిభాగం గచ్చుచేసినదాని కంటే ఘనంగా ఎంత నునుపుగా వున్నది! తగినంత విశాలంగానూ, రమ్యంగానూ, గూఢంగానూ, మితవాయు ప్రకాశాలు కలిగి నాకు ఆకర్షణీయంగా వుంది. వర్షాకాల చతుష్కం ఇక్కడ గడుపుదాం. ఈ గిరి శృంగం తెలుపు, ఎరుపు, నలుపుగల రాళ్ళచే, ధాతువులచే, లతాతతీ పాళిచే, బహుపాదపవితానంచే, మయూర బర్హాళ శకుల కూజితంచే, సిందువార కదంబ కుంద హింతాలమందార బృందసమాళిచే, హృదయంగమమై విహారయోగ్యంగా వుంది. చిక్కచిక్కగా అల్లుకున్న దండి గురివెంద పొదలతో, గోరంటలతో, ఈ గుహ సృష్టికర్త హృదయంలాగా ఆనందంగా, అగాధంగా కూడ వుంది. అన్నివిధాలా మనకు అనువైన చోటిది. అదిగో సమీపంగా కమలాకరం ప్రఫుల్లకమలాకరమై, కమలాలయమై కనువిందు కల్పిస్తున్నది. ఈ గుహ తూరుపు, ఉత్తరంగా వుంది. తూర్పువాటంగానూ పోనుపోను ఉత్తరం పల్లంగానూ వుంది. వాన జల్లుల బెడదలేక హాయిగా కాలం గడపటానికి తగివుంది. పైభాగమంతా మిద్దె. అల్పాధిక దోషం లేకుండా గాలివెలుతురూ వుంది. చక్కని పెద్ద చాపరాయి కాటుకపరచినట్లు భిన్నవర్ణంతో పరచబడి వుంది. దీనికి ఉత్తరంగా వున్న శిఖరం చూడు. నలుపుతెలుపు కలగలుపుతో ఆ గడవం వంత్రివలె వ్యాపించి వుంది. దక్షిణశిఖరం కేవలం కైలాసం అన్నట్లు ధవళవర్ణంతో, సుందర గంగాప్రవాహంతో భాసిల్లుతూంది. అడుసులేక అతినిర్మలంగా అడుగు కనిపించే అచ్ఛజలంతో నిండి వుంది. ఈ శిఖర మధ్యంలో సాలతమాల తక్కోల హింతాల రసాల, వకుళ

వంజుల పద్మకపాదపాలు ఏంది విచిదీకృతమై వేత్రపర్వం విరచిస్తున్నై. నదీతీరప్రాంతాలలో అక్కడక్కడ విటపి సమూహంవుంది స్ఫుటకననా భరణాన్విత కుటిలాలకచందంగా కొమరారుతున్నై. విహంగనాదంతో పరస్పరాకర్షణ వికర్షణాత్త చక్రవాకసంచయసంచారంతో, ఉన్నత పులిన స్థలంతో ముఖరిత భ్రమరనాద మేదురమైనది హసిస్తున్న కాంతను అనుకరిస్తూంది

సోదరా! ఆ నదిని పరిశీలనగా చూస్తున్నావా? ఒకచోట హృదయంగమంగా ఉత్పల కుసుమకూటం ఒకవంక రక్తారుణాబ్జయూటం. ఒకవైపు మయూరక్రేంకారపు బింకం ఇంకొకవైపు అతను శాస్త్ర ప్రకర్ష ప్రదర్శిస్తున్న అంచల జంటపొంకం. ఒక త్రోవ కైరవ ముకుళ సంఘంచేత ఒక త్రోవ పల్లవములచేత ఒకప్రక్క చందనద్రుమ శోభకు ఇక్క - ఒకయిక్క తాపసుల అంగుళీపరిభ్రమణంలో తావళములలోని రుద్రాక్షలలెక్క. అంత మనోమోహనంగా వున్న ఈ తరంగిణిలో స్నానపానాదులు జరిగిస్తూ వజ్రవిన్మితావాసంగా వున్న గిరికందరంలో నివసిస్తూ, ప్రకృతి శోభలో వరవశిస్తూ ఇక్కడనే ఈ నాల్గునెలలు వెళ్ళబుచ్చుదాం. కిష్కింధకూడ ఇక్కడికి దూరమేమీ కాదు. గీతవాద్యధ్వనులు వినిపిస్తున్నై. నర్తశ్వన మృదంగవాలూ, నృత్యన్మంజులకంకణ మందోరకింకిణీరవాలూ, గాయనీ గాయకగానరవాలూ శ్రుతిలీనమై శ్రుతికింపు సంపాదిస్తున్నై ద్యుమణి పుత్రుడు రుమతోనూ, రాజ్యరమతోను హర్షామోదాలు పులకితగాత్రుడై పొందుగాక" అని చెప్పి ఆ గిరికందరంలో ప్రవేశించారు. ఆ ప్రదేశం అన్ని సుఖాలకు ఆదేశం అయినా, అంతగా తన్నాకర్షించిన స్థానమైనా, భార్యావియోగబాధ పరితప్తమనస్కుడుకావటంచేత శాంతికి మారు అశాంతి, సుఖానికిమారు దుఃఖం, ఆనందానికి మారు అనుతాపం అంతకంతకూ హెచ్చుపాగింది. చల్లని పండువెన్నెల్లో, సమీరకుమారశైత్య పరిస్పర్శల్లో, వికసిత కుసుమామోదఘ్రాణంలో సుఖశయనుడై కూడ ఒక్కనాడయినా కంటినిండ నిద్రపోలేదు. అణచుకున్నా ఆగక అంతరాంతరాలను పెకల్చుకుంటూ వచ్చే శోకానికి అవశుడవుతున్నారు. ఏ సమయంలోనూ ఆయన

నేత్రాలు తడితోనేకాని పొడిగా కనుపించలేదు. అన్న బాధకు తమ్ముడు తప్తదపుతున్నాడు.

## లక్ష్మణుడు శ్రీరాముని అనునయించుట

దినాలు క్రమంగా దొర్లిపోతున్నై, రామచంద్రుడు మాత్రం తేరుకోలేదు. ఆయన అవస్థా నివారణకు సాధనం గోచరించని సౌమిత్రి అవకాశం కలిగినప్పుడల్లా ధైర్య వచనాలు చెపుతూనే వున్నాడు. పూర్వం కష్టసుఖాలు పైకి చెప్పేవాడు కాని, ఇపుడు పూర్తిగా గంభీరమూర్తి అయినాడు. తనలో తానే భాషించుకుంటూ, నవ్వుకుంటూ, నిట్టూరుస్తూ, అంతకంతకు అగాధకూపం అడుగుకు పయనించే ఆలంబన రహితుడువలె అవుతున్నాడు. ఒకనాటి ఉదయం స్నానార్థం నదికి వెళ్ళుతున్నారు. మార్గంలో ఆహారార్థం లంఘించిన వ్యాఘ్రం గురి తప్పి ముండ్ల పొద మధ్యలో పడ్డది. శరీరం కంటకధారా పూతమై రక్తం స్రవిస్తూంది. వెలికి రావటానికి జవసత్త్వాలు క్షీణిస్తున్నై. లంఘించటానికి ఆ పొద అనాదంగా వుంది. రోజుతూంది. కాంద్రిస్తూంది. శోకరుళిపిస్తూంది. ఆ దృశ్యం ముందు నడుస్తున్న లక్ష్మణుడు చూశాడు. తటిల్లతవలె ఆలోచన మెరిసింది. వెంటనే చేతనున్న కరవాలంతో పొదను ఛేదించాడు. శోకమందెపై కూర్చుని దీనంగా తన వైపు చూస్తున్న పులిని సమీపించి బాహాబంధంతో బయటికి చేర్చాడు. రాముడు తమ్ముని సాహసం, కృప, ఆర్తరక్షణపారీణత చూచి అబ్బురపడ్డాడు. వెంటనే "తమ్ముడా! మంచిపని చేశావు. నా తమ్ముడవైనందుకు నే చేయవలసిన పని నీవు చేసి నాకు తృప్తి కూర్చావు. పులి, జన్మ సహజంగా క్రూరమైంది. ఆ క్రూరత ఆహారంగా నిర్ణయించిన ప్రాణుల పైనే చూపిస్తుంది. క్షున్నివారణకాగానే స్వస్థానంచేరి సుఖంగా నిద్రిస్తుంది. తిరిగి ఆకలివేసే వరకూ దానిలో క్రూరత్వం వుండదు. మానవుల్లో కొన్ని వ్యాఘ్రాలు వున్నై. ఈ వ్యాఘ్రాల క్రౌర్యానికి ఆకలి దప్పులతో పనిలేదు. అవసరానవసరాలతో అంతకంటె పనిలేదు. ధర్మాధర్మాలతో అవసరమే లేదు. నీతి నియమాలు వారికి మూర్ఖులు వ్రాసిన చెత్త పుస్తకాలలోని కారుకూతలు. పరప్రాణిహింసతో బ్రదకటమే వాళ్ళ ధ్యేయం. నిజమైన

పులిని స్వరక్షణకు ఒక్క ఆయుధం ధరించి సమీపించవచ్చు. ఈ నిష్కారణ క్రూర జీవాలైన మానవ వ్యాఘ్రాలను సమీపించాలంటే ఆత్మ రక్షణకు ఆయుధాల్లేవు. దీని క్రూరత జన్మ సిద్ధం. వాళ్ళ క్రూరత స్వార్థాజ్ఞాన సిద్ధం దీనిని మెల్లగా మన వెంటకొనిరా, గాయాలు కడిగి. నీరు త్రాగించి చల్లని చెట్టు నీడలో విడిచి పుచ్చుదాం" అని అన్నాడు.

ఆ మాటలు, వాడుతున్న సస్యానికి వానజల్లువలె లక్ష్మణునకు ఎక్కడలేని తృప్తి కలిగించినై. మాటాడే అవకాశం దొరికింది ప్రసన్నుడుగా, విచక్షణా సహితుడుగా అన్న వున్నాడని ఆనందించాడు మంద్ర స్థాయిలో "అన్నా! ఇది దైవఘటన ఎక్కడైనా పులి పొదల మధ్యలో చిక్కి వెలికి రాలేక చచ్చిందని విన్నామా? ఈ పులికి మనం సాయపడుతామను కున్నామా? ఈ ఘటన చూస్తే నీ స్థితికి నీడవలె తోస్తూంది అఘటన ఘటనా సమర్థుడవై, హరకోదండ విఖండనమండనమండనవై, సత్య వ్రతుడవై, సత్య పరాక్రముడవై పత్నీ వియోగ క్లేశంతో పరితపించటం, ఈ పులి ముండ్లపొదలో అసహాయంగా చిక్కుకున్నట్లు నాకు తోచింది. అయాచితంగా బాటసారులమైన మనచే ఉద్ధరింపబడటం సుగ్రీవునిచే వదిన [illegible] వార్త అందుకోవటం అనిపించింది. నీవే ఆపన్నుడవైతే నేనే ధైర్యంతో భవిష్యత్కార్యం సాధిస్తాను; అతి దుఃఖం కార్య నాశనకారికదా; క్రియాపరులలో నిన్ను మించిన వారులేరు. దైవ పరాయణుడవు. ధర్మశీలుడవు. సద్వ్యవసాయివి. సత్యసంపన్నుడవు. ఆస్తికుడవు ఆజిగారాని బిడ్డవు. జనక రాజర్షిచే పాదములు కడిగించుకున్న పరమ పూజ్యుడవు రామన్న భయంకర సమరంలో రావణుని దశగ్రీవముల, వింశతి కరముల ధైర్య హీనుడవై నరుకగలవా? శోకవేగాన్ని నాశనం చేయి ధృతి సుస్థిరం చేయి ఫలకారకమైన వ్యవసాయం చేయి. దైతేయుని సంబాధనం ధ్వంసంచేయి. అంతే కాని దురంత చింతతో కాలం త్రోయటంనీకు న్యాయమేనా? భావిదర్శనుడైన మన గురువు గాధేయుడిచ్చిన అస్త్ర విద్యను అవకాశం లేకుండా చేస్తావా? దుష్ట శిక్షణకూ, శిష్ట రక్షణకూ కట్టుకున్న కంకణం త్రెంచివేస్తావా? కన్నుల్లో ప్రాణాలు పెట్టుకుని నీ రాకకోసం నిరీక్షిస్తున్న భరతుని జీవితం బలిగొంటావా? నీవు విర్నిద్రుడవై నిలిస్తే చతు

సాగర పర్యంతోర్వి తలక్రిందులుగాదా? ఊర్ధ్వలోకాలు నేలపాలు కావా? దశకంఠుడు నీకొక లెక్కా? సహస్ర కంఠులు సహస్ర సంఖ్యలో ఎత్తి వచ్చినా: ప్రళయ ప్రభంజనానికి వగుదాకులవలె నీ అవ్యాహత శర ప్రయోగ పరంపరలో సుళ్ళు తిరిగి భూపతితులు కారా? అప్పుడే వానకాలం వచ్చింది కాలచక్ర పరిభ్రమణ వేగంలో క్షణాలమీద శరదాగమనం రానే వస్తుంది నీ మిత్రుడు కార్యరంగంలోకి దిగుతాడు నమ్మినబంటు, విశ్వాసపాత్రుడు కార్యం సాధించక కాలు వెనుకకు త్రిప్పనివాడు మారుతి మన కార్యం తలతో చేస్తాడు. ఆశించని అవకాశం కల్పించిన నీకు అంగదుడు ప్రాణాలర్పించగలడు. నీ కార్యం వెనుకకు నెట్టి మిత్రుని కార్యం ముందుకు పెట్టిన నీకై సుగ్రీవుడు తన సర్వస్వం ధారపోస్తాడు ఆకొన్న దెబ్బలి నీ తమ్ముని కూర్చి నీకు తెలియనిదేముంది? రాబోయే యుద్ధ యజ్ఞంలో రావణాహుతికై ప్రక్కనుండి శౌర్యాగ్నిని ప్రజ్వలింపచేస్తాడు. ఈ కొలది కాలం ఓపిక వహించు. అన్నా! నీ సన్నిధానంలో దాచలేను. రహస్యం విప్పుతాను

ఏది మనమిప్పుడు రక్షించిన వాగ్రమం? ఇంతలోనే ఏమైంది? ఈ సంఘటన నా సంకల్ప బలం నీ క్షేమానికి నేను ఏది సంకల్పిస్తే అది అవుతుందని నా తల్లి ఆశీర్వదించింది. ఆమె అనుగ్రహమే ఈ ప్రదర్శనం. ఎన్ని విధాల చెప్పినా నీవు ఊరట పొందటం లేదు కొంది దినాలుగా నాతో మనసిచ్చి మాటలాడటం లేదు నిన్నెవిధంగా ప్రసన్నుణ్ణి చేయగలనా అని ఆలోచిస్తూ నా తల్లిని ధ్యానించాను. ఆమె అంతా చక్కబడుతుందని చెప్పి అంతర్హిత అయింది ఆమె కల్పించిందే ఈ దృశ్యం. ఇది నిజంగా నీవు భాషించటం; నా కవకాశం లభించటం, నీవు ప్రసన్నుడవు కావటం జరిగింది నా సాహసం మన్నించమంటూ పాదాభివందనం చేశాడు. ప్రియసోదర రాముడు తమ్ముణ్ణి లేవదీసి గాఢంగా కౌగిలించుకుని "తమ్ముడా అర్ధభాగం దూరమై అల్లాడుతున్న నన్ను తిమిరంలో నుంచి తేజస్సులోనికి తెచ్చిన నీ సాహసం మన్ననకు కాదు ప్రశంసకు పాత్రమైంది. మీ వదిన లేని సమయంలో నీవుకూడా లేకపోతే ఈ రాముడు నిజంగా వెర్రి రాముడే అయ్యేవాడు. నీ మాటలు, రక్తి. హితమూ, నెయ్యమూ, సత్య గౌర

దర్పాలూ వెలార్పటంతో, కార్యవినాశకారి అయిన దుఃఖాన్ని విసర్జించాను. ధైర్య కంచుకంధరించాను విక్రమంతో నీ వాక్యానుసారం కాలానికై ప్రతీక్షిస్తాను. శరదాగమనంతో ఈ నదీ, మిత్రుడు రవిపుత్రుడూ ప్రసన్ను లౌతారు. వీరుడైన మగవాడు ఉపకారికి ఎప్పుడైనా మేలు ఎలాగైనా చేస్తాడు క్రూరుడు మేలు మరచి సుజనకోటి నొప్పిస్తాడు. సంశయంతో పనిలేదు" అని అన్నాడు. ఆ మాటలకు లక్ష్మణుడు "అన్నా! నీ వనినట్లు వర్షం జరిగి తీరుతుంది. వనచరపతి అర్హవేళ పని గొంటాడు. వానకాలం గడవగానే అరిని దురంలో చెండుదువు గాని. అంతవరకు ప్రసన్న మతివై ప్రొద్దులు పుచ్చు" మన్నాడు. ఇద్దరూ భారం తగ్గినట్లుగా భావిస్తూ నదిచేరి కృతస్నానులై పాత్రంతో జలం గ్రహించి ఆవాసానికి అరుగుదెంచారు. ఆహారం స్వీకరించి విశ్రాంతి తీసుకున్నారు.

## వర్ష ఋతు వర్ణనం

కాలనిర్ణయ కావ్యంలో లోకబాంధవ కవి ఒక్కొక్క పుటవిందిస్తున్నాడు ఆనాడు ఆకాశం మేఘావృతమైంది. నెమిళ్ళు గుంపులుగా వెలికి వచ్చి క్రేంకారం సలుపుతూ, నృత్యం చేస్తున్నై. చల్లని తెమ్మెరలు నిరివిగా వీస్తున్నై. సోదరులు శిఖరాగ్రం చేరారు. శీతవాత సంస్పర్శతో హాయిని అనుభవిస్తూ, రాముడు తమ్ముణ్ణిచూచి "సోదరా! వృష్టికాలం బాగా వచ్చింది. పెనుకొండల్లాగా ఆకాశాన్ని జలధరశ్రేణి ఆక్రమించి అవనీతలం అంతా తిమిరావృతం చేస్తూంది. దివి, దినకరతీక్ష్ణంతో అర్ణవంలోని రసాన్ని త్రాగి నవమాసగర్భయై రసాయనాన్ని ప్రసవిస్తూంది. మేఘాలు, ధరణీ ధరాగ్రభాగాలలో విస్తారంగా వికసించిన అర్జున కుసుమాలనుకొని వేడివేల్పు నలంకరించాలని వినువీధికి పోతున్నై అక్కడక్కడ సంజకెంజాయ రంజిల్లంగా. అంతంలో పాండురస్నిగ్ధంగా వున్న మబ్బులను చించి చీరగుడ్డలు కట్టిన పుండ్లువలె ఆకాశం గోచరిస్తూంది. మందమారుత బృందమై, సాంధ్య రాగపటీర రంజనమై, అభ్రం ఆపాండు రమై అభ్రయుక్తి, కామపరి పీడితునివలె కానవస్తూంది. ఘర్మసంతప్తయై, నూత్న కాండములతో తోగుచూ, దోదూయమానయైన సీతలాగా భూమి

బాష్పాలను రాలుస్తోంది. జలధరగర్భ ముక్తాలూ, లలిత కల్హారనికర సుర సుఖ శీతలాలూ, కైతక కుసుమ పరిమళాలూ, ఈ కాలములో చేరంతో జుర్రుకొనవచ్చు మొగలి రేకుల ధూళితో నిండి, వికసితార్జున సూనాంతో వెల్లివిరిసి ఈ గిరిధారాభిషిక్తుడైన సుగ్రీవునివలె భాసిల్లుతోంది.

మబ్బులు కృష్ణాజినాలవలె, జలధారలు యజ్ఞోపవీతాలవలె చలిగాలి నిండిన గుహలతో కొండలు శ్రుతులు పలించే ద్విజాల్లాగా ఒప్పుతున్నై. కశావిదంగరు మెరుగుల వంటి మెరుపు కొరడాల ఘాతానికి వందురుతున్న వటువులాగా గర్జల ఘోషతో నభం ఘోషిస్తోంది అయ్యో! తమ్ముడా! ఆ మెరుపు చలిస్తూంటే, రావణుని అంకంలో వ్యసన భారంతో కంపించే సీత గుర్తు వస్తోంది కారు మొగిళ్ళతో క్రమ్ముకున్న దిశలు దంపతులకు హితలై, విభాగం ఏర్పరించగా రానిచందాన నష్టగ్రహదీధితులతో ఏనకమేనగుచున్నై. వర్షాగమనానికి వుత్సుకలైన కొండమల్లెలు అచ్చటచ్చట ఆవిరివస్తుంటే కామసందీపనం పొందే కాముకుల్లాగా చరియల్లో కొమరారుతున్నై. ఋతువుల్లో వానకాలం సుఖ విశ్రాంతులకు మంచి సమయం ధూళి సమసింది చల్లగాలులు వీస్తున్నై. స్వేదజలం ఇంకింది. వీవనలలో అవసరం తీరింది. దూరస్థులు స్వాలయాలకు చనుదెంచుతున్నారు. చైత్రయాత్రలు మాని భూపతులు స్వరాష్ట్ర పాలనలో మగ్నులవుతున్నారు మానససరోవరవాస లాలసలైన రాజహంసలు ఎక్కడ దాగినవో. చక్రవాకాలు ప్రియమూర్తిని బాసి ప్రియాప్తితో సంతసిస్తున్నై. ఏకధారగా వర్షాలు వ్రేలాడినట్లు వానధారలు పడుతున్నై. దారుల్లో బండ్లపయనం ప్రదేశాలకు ఇక సాగదు క్వచిత్ప్రకాశమై క్వచిదప్రకాశమై, క్వచిత్క్వచిత్కూధరకాంత విరుద్ధమై, తరంగచాలన రహితమైన అంబుధిపోలిన నదీమతల్లులు సర్జకదంబ పుష్పమేళనంతో శైలధాతు సమాక్రాంతమై విభావసుకాంతుల నీనుచున్నై రేకులు వదడపీపత్రాని పరిపడక దోకుకుంటూ, దూకుకుంటూ పారిపోతున్నై. రసపూర్ణములై షట్పదముల కాంతితో నేరేడుపండుపండ్లు గాలివిసరున పడగా, వాటినీ, అపక్వమైన మామిడికాయలనూ, బాలబాలికలు పరుగులుతీస్తూ అందుకుని తింటున్నారు. బలామాలికలతో, మెరుపుచెక్కెంతో సమరాంగణతో మత్తమాతంగాలు

ఘీంకరిస్తున్నట్లు మేఘాలు గర్జిస్తున్నై. సస్యసంతతి జడికి తడిసిచెందగా, నెమిళ్ళు నృత్యంచేస్తుండగా, మబ్బులు వానకురుస్తుండగా వనాలు అపరాహ్ణ వేళ చూడముచ్చటగా వున్నై. సలిలభారంతో బలాక, బలాకలతో కూడి ప్రయాణిస్తున్న జలదపాండ్రశ్రేణి గిరిశిఖరాల్లో ఆగిఆగి మళ్ళీ ప్రయాణం సాగిస్తున్నై. గర్భధారణకై మేఘాభికామంతో మింటిపైకి పోతున్న కొక్కెరపిండు గాలిచే కదలుతున్న తెల్లతామర పూల తోరణంలాగ కనుపిస్తూంది.

ఇంద్రకోపముల సంతానం పచ్చికబయళ్ళలో అచ్చటచ్చట నిండి ఎఱ్ఱపట్టుచీరపై ఆకుపచ్చ మొగ్గలుకుట్టినట్లొప్పి ధరణీకాంత రామచిలుక రెక్కచీర దాల్చినట్లుంది. నదీకాంతలు సాగరవరుని జేరుతున్నై. వలాహకాలు మేఘపటలానికి తారినై. చెన్నుడు నిద్దురకూరుతున్నాడు. కాముకులు ప్రియునిపజ్జకు పరచుచున్నారు. నెమిళ్ళ ఆటలతో, కదంబాల పూలకొమ్మలతో, ధరణి సస్యసంతతులతో, పచ్చికబీళ్ళ ఆలతో, కోడెలతో నిండి కన్నులపండువు కలిగిస్తున్నై. సెలయేళ్ళ పొంతల క్రంతలలో మదించిన ఏనుగులు గేదగిపూల వాసనల కుత్తుకబంటిగ్రాగి గిరికూటస్థనిర్ఝరి మ్రోతలకు ఆనందిస్తూ, నటచ్ఛిఖావల నాదంతో కలిసేట్లు ఘీంకరిస్తున్నై. ఇచ్చవచ్చినటు పూదేనెల గ్రాగి క్షణంలో మత్తునకూరే అళులు వర్షధారాతాడితాలై, దిగాలున కదంబశాఖల్లో వ్రేలాడుతున్నై. శైలవనప్రాంతంలో సత్వరమందపోతున్న మదనాగం ఉరుమగా విని, ఇంకొకనాగం ఘీంకరించి పొగరుతో పిలుస్తున్నట్లుగా క్రమించి తటాలున వెనుదిరిగి తొండమెత్తి గిరులు మార్మోగేలాగా ఘీంకారంచేస్తూంది. మయూర మధుకర మదకరులవిధంగా, కొన్ని వనులు ఆడుతున్నాయి. కొన్నివనులు పాడుతున్నాయి కొన్నివనులు మత్తులౌతున్నాయి అర్జున కదంబపుష్ప రుచిరమై, నూత్న వారిపూరమై, మయూర నృత్యలసితమై పానశాలలవలె కొన్నివనులు ప్రమదం కూరుస్తున్నై. ఇంద్రదత్తములూ, స్వచ్ఛములూ అయి మంచిముత్యంవలె తామరపత్రాలపై నిల్చిన వర్ష బిందువులను వలవన్నెలకల చక్రవాకపక్షి పిపాసతో క్రోలుతున్నది.

భ్రమరతంత్రీ స్వనంతో, మండూక కంఠతాళగతితో, అంబుదమృదంగ రవంతో కాననాలు సంగీతసభవలె కనులకూ, వీనులకూ విందుచేస్తున్నై.

తీరస్థ వృక్షాల నుంచి రాలిపడిన ఫలపుష్పాలను కైకొని ఒడ్లు ఒరుసుకుంటూ ఊర్ధ్వయానకై తటినీనదాలు కేరుతూ ప్రాణపతియైన సాగరునకు ఉపహారాలు అందించుటకు పోతున్నారు. సంతతవృష్టి ధారకు శోభచెదిరిన తామరపూవుల వదలి చక్కగా వికసించిన కదంబపుష్పాలపై తుమ్మెదలు వ్రాలుతున్నై. చంచలులు అవసరమే గమనిస్తారు కాని హీన మైత్రియని ఎంచరుకదా! సమ్మదగతేంద్రం. ప్రహృష్టగవీంద్రం సురుచి మధ్యాధరరేంద్రం. శ్రాంతమృగేంద్రం, పరిఖేలిత నిర్ఝరేంద్రం, శాంత వరేంద్రం, సంఘటిత మేఘబృందమైన వర్షఋతువు జీవకోటికి జీవనాధారం కదా! వర్షధారలతో ధరణీతలం చిమ్మచీకట్లు క్రమ్ముతున్నై. రివ్వు రివ్వున గాలులు వీస్తున్నై. నదులు కూలములు కూల్చుకుంటూ పారుతున్నై ఆ వేగంలో దారులుతప్పుతున్నై. జనతాభిషిక్తులైన ధరణీపతులు స్వీయవైభవాన్ని తరచుగా చూపించినట్లు, ఇంద్రదత్తమై, మరుపీతమైన మేఘమండలిచే అభిషిక్తమై ధరణీధరాలు శ్రీయుతంగా తమ సహజ సౌందర్యరూపాన్ని ప్రకటిస్తున్నై చుక్కలతో కూడిన గగనం కారుమేఘాల ముసుగులో కప్పబడింది. దివాకరుడు ఏమూలవున్నాడో తెలియటంలేదు గ్రీష్మభీష్మంతో తప్తమైన మేదిని జలధారలతో తృప్తి కన్నది సర్వం చీకటిగర్భంలో సంలీనమైంది దిక్కులు తెల్వైజాపినై. ఇక దిక్కేదో ఎరుకపడదు కొండలపై నుండి దిగుతున్న నిర్ఝరులు దారికడ్డంగా ఎద్ద గుండుదాకి చిమ్మన గ్రోవితో చిమ్మినట్లు చిందుతుంటే తడిసిన గుహలనుండి ఆ చప్పుడు ద్విగుణీకృతం అవుతూంది దేవలోకంలో మదవతులు మదనకదనంలో పెనగులాడునప్పుడు తెగిరాలిన ముత్యాలలాగ వడగండ్లు పడుతున్నై నీరజాతాలు ముకుళితములు కాగా, జాజులు వికసించి సూర్యాస్తమయాన్ని సూచిస్తున్నై

త్రోవలూ, డొంకలూ తెలియరాకుండా ప్రవాహాలతో, తిమిరంతో ధరణిపంకిలమై వుండటంచేత సమరంచేస్తున్న సైన్యాధిపతులు తమ వరూధినికి విశ్రాంతినిమిత్తం ఆజ్ఞలు వేగులచే పంపుతున్నారు. శ్రావణం గతించింది.

భాద్రపదం వచ్చింది. వేదవిదులు ఈ సమయంలో సామవేదాన్ని ఛాత్రగణంచే అధ్యయనం చేయిస్తారు. మన తమ్ముడు భరతుడు అయోధ్యలో గృహకృత్యాలూ, పాలనావిధులూ వదలి, ప్రయోజనకరమైన పదార్థాలు సేవించి, ఆషాఢం మొదలుగా చాతుర్మాస్యలు వ్రతనిష్ఠుడై వుంటాడు. ఈ సమయంలో, పురం వెడలి నేను వచ్చేటప్పుడు పౌరులు ఉపచరించిన దుర్భరదుఃఖారావమువలె సరయూనది భీకరంగా ధ్వనిస్తూ ప్రవహించుతుంది. భావుకమయిన ఈ కాలంలో బాధితవైరి సదారుడయి సుగ్రీవుడు దుఃఖించుతుంటే నేను విగతదారుడనయి నదీకూలంలోని వృక్షంవలె క్రమంగా ఆర్తితో కూలిపోతున్నాను. ఆశ్వయుజాంతం వరకు మండుతున్న శోకానలం అణచిపెట్టి వుంచటం సాధ్యంకాకుండా వుంది. మిత్రుడు శత్రువధాంతంలో ఆజ్ఞ ఏమని నన్ను అడిగినప్పుడు, దారులు అగమ్యాలగుటచేతను, బహుకాలం భార్యావియోగంతో బాధపడినాడన్న జాలిచేతను మన కార్యాన్ని ఆపివుంటాను కాని; ఈ పరితాపం మాత్రం ఆపుకో లేకుండా వున్నాను. ఐనా ఓర్చుకుంటాను. ఉపకారం తెలిసినవాడు కపివీరుడు యుక్తసమయంలో వస్తాడు. తనవంతు కార్యం తప్పక నెరవేర్చుతాడు. అతడు అంత కృతఘ్నుడయితే అప్పుడే ఆలోచించుకుందాం. అతనితో మనమన్న సమయంవరకూ ఆగుదాం" అని అన్నాడు.

## కామంలో గతింపమరచిన సుగ్రీవుణ్ణి హనుమ హెచ్చరించుట

మేఘాలూ, మెరుపులూ తొలగినై. హంసారవం శ్రీమంతంబై చెలగింది. వెన్నెల దిక్కుల వెలిగించి వినువీధి విమలంగా మెలగింది. అది శరదాగమనంగా హనుమ గుర్తించాడు. మహాభోగభాగ్య సమృద్ధుణ్ణి, కామపరతంత్రుణ్ణి, సజ్జనమార్గచారుణ్ణి, ధర్మార్థాతిరిక్తుణ్ణి, నివృత్తకార్యుణ్ణి, కామినీసంగతైకనిష్ఠుణ్ణి, మనోరథసిద్ధితో మదించినవాణ్ణి, రేపవళ్ళు కామినీపానలోలుణ్ణి, తారతో, దారతో ఉదారలీలా వినోదుడై వున్నవాణ్ణి, పాలనాభారం మంత్రులమీద త్రోసి అంతఃపురాన్ని వీడని వాణ్ణి, రాజ్యతంత్రంకంటే కామతంత్రం ఘనమని నమ్మినవాణ్ణి, విమర్శనారహిత కార్యాచరుణ్ణి, నిర్దేశపరిజ్ఞాన శూన్యుణ్ణి సమీపించాడు. తన రాక

తెలిపాడు. ప్రత్యుత్తరం రాలేదు తత్త్వసంపన్నుడు, కాలవేది, హితవ ధ్యయన యథార్థయుక్తి మాటతగినంతకాలం చూశాడు వేచివుండతగిన కాలం వేచాడు సింహగర్జనం చేశాడు. ఆ ధ్వనికి కిష్కింధ మూలంగా కదలింది తప్పతాగిన మైకంలో ఒడలుమరచి విశ్రమిస్తున్న శయనం వూగింది ఆ వూగుతూగులో పాపం ప్రభువు భూపతితుడైనాడు మత్తు దిగింది. మనస్సు కదలింది ఈ అకాలగర్జన ఎక్కడిదని అడిగాడు ద్వారపాలకుడు జరిగినదంతా వివరంగా చెప్పాడు ఉలికిపడి వెంటనే కొని రమ్మని ఆజ్ఞ ఇచ్చాడు. హనుమ అంతిపురానికి వచ్చాడు. సుగ్రీవుడులేచి ఆహ్వానించి ఆదరించాడు. రాకకు కారణం అడిగాడు.

సౌమ్యుడు భాషణుడైన సామీరి వినయంతో "ప్రభూ! నీకు కావలసిన కార్యం నెరవేరింది. మిత్రకార్యం ఒకటే మిగిలింది" అని వచించాడు. "ఏమా మిత్రకార్యం?" అని రవిసుతుడడిగాడు. హనుమకు ఆగ్రహం వచ్చింది నిగ్రహించుకున్నాడు శాంతంగా, సమ్మగర్భంగా, మితంగా, హితంగా "మిత్ర దత్త రాజ్య శ్రీపతీ! వానరపతీ! కాలం గుర్తించి, కాలానుకూలం కార్యంచేసే భూపాలుడు యశస్సునూ, కోశాన్నీ, రాజ్యాన్నీ వృద్ధిచేసుకుంటాడు. దండమూ, సుహృత్కాండమూ, కోశబలమూ వుంటే రాజ్యం సమృద్ధంగా వుంటుంది వృత్తసంపన్నుడవగుటచే నీ బుద్ధి నిరత్యయవడంలో పయనిస్తుంది ఇకనైనా గుర్తించి కాలం మిత్రకార్యార్థం యత్నంచేయి తన కార్యం వదలుకుని మిత్రకార్యానికి తొందరించేవాడు ఎప్పుడూ అనర్థాలు పొందడు. కాలాతిక్రమణం కలిగిన విస్మృతి ఎంతచేసినా అతణ్ణి కృతఘ్నుడంటారే కాని కృతజ్ఞుడనరు. విశ్వాసపాత్రుడయిన మిత్రుడు చేసినమేలు మరవడు సరికదా బ్రతికినన్నాళ్ళు కృతజ్ఞుడుగా బ్రతుకుతాడు లోకంలో మిత్రశబ్దసార్థక్యంగల మిత్రుడు దొరకటం దుర్లభం. నీ అదృష్టంవె అది నీకు లభించింది దాన్ని వ్యర్థం చేసుకోవటం ఆత్మహత్యా సదృశ్యం. రామప్రభువు మిత్రమాత్రుడే కాదు మనా! దురంత చింతాశరాన్ని తోసిపుచ్చి నిన్ను వుద్ధరించిన దయామూర్తి. కపిజాతిని లోకం నమ్ముతుందా? ఆ మహనీయుడు సమ్మాడు. సత్యప్రతిజ్ఞుడయినాడు. మరి నీవో—

# సుగ్రీవునితో హనుమంతుడు సీతను వెదకించుమని చెప్పుట

అన్నమాటను దాటావు కాలం మీరిందని కూడా గమనించలేదు. ఇప్పుడైనా మేలుకొని గడువు దాటకుండా సీతాన్వేషణం చేయించు. నిర్ణయించిన సమయం ఇప్పటికెంత దాటిందో గమనించావా? ఆయన ఎంత శాంతుడో ఎంత గంభీరుడో, ఎంత మిత్రవాత్సల్యం కలవాడో నీకింకా తెలియలేదు నీతో చెప్పిన గడువు గడిచిందని ఆయనకు తెలుసు తన కార్యం సత్వరంగా జరుగవలసిందనికూడ ఎరుగును ఐనా ఇంతవరకు ఆ విషయాన్ని కూర్చి నిన్ను హెచ్చరించలేదు నీవంశాన్ని సముద్ధరించిన మహానుభావుడు అజేయుడైన నీ అన్నను ఏకబాణ ప్రయోగంతో ఇహ లోకాన్ని తప్పించారు ప్రవాసివైన నీకు మహాభోగాలు సమకూర్చాడు. భోగలాలసుడవైన నీవు వియోగభారంతో క్రుంగిపోతూ, నీకోసం నిరీక్షిం చుతున్న మిత్రుణ్ణి నిర్లక్ష్యం చేశావు. భూమాత పాపులనెందరినైనా భరిస్తానుకాని ఒక్క కృతఘ్నుణ్ణికూడా భరియించలే"నని మొరపెట్టుకుంది. ఇతరులు హెచ్చరిక చేయకముందే కార్యం ముగిస్తే, కాలాతిక్రమణ దోషం కలుగదు చెప్పిన తర్వాత చేస్తే అతిక్రమణ దోషం అనుభవించకతప్పదు ఆయనకు నీవు చేసే వుపకారం ఏమీ లేదు. ఆయనచే నీవు పొందిన వుపకారానికి వుపకృతి మాత్రమే ఇది ధృతి మతిహిత చరితుడవైన నీవు ఇంతకాలం ఎందుకు ఆగావు? నీవు చేయకపోతే ఆయన కార్యం ఆగుతుందనుకున్నావా? వెర్రివాడా గుండ్రాయి దాస్తే పెండ్లి ఆగుతుందా? ధనువును ఎక్కుబెట్టి శరంగుణంలో కూర్చితే శత్రువు సీతను దెచ్చి పదార్పణంచేసి క్షమాభిక్ష కోరుతాడు. కాదా త్రిభువనాలను దగ్ధం చేసియైనా సీతను సాధిస్తాడు నీవెంతటివాడవో, నీ మాట బింకం ఎంతదో చూడ గోరి ఇంతవరకు ఆగాడు సీతాన్వేషణ కీర్తి నీకు దక్కాలని వుదాసీనంగా వూరుకున్న రామచంద్రుని ఔదార్యం కొనియాడవలెనని నీవు చేసేపని అనుమతి ఇస్తే ఆయన సోదరుడు సౌమిత్రి ఒక్కడే ఆ పని చేస్తాడు. కపిరాజా! ఒక హెచ్చరిక. రామాగ్రహం కంటే లక్ష్మణాగ్రహం ప్రమాదం ఆయనకు అన్నకుమించిన ధర్మాలూ, సత్యాలూ, అయ్యలూ, అమ్మలూ వావివరుసలూ, నీతినియమాలూ లేవు ఆయనకు

నీవుపకారం తలపెట్టావన్న భావం తలపునకు రాకముందే కార్యక్రమానికి ఉపక్రమించు. లఘుభావాలు నీలో రానీయకు. అనిమిషదైత్యమారుత జగాహి గణం ఎత్తి వచ్చినా రవంత చలించని ఆ కోదండధారికి రావణు డొక లెక్క కాదు. సీతమ్మ జాడకొరకే వేచివున్నారు. వెంటనే సమర్థులైన కపికోటిని రప్పించు. మంటిలోమా, మింటిలోమా, మంట లోమా, నీటిలోమా సాహసంతో సంచరించగలవారిని నిర్ణయించి నియమించు. నీ ఆజ్ఞ అయితే కోటానుకోట్లవానరులు అందుకు సిద్ధంగా వున్నారు. ఇక నీ ఆజ్ఞ ఒకటే ఆలస్యం" అని అగాడు. ఆ హెచ్చరిక విన్న సుగ్రీవుడు నీలుని పిలిపించి ఈ విశాల విశ్వంలో ఎక్కడవున్నా కపులంతా పదిహేను దినాల్లో కిష్కింధకు రావలసిందనీ, రాకపోతే ప్రాణాలు దక్కవనీ నా ఆజ్ఞను ప్రకటించు. అంగదుడూ, నీవూ, హనుమంతుడూ కలసి జనకీజాన్వేషణకు అంకురారోపణం చేయండి" అంటూ లోనికి నిష్క్రమించాడు.

## శరత్తులో శ్రీరాముడు సీతావిరహంతో తపించుట

వానలు వెనుకాడగా; ఆకసం నిర్మలం కాగా; చంద్రమండలం విశుద్ధం కాగా; శరత్కాంత వెన్నెలచందనం అలందుకోగా; క్రౌంచిరేడు అలము సుఖాన్ని అందగా; అనుకున్న సమయం అతీతం పొందగా; మావితశైలాగ్రసమాసీనుడైన రాముడు జానకిని మానసంలో నిలుపుకుని శోకంతో ఉపతాపించుతూ: "ఈ రాత్రి నాకు శివరాత్రివలె జాగరణ కారణమే అయినది. ఈ శరత్కాల రాకా సుధాకర కిరణ శైత్యానికి సీత నన్ను తలంచి ఎంత సంతపించునో? మాటలాడుతుంటే హంసారవం గుర్తు వచ్చి సీతను తెలుసుకునేవాణ్ణి. ఇప్పుడు ఏ ధ్వని విని సీతను గురిస్తాను? ఆమె ఏ ప్రదేశంలో వున్నదో. అక్కడ ఈ శరత్కాలం శోభ ఈ విధంగానే వుంటే ఆమె ఎలా భరించగలదు? ఆ సర్వాంగసుందరి నా చెంత లేకుంటచే; ఈ గిరులు; తరులు; నదీనదాలు; సరస్సులు; పుష్ప వనాలు ప్రియం కూర్చలేకుండా వున్నై. ఒంటిగావున్న వేళ జక్కవ జంటరవం వింటే నన్ను బాసి దిక్కురి దీనురాలైన సీత ఎంత దిగులు

పడుతుందో? శారదగుణసారావప్పారుడై సమీరుడు వియోగజాతార్తయైన సీతను మృత్యుకారణంగా కారింపక వుంటాడా? ఏం చేసేది? ఎంత కాలం వ్యసనం భరించేది? కాలం గడచినకొద్దీ మహోవ్యధ మాయమవుతుం దంటారు? మరి నాలో ఆ మార్పు రాదెందుకు? ఇన్ని కోట్ల ప్రాణులకు సౌఖ్యకారణమైన శరత్కాలం నాకింత విపత్కాలం ఎందుకయింది? ఈ శోకానికి అంత మెప్పటికి? నా ప్రాణేశ్వరి సమాగమం ఈ జన్మలో నాకు లభించుతుందా?" అంటూ: చాతకం నీటికై పురుహూతునికోసం మొర పెట్టినట్లు సీతకోసం వాపోతున్నారు ఏకాంతంగా సీతాకాంతుడు దుఃఖా క్రాంతుడు కావటం లక్ష్మణుడు చూచాడు. "ఇంద్రియ విజేతయైన అన్న పొందుతున్న విరహతాపానికి కేవలం లౌకిక కామం కారణం కాదని గ్రహించాడు. ఏకంగా వున్న పదార్థాన్ని మధ్యకు విరిస్తే అంటివుంది కూడ ఒక భాగం వాలిపోతుంది అలాగే పూర్ణమైన తేజస్సు భౌతికంగా ద్విధావిభాజ్యమైనప్పుడు రెండు కలిసినప్పుడే నిండుగా వుంటుంది ఏ ఒకటి దూరమైనా వెలితి తప్పక కనుపిస్తుంది అదే అన్నలో కను పిస్తూంది" అని మదిలో భావిస్తూ సత్వరుడై గిరి శిఖరాగ్రాన్ని చేరుకున్నాడు

## లక్ష్మణుడు రాముని దుఃఖం నివారించుట

త్వరితంగా వస్తున్న తమ్ముణ్ణి రాముడు చూచాడు "సోదరా! కూర్చో. నీవు ఫలజలాల నిమిత్తం పోతే తోచక ఇక్కడికి వచ్చాను. మనస్సేమీ బాగాలేదు మాటిమాటికీ మీ వదిన మనస్సులో నిలుస్తూంది. ఏమేమో వికారభావాలు కల్గుతున్నై ఈ ప్రకృతి సీతారూపంగా నన్ను ఉన్మాదిని చేస్తూంది. చిన్నవాడవైనా నీలో ఇంత నిగ్రహం ఎలా నిల్చిందో నాకే ఆశ్చర్యంగా వుంది" అనగానే ఆ మాటకు సౌమిత్రి సిగ్గుతో శిరం వంచుకుని చిరుహాసం చేశాడు తలవంచుకునే "అన్నయ్యా! నీ నిగ్రహం నాలో నిక్షిప్తం చేసి లోకానుగ్రహంకోసం సంమర్త్య భావంతో మరుగుతున్నావు. కాకపోతే వానప్రస్థుడవైన నీకు ఇంద్రియ వికారాలేమిటి? అయినా మితిమీరి లోక

శ్రేయస్సు కోరరాదు ఏ లోకానికి అవశ్యంగా వుండతలచావో, ఆ లోకమే అహంకారంతో, అజ్ఞానంతో అతి కాముకుడు రాముడని ఆడిపోసు కుంటుంది అసలేమిటో దానికి అక్కరలేదు దానికి తెలిసిందీ, దానికి తోచిందీ, దానికి కావలసిందీ ధర్మం అంటుంది సృష్టికి ఆ భాగం ఎప్పుడూ అవసరమే, కేవలసత్వం క్రియాకారి కాదుగదా! రజస్తమస్సుల తరతమ భేదాల సంయోగం చేతనే కదా జననవృద్ధి క్షయాలు సంప్రాప్త మవుతున్నై ప్రత్యచైతన్య మాత్రంగా స్పందనం కలిగిస్తూంది నీవే ఒక సారి నాతో అన్నావు శాంతవర్తనుడ్ని చవట అనీ, సాధువును భీరువనీ, నిర్లిప్తుణ్ణి వ్యర్థజీవి అనీ లోకం నిందవేస్తుందని ఆ లోకం నోళ్లే నిన్ను అతికాముకుడవనో, నీచకాముకుడవనో, వెర్రిబెంగళప్పవనో అంటుంది. సత్యంగా చూస్తే ఒకరి బాధతో కాని, ఒకరి సుఖంతో కాని, ఇంకొకరికి ప్రమేయం లేదు. ఐనా, గురివిందగింజ తనకున్న నలుపు సంగతి వదలి పగడానికి తూటున్నదని పరిహసిస్తుందన్నట్లు పరులను నిందిస్తారు. అందుకే "అతిసర్వత్ర వర్జయేత్" అన్నారు పెద్దలు. నీవు పొందుతున్న పరితాపానికి నాకు తెలిసిన కారణం లోకానికి తెలియదు. చెప్పినా వినదు. కనుక లోకం కోసమైనా ఆత్మరతి మాని, బాహ్యానికి తెలిసే ధృతి ధరించు. మనం కార్యరంగంలో దిగబోతున్నాం దేవతాప్రీతికోసం సంధ్యావందనం చేయాలి. నీ మిత్రుడిచ్చిన మాట ఏపాటిదో చూడాలి ఇక కాలం వ్యర్థంగా గడపకూడదు అరణ్యవాస సమయం సమీపంగా వుంది అవ తల భరతుడున్నాడు అన్నిటికంటే వదిన అన్వేషణం, అనంతరం శత్రు ఖండనం కర్తవ్యానికి ముందున్నై. ఇంతకూ "మా వదిన జీవించి వున్నదా? ఉంటే స్థిరచిత్తంతో వుందా?" అని బెంగపడుతున్నావా? ఆమె జీవించి వుంది నీ రాకకోసం నిరీక్షణ చేస్తూంది తనకపకారం చేసిన దైత్యుని చావు సమూలంగా కాంక్షిస్తూంది ఇక ఆమెను ఏ ప్రాణీ స్పృశించలేదు అపకారం చేయలేదు. సాహసిస్తే అగ్నిని సమీపించి శలభాలు ఆహుతి అయినట్లే అవుతుంది ఫలాహారవేళ అయింది. ఫల జలాలు తెచ్చాను. మంచి తామరపత్రాలు కూడా తెచ్చాను. అరణి తరచి దారుగుదూడిలో అగ్ని ప్రతిష్ఠించి దాని ద్వారా వెలుతురు నిమిత్తం, వేడిమి నిమిత్తం దూరంగా నెగడు వేశాను. భుజించి సుఖశయనం చేయ

వచ్చు. పోదాం రమ్మంటూ లేచాడు రాముడు కూడా లేచాడు. ఇరువురూ శైలాగ్రంనుండి ప్రకృతిశోభ తిలకిస్తూ గుహకు బయలుదేరారు

## శరత్కాల వర్ణనం

దారిలో రాముడు," సోదరా శరత్కాలం ఎంత మనోజ్ఞంగా వుందో చూడు పర్జన్యుడు విరివిగా వర్షించి ధరణీ కాంతను తృప్తి పరచి ధన్యుడయినాడు పైరుపచ్చలు ఫలోన్ముఖాలైనై. జలధరాలు జల భారం తగ్గటంతో బడలిక బాపుకుంటానికి విశ్రాంతి స్థానం చేరుకున్నై. ఏనుగు గుంపులు దండుగట్టి ఒకచోటినుంచి ఇంకొక చోటికి పోయినట్లు కారుమబ్బులు దెసలకు కాటుక పూసి వెళిపోయినవి అంబుగర్భాలూ, వేగవంతములూ, బహువిధ కుసుమ వాసనా భరితాలూ, జృంభితాలూ అయినఏలగోలు గాలులు వీచి వీచి విరతిగొన్నై మదవారణ వారిధర మయూర విర్ఘ విన్యాసాలు ఒక్కసారిగ ఆగిపోయినై. వారిధారలచే నిర్మలములైన శైలాల్లో ప్రస్థాణులు చిత్రవిచిత్ర వర్ణాలతో లిప్తమయిన విధంగా కనుపిస్తున్నై. క్రీడావతి నవసంగమ కాలంలో అవ్వలి మోము కలది కాగా కేవలం పిరుదులు మాత్రం కనిపించినట్లు, శరత్కాల కూలంకష సైకతపాళిని మెలమెల్లగా చూపుతూంది శారది తన శాకపత్వం తారా గణానికీ, తరణికీ, చంద్రకిరణాలకూ; వారణ శ్రేష్ఠములకూ పంచుతున్నది చూడు శారదగుణం కలదీ. నానా రుచిర ద్యుతి మంతమైనదీ అయిన నవ్యశ్రీ, బాలారుణ కరబోధితమై పీరేజాకరంలో వెరనెరి చూపిస్తూంది. ఘనసార వృక్ష సుమవాసనలై; మదషట్పద ఝంకారాలై; మత్తవారణాలకు గాఢప్రకోపములు దర్పం రేకెత్తిస్తున్నై జంట జంటలుగా శైవలినీ పులిన తలాలనుంచి అరుగుదెంచి సరసుల్లో క్రీడిస్తూ, రెక్కలు విచ్చి ఓలాడుతూ, పుష్పాల బుక్కాము వలె మేనిపిందా అలదుకొని; చక్రవాకములూ, చక్రాంగములూ వింతగా వినోదించుతున్నై మదమెత్తి తిరిగే మాతంగ యూథంబోనూ; క్రొవ్వి తిరిగే కోడెలంచూ; నీరు తేటపారే నిమ్నగా సంతతిలో బుతులక్ష్మి ఎన్నోవిధాలుగా చెన్ను మీరుతూంది. ఆకసంవంక చూచి; అక్కడ మబ్బులుండటంతో ఆశ వదులుకుని తమ

పింఛముల వగలు వీడి, ప్రియుల పొందు దూరం చేసి; కాంతిమాసి నెమళ్ళు ధ్యానం చేస్తున్నై. గరగర పసిడి జాలువాకాంతుల గౌరవార్థం దిక్కులు నిండగా, విరిసిన విరుల నిండు వేకటితో; కమ్మవాసనలు చిమ్ముతూ; వంగిన కొమ్మలతో మంకెనచెట్లు బింకాన్నీ; పొంకాన్నీ ఒలకపోస్తున్నై.

చికిలి చేసిన ఖడ్గధారవలె అభ్రం అందం చిందుతూంది. నదీ జలం వెలజవ్వని నడుమువలె సన్నగిల్లింది. జలరుహ శీకవాత సంచరణం ష్ఠాగింది దిశాతతి విధూతతిమిరయై కళకళలాడుతూంది వళిపికాంత ప్రియార్తైన కరుల్లు కరిణీబృందం వెంట రాగా; నవ తటీకాహ్వాళి సంచక్రములయి మందయానం చేస్తున్నయి. వేడి వెలుగు విజృంభించి వెలుగుల్లా క్రమ్మరిస్తుంటే బురదనేలలు బీటలు వార్తుతున్నయి. ధరణీతప్తయై మాటి మాటికి ధుమ్ము చిమ్ముతూంది రాజులు వగదీర్చుకోటానికి శత్రుదేశాల పైకి జైత్రయాత్ర సలిపే సమయం ఇదే. శరద్గుణ శోభ శరీరం వెలిగించగా; శంకమాని; స్వేచ్ఛగా విహరిస్తూ; పోతరించి; కొమ్ములు ఓరగా వ్రాల్చి ఒడ్డలని రంకెల హుంకృతులతో కాళ్ళ నేలరాస్తూ వృషభ సమూహం మందల్లో కమవింపు చేస్తూంది. మదించిపోతున్న మదనాగాన్ని మన్మథ శరవిద్ధమై కరిణీ సహస్రం వదలక మందయానంతో వెంట నంటుతున్నది అలంకారాలైన పింఛాలను విడిచి నదీ తీరానికి పోతే హంసలు గద్దించగా మరలేటి విధంగా దైన్యంతో మయూరాలు పోతున్నయి. జక్కవ్లలూ; నీరుకోళ్ళూ దిగులు పడగా; సలిలాలంకృతమైన కొలంకుల ఏగ్గ విండ్రుకలంచుతూంది వంకర జారి నిర్మలంగా వున్న నీటిలో ధేనువులు పిపాస తీర్చుకుంటుంటే; బెగ్గుకు పక్షులు మునకలు వేస్తున్నయి. వరువులు వారు మేఘముల దారుల తొందర తీరింది. జలజముంజరి వదనంబులో అమతాపం మీరింది. విహంగ పుంజము పరువుల జేరింది. కాముకుల మాటల్లో బింకం పూరింది క్రొత్త కాపురపు తలోదరీమణుల మూర్ఖత మెల్ల మెల్లగా జారింది. రకరకాల పాములు దాంచిన్లు; డొక్కలు మాడగా ఆకలితో బొక్కల్లోనుంచి బుస్సు బుస్సుమంటూ బయటికి వస్తున్నై.

చంచచ్చంద్ర కరస్పర్శాంచిత, ముద్వికచతారకాన్విత, సంధ్యాకాంతరాగంతో తనంత తానుగా అంబరాన్ని పరిత్యజించుతూంది ఉదితచంద్రముఖీ, విదితతారాచారు విమలాంబరా కుముద కౌముదీవసనా అయిన నిశాకాంత తెల్లచీర ధరించిన ఇంతిలాగా వుంది. చక్కగా పండిన ఎన్నులముక్కుల్లో కరచిపట్టి బలాకలు బారులు కట్టిపోతుంటే రకరకాల పూలతో అల్లిన మాలను ఆకాశలక్ష్మి తాల్చినట్లు అనుపిస్తూంది హంసలు నిద్రించగా, కైరవవారం నిర్మలం కాగా, మేఘావరణం తొలగి, చుక్కలతో, చందమామతో ముద్దులు కురుస్తున్న ఆకాశంవలె అగాధజలాశయం ఆహో అనేట్లు చేస్తూంది. రాజహంసకులం చుట్టూవుండి ఒడ్డాణం కాగా, వల్లి కలువలు, కెందమ్ములు మెడలోని హారాలు కాగా సరస్సులు అలంకృత కాంతల్లాగా ఆహ్లాదం కలిగిస్తున్నై తలముడిచిన మల్లెపూల చెండ్లవలె చిరుగాలికి కదలుతూ తెల్లని పట్టుపుట్టం పరచినట్లు రెల్లుపూలు నదీకూలాల్లో కానవస్తున్నై.

గోపకులు వాయించే పిల్లనగ్రోవినాదం, మందమందంగా వీచే మారుత రుతం, పూబోడులు దధిమధిస్తుంటే పుట్టే ఘుంఘుమరవం, చియ్యబట్టిన కోడెలు పారెకుచేసే హంబారావం, పాలకై లేగలుచేసే అంబానాదం చేలనుంచీ, చెట్లనుంచీ వచ్చే హాళికుల పలుకుల ఉలివు, బీళ్ళకు పోతున్న ఎద్దుల మెడలోని మువ్వలసవ్వడి ఒకదానితో ఒకటి ఈ సమయంలో పోటీ పడుతున్నై మధువానిన మధుకరములు మత్తులో తాండవిస్తూ, కమల రేణుగౌరతను కోరతో గుములుకట్టి యాత్ర సాగిస్తున్నై. మీ నోవ దర్శిత మేఖలలు అయిన వాహినీసుందరులు, అలసగతులై, ప్రియులతో పెనగిపెనగి తృప్తితో అవశలై, వసివాళ్ళు పడిగృహోన్ముఖులైపోతున్న అభిసారికలవలె కానవస్తున్నారు. జక్కవలతోనూ, శైవాలంచిక్కదనంతోనూ, రెల్లుపూల నెరిచీరల పెక్కువతోనూ, పత్రభంగాలు కల్గిన మదవతుల వదనాలవలె నదీముఖాలు సొంపెక్కనై. వికసించిన పూలబాణాలు వనధనుస్సులో సంధించి, మధుపానమత్త మధుకర ఝుంకార ధ్వనితో మనకోదండుడు సంచారం సలుపుతున్నాడు. జగతికి జీవనదానం గావించి ఏళ్ళు, చెరువులు, కొలకులు, గుంటలు పూరించి, పైరుపంటల

వర్షించి అంబుధరాలు మహాదాతలవలె నష్టప్రాయములయినాయి. ప్రసన్నోదకంతో, కురరీరవంతో, తిరుగుతున్న జక్కవ గుంపుతో సరసులు సరస శబ్ద సార్థకాలైనై. శ్యామాదండములై, బంధూక కోవిదార కుసుమాసనములై, పరిమళభరితములై, ఏడాకుల అరటులు కొండచరియల్లో కులుకుతున్నై. ఇసుకతిన్నెల్లో కుదరీవిలసనములూ సారసముల విహారకేళుల రథాంగదంపతికల నాదములు కడురమ్యంగా వున్నై. పరిసంధుల జయంప సయువించే సమయం ఇదే. ఇక ఆలస్యం తగదు

## కపిపతి సమయం భంగించినందుకు రాముడు విచారించుట

సమయాతిక్రమణం జరిగినా మిత్రుడు వచ్చినవాడు కాడు. యత్నం చేసిన జాడకూడ కనరాదు ఈ నాల్గునెలలు శతసహస్ర సంవత్సరాలుగా వేగించాము. సీతను విడిచి వుండలేకుండా వున్నాము. హృదయం తత్తరపడుతూంది చక్రవాకి భర్తతో వనానికి (నీరున్న చోటికి) పయనించునట్లు, ఆటతోటకు అరిగిన చందంగా అవనిజ, భర్తృహిత సమేత సీత నాతో వనానికి వచ్చింది. "తమ్ముడా! సౌమిత్రీ! ఆలుకోలుపోయినవాడు, ఆర్తితో కుములుతున్నవాడు, పుడమికోలు పడినవాడు, ప్రవాసి, మేలుకూర్చినవాడు, మిత్రుడు, అగ్నిసాక్షిగా కూర్చుకున్న అనుబంధం కలవాడు, హితుని సుఖంకోసం స్వకార్యం విలుపుకున్నవాడు" అని అయినా కీశరాజుకు నాపై దయరాలేదు కదా! "రాష్ట్రం పోయింది. రాక్షసునిచే అవమానం పొందాడు. సీవా అనే దిక్కులేదు విలువనీడ కూడ లేదు. దేబె. కార్యకోసం పలవించేసంద నా శరణుచొచ్చినవాడని క్రోతిరేదు అనాదరబుద్ధి వహించాడు తన కార్యం నెరవేరింది. నష్టదార రాజ్యప్రాప్తి లభించింది. ఇక మనతో అతనికి అవసరమేముంది? ఉంటే సమయాన్ని అతిక్రమిస్తాడా? సీతాన్వేషణ చేయించడా? సమయాంతానికి మనవరకు చనదెంచడా? కానికాలంలో త్రాడు పామవుతుందని పెద్దలు చెప్పినమాట సత్యం అతడు విశ్వాసపాత్రుడు కాడని మనము చెప్పటం లేదు. మరి ఈ అకార్యకరణం ఎందుకు జరిగిందో తెలియటంలేదు. ద్రోహబుద్ధికలవాడయితే మారుతి అతణ్ణి ఎందుకు అనుసరిస్తాడు? నాతో

మైత్రి ఎందుకు కూరుస్తారు? హనుమ అక్కడ వుండగా అధర్మం, అన్యాయం జరుగదు. కానీ, కాలంమాత్రం గడిచింది. కారణం ఊహ కందటంలేదు. వర్షాకాలం తర్వాత పొందిన రాజ్యం కనుక, వాలి అభిమానులు ఏమైనా ఉపద్రవాలు కల్పిస్తున్నారేమో. అలా జరగటానికి ఏమీ అవకాశం లేదే, అంగదుడు యువరాజైనాడు కదా, ఏమో. అతనికి ఆ అధికారం ఇచ్చాడో లేదో. పౌరుల సమక్షంలో మాట ఇచ్చి తప్పు కాదా, తప్పితే హనుమదాదులు ఒప్పుకుంటారా? ఏది ఏమైనా మనం విషయం తెలుసుకోటం మంచిది.

## రాముడు లక్ష్మణుని కిష్కింధకు పోయిరమ్మని చెప్పుట

తమ్ముడా, నీవొకసారి కిష్కింధకు పోయిరావటం శ్రేయస్కరం. వలువతగిన పనులన్నీ నలిపి వ్యర్థమైతే తక్కిన కార్యం తరువాత ఆలోచిద్దాం. తెలియకుండా ఒక నిర్ణయానికి రావటం తెలివిలేనిపని. అతడొక వేళ పనులతో సతమతమవుతున్నాడేమో. లేక మన కార్యంకోసం యత్నంచేసే తొందరలో వున్నాడో. అన్నివిధాలా అర్హమైన పని నీవు వెళ్ళి విషయాలు గ్రహించి రావటం మన కార్యంలో నిమగ్నులై వుంటే సరి. లేకపోతే నా మాటలుగా అతనితో ఈ విధంగా చెప్పు "మిత్రుడా అర్థులుగా ఆశ్రయించిన అర్హులైనవారు, ఉపకారం ముందుగా ఒనరించిన వారు, అట్టివారికి మాటఇచ్చి తప్పటం, అతిక్రమించటం పురుషాధమలక్షణం. పాపమైనా, పుణ్యమైనా చెప్పినమాట చొప్పున చేసినవాడే పురుషోత్తముడు. తనపని చక్కపరచిన మిత్రుణ్ణి మరచినవాడు చస్తే ఆ పీనుగును నక్కలూ కుక్కలూ, గ్రద్దలుకూడా ముట్టవు" అని. అతడు ప్రళయగర్జన హసించే నా ధనుష్టంకారం వినటానికి కోరుతున్నాడేమో. విటతట ఘటితబంధంతో, సంతప్తచిత్తంతో, వారిస్తే, పిడుగుల క్రక్కే ఆ ధ్వని ఆలకించాలని ఆశపడ్డాడేమో. కాకపోతే, తెలిసితెలిసి నా అస్త్ర విద్యాపాటవం సమయోల్లంఘనం వలవరాదా, వరసత చంపి, విరసత నింపి, తరుణుల నడుమలో తగుల్కొని తనకుపకారం చేసిన చెలికానిని నిర్లక్ష్యంగా చూస్తాడా, ఎందుకు అతని పొత్తు కోరాను, ఎందుకు వాలిని

చరిపాము. అతడు ఏం పాపచేశాడు? వానకాలం గడవగానే క్షణం ఆలస్యం లేకుండా సీతను వెదకటానికి కపులను పంపుతానన్న ఆశతోనే గదా, వానలు వెలిసి శరత్తు రాగానే వస్తానని చెప్పాడు. శరత్తుకూడా కొంత సాగిపోయింది స్వైరకేళీతత్పరుడు కావటంతో కాలగమనం గణించ లేదు ఇష్టజనగోష్ఠితో; ఇంతుల కౌగిలింతలతో; మధువానిన మత్తుతో; మువలమా: తన సమయాన్ని మరిచాడు కనుక: "ఓ వానరుడా! వాలి పోయిన మార్గంలో పోవద్దు ఆ మార్గంలో కంపకూడా మొలవదు. మాట ఇచ్చింది రామునకు కాలచక్రభ్రమణం లెక్కించు చేసిన తప్పుకు చెంపలు వేసుకో నా శరఘాతానికి వాలి ఒకడే మరణించాడు నీవు సబాంధవంగా చస్తావు సుమా. మాట తప్పకు. మంచిదైన సనాతన మార్గాన్ని మట్టిపాల్చేయకు అమరరుద్ధ అలక్ష్యంతో ఎరదిపెట్టకు అన్న వున్నచోటికి పోకు" అని అంటూ ఇంకా చెప్పతగిన మాటలుంటే నా మాటలతోపాటు చెప్పు"మని అన్నాడు.

## లక్ష్మణుని సుగ్రీవుని తానే చంపుతానని రామునికి చెప్పుట

సుగ్రీవుడు చేసిన అపరాధంవల్ల ఆగ్రహోదగ్రుడై రాముడు పలికిన పల్కులు అసలే కోపంతో వున్న సౌమిత్రికి అగ్నిలో ఆజ్యం పోసి నట్లయింది వస్తున్నవారల్లా అదాటుగా ఆగారు అదిశేషుడు సహస్ర వదనాలెత్తి బుసకొడుతున్న చందంగా లక్ష్మణుడు రోషంతో రోజుతూ "అన్నా! ఈ మాటలు నీ నోటివెంట ఎప్పుడు వస్తాయో అని ఇంతవరకు ఎదురుచూస్తున్నాను మనకు కిష్కింధతో పనిలేదు. ఆ కృతఘ్నుడితో అంతకంటె అవసరంలేదు. మనం దికార్లమా, పౌరుషహీనులమా, చేతులు కట్టుకుని ఆ కోతికి మన కార్యం మనవి చేసుకోవాలా? అతడెంత, అతడి సహాయమెంత, తప్పు తెలుసుకుని తానై వచ్చి నీ చరణాలపై పడవలెకాని మనం దేబెగొట్టుమొగంతో; బిచ్చగాళ్ళవలె భిక్షం అడుగుతామా, సుక్షత్రియులం ఐక్ష్వాకులం. దాశరథులం ఏనుగు ఎత్తుపడితే గుర్రం అంత అవుతుందికాని గాడిద కాదు కదా, ఆత్మాభిమానం చంపుకుని; మనం చేసిన మేలు చెప్పి దెప్పటం అల్పులు చేసేపని అవుతుంది. ఇంత ఔదార్య

మూర్తివైన నిన్ను అశక్తునిగా, అసమర్థునిగా భావించినవాణ్ణి నీవు క్షమించటం కూడదు. నేను లేనా? ఆ పనికి నేను అక్కడికి పోవలెనా? ఇక్కడ నిల్చి కోదండం సజ్యం చేస్తే కిష్కింధానగరం భూగోళంలో వుంటుందా? అయినా అంత సిగ్గుమాలి ప్రాధేయపడితే అతడు వెలగబెట్టే పని ఏమిటి? వానరుల పంపి వదినను వెదకించటం. అంతేకదా?

ఆ కార్యం నేనే చేస్తాను. నీవు అనుమతి ఇస్తే ఎలా చేస్తానో ఇప్పుడే చూపిస్తాను. నాకు నా తల్లి వరం వుంది. ఏ కోసం నేను ఏ సంకల్పం చేస్తే అది నెరవేరుతుంది. అన్నా అనతి ఇవ్వు. అస్త్రశస్త్రాల అవసరంలేదు. మహర్షుల శాపం ఎలా ఆయుధమో; నాకు మాతృదేవీప్రసాదంతో సంకల్పం అలా ఆయుధం. ఆమె వున్నచోటు దర్శిస్తాను. కోదండధారులమై రణరంగంలో రావణుని సంహరించి నాతల్లి సీతతో కలిసి అయోధ్యకు పోదాం" అని అంటుంటే; సముద్రాలు సంక్షోభంతో పొంగిపొర్లుతున్నట్లు కులాచలాలు ధరణిలో కూలిపోతున్నట్లు ప్రళయ ఝంఝూవాతం వీస్తున్నట్లు; భూమ్యాకాశాలు సమ్మేళనం పొందినట్లు; గ్రహమండలాలు స్థానం తప్పుతున్నట్లు విశ్వంభర కంపిస్తున్నట్లు, దేవతలు తేజోహీనులైనట్లు, జానకి తన హృదయంలో దర్శనమిస్తున్నట్లు, రాముని మనోనేత్రాలు చూస్తున్నై. ఆ దృశ్యం చూచి రాముడు స్తబ్ధుడై నిలిచాడు. సౌమిత్రి ఇంకా చెప్పసాగాడు "తుచ్ఛమైన గ్రామసుఖాలను ఇచ్చించి, కృతం మరచిన ఈ పుచ్చిని మచ్చు రాహుతిపాలుచేసి వదినను సాధించి తెస్తాను. నీ ఇక్కడే వుండు. ఈ కృతఘ్నుడిపై కలిగిన కోపం ఆపుకోలేకున్నాను. ఒక వేళ నీవు అంగీకరించకపోతే అనంతరం అంగదుడూ, హనుమంతుడూ ఈ పని చేస్తారు. అంతేకాని ఆ విశ్వాసఘాతకుణ్ణి అర్థించవద్దు" అని వంకమన్న చాపం చేతికి అందుకున్నాడు.

## సౌమిత్రిని శాంతిపరచి రాముడు కిష్కింధకు పంపుట

ఆనందపరవశుడై రాముడు ఆజానుబాహువుల: గ్రుచ్చి గుండెకు అదుముకున్నాడు. తలా, మేనూ నిమిరాడు. "సౌమిత్రీ! నీవన్నవన్నీ

అక్షరాలా నిజం అయినా గోటితో కాగలపనికి గొడ్డలి ఎందుకు? పూర్వం ఒక ఋషిబాలకుడు యోగసిద్ధుడై, మరి ఒక ఋషి దర్శనార్థం బయలుదేరి పోయాడట. ఆ ఋషి మహారణ్యమధ్యంలో ఉత్తుంగపర్వత శృంగంపై వున్నారట ఈ బాలుడు పర్వతప్రాంతం చేరగానే దిక్కులన్నీ గాఢ తిమిరావృతాలైనాయట మార్గం తెలియక ఋషికుమారుడు తన వామహస్తంపైకెత్తాడట వెంటనే బాహుమూలం (చంక) లోనుంచి కోటి చంద్రప్రకాశమానంగా వెలుతురు పర్వతంపై ప్రసరించిందట ఎత్తిన చేయి అట్లే వుంచి ఆ వెలుతురులో మహర్షిని చేరి అభివాదంచేసి నిలుచున్నాడట. ఆయన సమాధిచాలించి కళ్ళు విప్పిచూచి "నాయనా! వచ్చావా? ఈ చీకట్లో దారితెలియక ఎంత కష్టపడ్డావో" అని ఆశ్వాసించారట ఆ ఋషిపుత్రుడు "కష్టం లేకుండా వెలుతురులోనే వచ్చాన"ని చెప్పాడట "వెలుతురెక్కడిది బాబూ?" అని ప్రశ్నిస్తే చేసినపని చెప్పాడట అందుకు ఆయన నవ్వి "ఎంతకాలం పట్టింది యోగసిద్ధికి"ని అడిగితే "ఇరవైయేళ్ళుపట్టిం" దన్నాడట "అయ్యో! అడవిలో మండే కొరవి సాయంతో సాదగినపనికి ఇరవైఏండ్లయోగం వ్యర్థం చేశావా నాయనా!" అని తనవద్దవుంచుకుని జ్ఞానోపదేశం చేశారట. చిన్నప్పుడు తండ్రి నేనేదో సాహసం చేయబోతే చెప్పారు మనం శక్తిమంతులం కనుక కార్యాలు మనమే సాధించుకోగలం మరి సామాన్యుల సంగతేమిటి? వారు పరస్పరం సహకారం లేకుండా పనులు చక్కబెట్టుకోగలరా? మనం లోకులం లోకంతోపాటే మనం నడవాలి ఆ నడక మంచిదయితే అంతా అనుసరిస్తారు, ఆదరిస్తారు చెడ్డదయితే వదలివేస్తారుదూషిస్తారు మనగాధను అపార్థం చేసుకున్నవారికి మనమే దారి చూపాలె. నిన్ను లోకం క్షణికోద్రేకినిగా, త్వరపాటు మనిషిగా చూస్తున్నదే కాని నీ సృష్టి ఎట్టిదో నావలె చూడలేరు అకదాకవేళ అపకారం తలపెడితే అది నాకు కదా? అవసరమయితే నేనాతని దండించలేనా?

ఇటువంటి కార్యం నీవంటి వారికి తగదు. పూర్వసఖ్యం తలంచి ఆతనిని యథాప్రకారంగా గౌరవించు పాపాటుని వివేకాగ్నితో ప్రాజ్ఞుడు కాలుస్తారు. ప్లవంగేశ్వరునితో పరుషభాషణం చేయవద్దు.

మంచిమాటలతో మనపని సాధించు. అవసరమయితే హనుమతో ఆలోచించు. సాహసం సర్వకాలాల్లో జయసిద్ధికి కారణం. కాలం ఇంకా మించిపోలేదు. సున్నితంగా మన సమయం హెచ్చరించు. సుఖంగా పోయిరా" అని అన్నాడు ఆ పల్కులతో వివృత్త విజాశయుడై, దానవపిశాచాన్ని పరిహసించే కోదండం ధరించి, లయకాల సన్నిభుండై, శృంగసంగత మందరాద్రివలె, తాను పల్కతగిన వాక్కులు కపిపతి చెప్పే ప్రతివాక్కులు బృహస్పతి వంటి బుద్ధిమంతుడు లక్ష్మణుడు లోన చింతిస్తూ, పాలితోన్నసాలతాల భూజోత్కరుడై, శిలలు నుగ్గుకాగా పద ఘట్టనం చేస్తూ, సామజాన్ని తలపిస్తూ కామక్రోధాలచే రామునిలో పుట్టిన కోపాగ్నిని తనలో నింపుకుని ప్రళయ ప్రకంపనంలాగా దూసుకునిపోసాగాడు ఆ వేగంలో కుడిపాదం విజయ సూచకంగా ముందు పెట్టి వెనుకముందు చూడకుండా కిష్కింధామార్గాన్ని చేరి, దట్టమయిన కొండల నడుమ, కీశరాజ పరిపాలిత నగరాన్ని ఎట్టఎదుట కని రెట్టించిన కోపంతో బుసకొట్టుతూ అధరపుటాలదరంగా సమీపించాడు

## లక్ష్మణుని చూచి కోతులు పరుగెత్తుట

ఆ రామసోదరుని ఆకారం, ఆ రాకలక్షణం, ఆ సజ్యచాపం, హస్తనిక్షిప్త శరం, ఆ అగ్రహవదనం నగరరక్షకులైన వానరులు చూచారు కొందరు తరువులు ప్రాకారు కొందరు గిరులెక్కారు కొందరు భీతులై పురంలోపలికేగారు కొందరు ఇంచుక ధైర్యంతో సుగ్రీవుని సౌధం చేరారు. "సాగ్రహుండై, ద్విగుణీకృత సప్తజిహ్వుడై, లయకారుడై రామసోదరుడు వచ్చి ప్రవేశద్వారం వద్ద నిలిచివున్నాడు ప్రభువులు కర్తవ్య పాలనం చేయాలి" అంటూ మొర్రపెట్టారు ఆ మాటలు తారాకరపీడనంలో తన్మయుడైన సుగ్రీవుని చెవులకెక్కలేదు. మంత్రులతో విన్నపించారు అద్రినాగాభులు, దశనాగ విక్రములు, దశగుణోత్తర బలులు, సామజసహస్రసత్త్వులు, వికృతదర్శనులు. సింహపరాక్రములు, ద్రుమ హస్తులు దుర్గాలను, ప్రాకారాలను పరిఖలమీదను నిలిచారు. ఎవ్వరు లక్ష్మణుని వద్దకురాలేదు. ఏమి పని అని అడగలేదు. ఆ అవ

మానవ రామానుజులకు సహింపరానిదైంది. శరాగ్రమున నాల్కగా, చాప దండం శిరంగా, తన దుస్సహతేజం విషంగా లక్ష్మణ భుజంగం ప్రళయ కృశానుతుల్యంగా ప్రకాశించింది. "ఇక సామం కార్యసాధనకా" దను కున్నారు. "అన్న ఎంత అమాయకుడు. ఈ మిత్రద్రోహిపై ఇంకా అనురాగం వర్షిస్తున్నాడు. నా రాకనే గుర్తించని వీడు దానచెల్లించే బంటు ఎలా అవుతాడు? ఇప్పుడే వీడి కళ్ళు తెరిపిస్తాను మత్తుచిత్తు చేస్తాను. కామవాంఛను త్రొక్కేస్తాను. నగరంలోనికి వెళ్ళిన కపులు నేను వచ్చినట్లు చెప్పుతుంటారు ఈ ఇంద్రియలోలుడు పెడచెవిని పెట్టి వుంటాడు. తగిన బుద్ధి చెప్పక తప్పదు. అన్నఇచ్చిన ఆజ్ఞ సామంతో సాధించమని అందుకే ఇంతవరకూ బ్రతికివున్నాడు. నారాక నేనే తెలుపుతా"నని ధనుర్గుణం ఆ కర్ణాంతం లాగి వదిలాడు ఆ ధ్వనికి కపికోటి మూర్ఛిల్లింది. ఎక్కడి క్రౌంచులక్కడే స్థాణువులైనవి ఆ ధ్వని రవిపుత్రుని కర్ణపుటభేదనం కావించినా, మైకంలో అది సౌమిత్రిసల్పిన ధనూరవం అని గుర్తించలేకపోయాడు. హనుమంతుడూ, అంగదుడూ విన్నారు. అంగదుడు రామానుజుని సన్నిధికి, హనుమ సుగ్రీవుని మందిరానికి పోయారు. వినమ్రుడై, దూరం నుంచే ముకుళితహస్తుడై వస్తున్న అంగదుణ్ణి సౌమిత్రి సానురాగుడై చూస్తున్నాడు పరుగున వచ్చి తారేయుడు పాదాలపై బడి నమస్కరించాడు. లేవనెత్తి "వత్సా! నీవు పోయి నీ పినతండ్రికి రామాజ్ఞచే రామానుజుడు వచ్చాడని చెప్పు" అని సందేశం పంపాడు. రామచంద్రుని కిచ్చిన మాటలు దాటటం తెలిసిన అంగదుడు భయంతో పురిలోనికి పోతూ "చేటుకాలం ఇంత తొందరలో పినతండ్రికి వచ్చిందే. ఎప్పుడు చెపుదా మన్నా అరవాళ్ళు, అంతఃపురం తప్ప వీధి మొగం చూచిన పాపాన పోలేదు. ఇప్పుడు ఈ ఉపద్రవం ఎవరు తప్పిస్తారు? ప్రళయనిర్ఘోషం వంటి శింజినీరావం విని కూడ తెలివి తెచ్చుకోని వాని లక్ష్మణ కోపాగ్నిలో బూడిద కాకుండా రక్షించేదెలా? ఆ భయంకర శబ్దానికే చలించనివాడు, చిన్నవాణ్ణి చెపితే వింటాడా? నాకు నాలుగునెలల్లో రెండు కర్మలు చేసే గతి పట్టిందా? విన్నా వినకున్నా ఆయన నాతో అన్న మాటలు చెపుతాను.

అపై, ఆయన అదృష్టం ఎలావుంటే అలా జరుగుతుంది. సమయజ్ఞుడు, తంత్రివంటివాడు సామీరి వున్నాడు, అంతా ఆయనే చక్కచేస్తాడు" అని అనుకుంటూ, త్వరగా పినతండ్రి సౌధం చేరాడు. తల్లికీ, పినతల్లికీ, పినతండ్రికీ మ్రొక్కి విషయం వివరంగా వినిపించాడు. కామపిశాచం పట్టుకున్న మనిషికి మనవులూ, గినవులూ, విషయవిమర్శనం; సమయాసమయం, మంచిచెడ్డలూ, చిన్నపెద్దల తారతమ్యం ఎలా తెలుస్తుంది? ఆ మూర్ఖుడు, విశ్వాసహీనుడు, ఏరు దాటి తెప్పగాల్చే జాతికి చెందినవాడు వినిపించుకోలేదు. రెండవసారి గుణధ్వని కొండలు నిండి ప్రతిధ్వనించింది. "అనుకున్నంత అయింది అకాల మృత్యువు అగచారికి వచ్చింది. తెలిసి చెప్పేదెలా?" అని వానరులు చింతించి, ప్రాణాలకు తెగించి రవిసుతుని గుండెలు పగిలేలాగా ఒక్కసారిగా కిచకిచారావాలు విడవకుండా చేసినై.

## సుగ్రీవునకు మంత్రులు హితవు చెప్పుట

ఆ అరుపులకు అదరిపడి లేచి కళ్ళు విప్పి చూచాడు. అంగదుడూ సచివులూ, సేనాపతులూ వచ్చి వాకిట్లో నిల్చున్నారు. ఏం పుట్టి మునిగిందని ఇంతమంది వచ్చారని విసుక్కుని దూరంగా వున్న మారుతిని చూచి సంబాళించుకుని కొలువు తీర్చాడు. అంగదుడు లేచి "రామాజ్ఞ గొని లక్ష్మణుడు నిన్ను హెచ్చరించటానికి వచ్చా"డని చెప్పుమన్నట్లు చెప్పాడు. ఆ మాటలు ఆలకించిన అమాత్యులు ప్లక్షప్రభావ నాములు "ప్రభూ! మా మనవి చిత్తగించండి ఇప్పటికే కాలహరణం చేసి ఆగ్రహ కారకులమైనాం. నీకు భ్రాతలు, రాజ్య సుశ్రీ దాతలు, రాఘవులు. సత్యవ్రతనిష్ఠులు సమరశూరులు. ఉపకారులు అన్నమాట చెల్లించినవారు. అనవరం కలవారు. వారిలో ఒకడయిన లక్ష్మణుడు చాపధరుడై రాగా, ఆహ్వాన విసర్జనాలు జరగక ఆగ్రహంతో ధనుష్టంకారం రెండుసార్లు చేశాడు. ఆ ధ్వనికి తీతిల్లి కపికులం గోల పెడుతూంది. యువరాజా ఆ నాదం విని అనర్థం గ్రహించి ఎదురేగి ఆహ్వానం చేశాడు. కాని, ఆయన తిరస్కరించాడు. రాతగిన విధంగా నీవు రాకపోవటం, అర్హంకాని వేషంతో అంగదుడు ఆహ్వానించటం అందుకు కారణం. వ్యవసాయ

రథంలో రామాజ్ఞారథికుని కాని వాక్యసారథిగా వచ్చిన సౌమిత్రిని అవమానించటం నీచే క్షేమం కాదు. యువరాజా మాటలు నీకు వినపడలేదు. జ్యావల్లీనాదం నీచే నిర్లక్ష్యం చేయబడింది. కంటిచూపుతోనే నగరం కాల్చేటట్లున్నాడు. వెంటనే సుహృద్బాంధవ సంతతితో చని పాదాలపై బడి ప్రార్థించు అంతతో ఆయన కోపం శమిస్తుంది. ధర్మాత్ముడయిన దాశరథి చెప్పినట్లు చేయి. చిలిపితనం చేయవద్దు. పలికిన మాటలు నిలుపుకుని. సత్యవాదివనీ మిత్ర శబ్దార్హుడవనీ, సమర్థుడవనీ ఋజువు చేసుకో. ఈ స్థితిలో, ఈ వేషంలో పోవద్దు. ఉచిత వేషధారివయి, ఆహ్వాన సమయార్హాలైన పరికరాలు కొని ఎదురేగి, వినయంతో కొనిరా. ఆయన ఏం చెప్పదలచాడో అప్పుడు వినదాం" అని హితబోధను చేశారు. అప్పటికి అర్ధార్ధంగా వున్న స్మృతిలో సుగ్రీవుడు అమాత్యుల వంక చూచాడు.

## సౌమిత్రి రాకవిని సుగ్రీవుడు భయపడుట

వారు చెప్పిన మాటల్లో సుగ్రీవునకు వినిపించింది, తెలిసింది లక్ష్మణుడు ఆగ్రహావేశుడై వాకిట్లో నిలిచి వున్నాడని. వెంటనే మత్తు దిగింది. గుండెల్లో దడ వచ్చింది. ఆసనం చలించినట్లయింది. భయకంపిత గళంతో మంత్రుల చూచి, "మంత్రులారా! అకారణంగా వారికి ఆగ్రహం ఎందుకు వచ్చింది? ఒక కీడుమాట కూడ అనలేదే, వారి మాటకు ఎదురు చెప్పలేదే, వారిచిత్తం కలుషించే పెద్ద ఏదీచేయలేదే, రామానుజునకు నాపైకోపం ఎందుకు వచ్చింది? నాపై కిట్టనివారు రామునితో కొండేలేమైనా చెప్పారేమో ఇంతకు చేసిన తప్పేదో తెలిస్తే కదా ప్రతిక్రియ ఆలోచించటం? ముందు ఆయన బుద్ధి తీరు తెలుసుకోవాలె. ఇక్కడ ఏమి చేయవచ్చునో ఎరుగవలె. అందుకు నిపుణులయిన మంత్రులను పంపించండి. దాశరథులకు భయపడటంలేదు. కారణం లేకుండా ఆగ్రహం కలిగినందుకు భయపడుతున్నాను. మిత్రుల సంపాదించుకొనటం తేలిక. మైత్రిని చిరకాలం చెడకుండా కాపాడుకోవటం కష్టం. మనస్సు క్షణక్షణ చంచలం కదా. అల్పవిషయానికే ప్రీతి పోతుంది. రాముడు నాకు చేసిన మేలు మరువరానిది. వెలకట్టలేనిది. ఏం చేసినా సరితూగనిది. ఏం చేస్తే బాగుంటుందో యోచించి చెప్పండి" అంటూ నీళ్ళు నమిలారు.

# హనుమంతుడు కరకుగా హితం చెప్పుట

ఆ మాటలకు దూరంగా వున్న పావనికి బాధ కలిగింది. ఎన్నడూ కోపం సహించని వానికి కోపం వచ్చింది. చరచర నడిచి ముందుకు వచ్చి, "వానరరాజా! ఏమంటున్నావు? ఏమి ప్రతికృతి చేయాలో మంత్రులు చెప్పాలా? వచ్చిన మిత్రుని గుణగణాలు పరులు తెలుసుకుని నీకు వివరించాలా? అప్పుడు ఆలోచిస్తావా? ఆహా! మిత్రులయినవారికీ, మైత్రి కోరే వారికీ నీ ప్రవర్తన ఆదర్శం అయితే కడముట్టినట్లే అవును. ఆపద సమయం వేరు ఆపదలో వున్న బుద్ధి ఆనందంలో నిలువదు అప్పుడు గడ్డిపరక మేరువులాగా కనపడుతుంది ఆనందంలో మేరువే గడ్డిపరకలాగా వుంటుంది. నీ మాటలు వింతగానూ, విశ్వాసహీనంగానూ వున్నాయి. ఆ రామ ప్రభువునకు ఇతరంగా ఏమీ నీవు చేయనక్కరలేదు, నీకు ఆయన చేసిన బాస ప్రకారం మేలు చేశాడు. నీకు నీవయి అన్నమాట ప్రకారం సీతమ్మ జాడ వెదకించి తెప్పించు అది చేస్తే చాలు. అంతకు మించి ఆయన కోరేది లేదు. నీవు చేసేది కూడ లేదు. అప్రతిహత బలశాలియైన వాలిని నీకోసం వధించాడు. భార్యను కూర్చాడు. రాజ్యం ఇచ్చాడు ఆయన నీ మాటకోసం ఆత్మవ్యధతో ఎదురు చూస్తున్నాడు. నీవు త్రాగుబోతువై, కామినీ కామ పరతంత్రుడవై కాలం వ్యర్థం చేస్తున్నావు. ఆ లోకైక వీరుడు, శాంతమూర్తి గడువు దాటినా నీవు కార్యరంగంలో దిగనందుకు వేచి వేచి చూచి నిన్ను హెచ్చరించటానికి ఆగ్రహించిన ఆదిశేషుని వంటి లక్ష్మణుని పంపించాడు. అప్పుడే ఇంత విస్మృతి నీకెట్లా వచ్చింది? అన్న మరణానికి అంత ఏడ్చిన నీకు అప్పుడే అది గాథగా అయిందా? కోపంతో వచ్చినా, శమనంతో వచ్చిన వాడు పూజ్యుడైన మిత్ర సోదరుడు. ఎదురు పోయి వుచిత మర్యాదలతో కొని రావలసిన దానికి మారుగా మంత్రులుపోయి గూఢచారితనం నెరపాలా? ఆగ్రహవశుడైన లక్ష్మణుని ఓదార్చి, తన మాటకు ఒప్పించి పంపివుంటారు లేకపోతే నీవు లేవు. నీ రాజ్యం లేదు. అందుకే ఆయన ఇంకా నీ కోసం అక్కడ నిల్చి వున్నారు. కర్పూరపు దనటులు విచ్చినై. గ్రహ నక్షత్ర గోళాలు నిర్మలంగా మింట హెచ్చినై. మేఘాలు ప్రస్థానం చెప్పినై.

కొండలు, నదులు, తీవలు కమనీయ కాంతులను ఇచ్చినై. వాటిని నీవు చూడలేక పోవటం చేత, వారు నిన్ను మదమత్తునిగ భావించి, నీ మాట నీకు అప్పగించమని అంటే సౌమిత్రి వచ్చారు. ఈ సమయంలో ఘన కార్యాలు చేసేవారు కార్యోన్ముఖులవుతారు. రాజులు జైత్రయాత్రలను ప్రారంభిస్తారు. సీతాన్వేషణ కిది తగిన సమయం. నీవు మేలు మరచి, బాస తప్పి కృతఘ్నుడవు కావద్దు నీకు లోగడ తగిన సమయంలో చేయ వలసిన పని తెలిపాను. నీవు దానిని త్రోసిపుచ్చావు తెలియవలసిన సమయం వస్తుందని నాకు తెలుసు. చేతులు కాలిన మీదట ఆకులంకోసం వెతకవల్సివ స్తుందనీ తెలుసు. సౌమిత్రి గుణధ్వానానికి కానీ, అంగదుని మొరకు కానీ వచ్చిన ఫలితం నీ మూర్ఖత, కృతఘ్నత. నీవు అపరాధివి. హృతదారుడైన అన్న శోకం భరించలేక ఆయన పంపగా వచ్చిన సౌమిత్రి ఒకవేళ పరుషంగా పలికితే సహించు. ప్రతిభాషించి ప్రాణాలకు ముప్పు తెచ్చుకో వద్దు, మేం నీచే మంత్రులుగానియుక్తులైనాం. మా ధర్మం రాజ్యరక్షణ. ప్రజారక్షణ. న్యాయ ధర్మరక్షణ. అంతేకాని నిన్ను పొగడుతూ, నీ పని మెచ్చుకుంటూ, నీ నిచ్చే మెరమెచ్చు సత్కారాలకు సంతృప్తి పడటం కాదు. అది నా పనికాదు. నాకు నీ భయం కన్నా ధర్మభయం ఎక్కువ. నీవు కాదంటే నీ మంత్రి పదవి నీ వద్దనే వుంటుంది. నీవు కోరి ఇచ్చింది కాని, నేను కోరి పుచ్చుకుంది కాదు. ఇంతకాలం నీవు గుణవంతుడవనీ, అధర్మబాధితుడవనీ అనుసరించినందుకు నే నే శ్రీరామ కార్యం చేసి నీ ప్రాణం మాత్రం రక్షిస్తాను. గతం తెలిసి, కృతం స్మరించి నీవు పుత్ర మిత్రాదులతో పోయి రామానుజుని శరణువేడు. ఆ పోవటంలో ఎవరు పాపం ఎక్కువ పెట్టినా ససురాసురమైన జగత్తును వశవర్తిగా స్థాపించ గల సమర్థుడు ఆ దయామూర్తి నిన్ను తప్పక ఆదరిస్తాడు ఆయన మెచ్చితే నీ కీర్తి దశదిశల విచ్చుతుంది. నీ అవజ్ఞత మరచినా, నీ అంతరాత్మ ఆ రాముని అనుగ్రహ బలం మరవదు. నేను మంత్రిగా, హితునిగా, నీ శ్రేయోఽభిలాషిగా పలుకుతున్నాను" అని ముగించాడు.

# సౌమిత్రి అంగదునితో కలిసి సుగ్రీవుని అంతిపురికి పోవుట

మారుతి మర్యాదా సహితంగా రవి పుత్రుని మందలించగా, తెలివి పూర్తిగా తెచ్చుకుని, "నీ యిష్టాను సారం కార్యం ఘటించు నేను స్నాతుడనై, సబాంధవ పరివారంగా సన్నద్ధుడనై వస్తాను" అని లోనికి నిష్క్రమించాడు. ప్రభువుతో హనుమ మాటాడుతున్నప్పుడే మంత్రులు అంగదుని ముందు పంపించి వెనుక రాజు వస్తున్నాడని చెప్పి లోనికి ఆహ్వానించారు. అంగదునిచే ఆహూతుడై లక్ష్మణుడు గుహాభ్యంతరం ప్రవేశించాడు. బలిష్ఠులైన ద్వారపాలకులు లేచి నమస్కరించి దారి చూపించారు. కాని, పరాభవరోషదందహ్యమాన మానసుడైన రామానుజుని సమీపించలేక ప్రక్కగా తప్పుకున్నారు. సాలంకృత రత్న రమణీయమై, పుష్పితారామమై, దివ్యమై, సౌధ సంబాధమై, సర్వ కామ ఫలకుసుమమై, దేవ యక్ష గంధర్వకిశోర సంసేవ్యమై, చందనాగరుపద్మ సంవాసితమై, సారమైరేయ మధురస పూరమై, అధిక వానర సంకుల రాజ మార్గంబై, ప్రఫుల్ల బహువిధలతాంత సురభి కళకాసారమైన కిష్కింధా నగరం కనిపించింది. అంగదుని హర్మ్యం, మైందాలయం, గజగవాక్ష ద్వివిద నిలయాలు, గవయ శరభవిద్యున్మాలి సంపాతి సూర్యాక్ష వాయు తనూజుల వాసములు, వీరబాహు, సుబాహు తార సుషేణనల నీలకుముదుల నిలయములు, దధి వక్త్రజాంబవత్సునేత్ర మందిరములు, పాండురాభ్ర ప్రకాశమైన పాటల గంధుల సౌధములు, ధనకోశాలు, ధాన్యాగారాలు, సుందరీ బృందకేళీ వనాలు త్రోవలో అటు ఇటు చూచాడు.

ఉన్నత పర్వతాభమై, దురాసదమై, వైజయంతీ సకాశమై, స్వీయతను కాంతి నిర్జిత హిమాచల ధవళమై సర్వకామదమై, కాంచన పత్ర తోరణాలంకృత భాసురమై, రక్షితాయుధీ యాన్వితద్వారమైన సూర్య సుతుని మందిరం చూచాడు. అంబుజ ప్రియుడు అంబరం ప్రవేశించినట్లు సింహద్వారం ప్రవేశించి సప్త కక్ష్యాంతరాలు కడదాటి, హైమరాజత పర్యంకాలూ, రుచిరాసనాలూ, ఆస్తరణాలూ నిండిన అంతిపురంలో ప్రవేశించాడు. వయోరూప గర్వితలైన వనితలు, సమగీత పదాక్షరంగా, విమల వీణానాదమేళ రంగా గానం చేస్తుంటే విన్నాడు. వారిని కన్నాడు. అసంతృప్తి కలవారూ

అలంకార రహితులూ, చందన గంధమాల్యానులిప్తశూన్యలూ, మాలాధరహీనలూ, వానరపతి పరివారంలో మత్తులైనా లేరని సౌమిత్రి భావించాడు మణిమయనూపురము కంకణమేఖలాకింకిణీక్వాణాలను విని, సిగ్గుతో తలదించుకున్నాడు. ఆరవం చెవులు సోకకుండా నారిమీటుతూ యువతులు లేని స్థానం చేరి, అన్న పడుతున్న బాధ అనుక్షణం జ్ఞప్తిలో నిల్పి నిచలితుని చేయగా వేచివున్నాడు. హిమావనంలో వుండి మధువు గ్రోలుతూ మదవతుల నలరిస్తూ వున్న భానుజుడు అంతఃపురంలో లక్ష్మణుడు సారించిన గుణ ధ్వనులువిని, రానేవచ్చాడు రామానుజుడని మొగం వెలతెలపోగా తత్తరంతో తారవంక చూస్తున్నాడు. తన్నక్కడ నిల్పి తండ్రిని కొనివచ్చుటకు పోయిన అంగదుని రాకకై అనుక్షణ ప్రవర్ధిత రోషానలావిష్టుడై, అలానబంధితమైన మహా నాగంలాగా రామాజ్ఞాపాశ బద్ధుడైన లక్ష్మణుడు ప్రతీక్షిస్తున్నాడు. ఇది కర్తవ్యతామూఢుడై తారేయుడు తండ్రి ఆజ్ఞకోసం తారాడుతున్నాడు

## లక్ష్మణుని సమాధానింప సుగ్రీవుడు తారను పంపుట

కామినీ కమనీయ శృంగారక్రీడా విషం తలకెక్కి, తెలివితప్పి, కోరిచేసిన అపరాధం కొరడాతో కొట్టినట్లు సారెసారెకు స్మృతికి రాగా, భీతుడై, సౌమిత్రిని దర్శించలేక సిగ్గుమాలి, చేసేపని పురుషలక్షణం కాదని తెలియక, ఆసవులకోసం ఆడుదానిని అడ్డంపెట్టుకున్నాననే అధమ ప్రథ లక్షించక, ప్రక్కనున్న తారను చూచి కపీశుడు, "మానినీ! రామానుజుడు వచ్చాడు. ఆతడు వెన్నవంటి మనస్సు కలవాడు. కోపంతో మన నగరానికి రావటం ఆశ్చర్యంగా వుంది. కారణంలేకుండా సాధువులైనవారికి కోపం రానేరాదు ఏ నేరం వారిపట్ల మనం చేశామో నీవారసి నాకు తెలుపు. కాకపోతే నీవే సాంత్వవచనాలతో సాదరమతిగా చేసి ప్రసన్నుణ్ణి చేయి. ఆయన పరిశుద్ధమయిన హృదయం కలవాడు. నిన్ను చూచి కోపం తగ్గించుకుంటాడు. పూజ్యులైనవారు, అందులో సౌమిత్రి ఆడువారిపట్ల పరుషంగా ప్రవర్తించటం అర్థంలేని అజ్ఞాన భావం. కనుక నీవు ముందుగాపోయి సౌమిత్రిని ప్రసన్నునిగా నల్పు. తర్వాత సమయం

చూచి నేను దక్కిస్తాను" అని ప్రాధేయపడ్డారు. వనచరపతి పొందుతున్న భయం ఎందుకో తారకు అర్థమైంది. తానుగాక, తనవెందుకు పంపుతున్నాడో అతను చెప్పిన హేతువులకంటే అధికంగా ఆమె గ్రహించింది. తన పట్ల, తన బిడ్డపట్ల తలంచలేనంత దయకలవారని అనుభవ పూర్వకంగా తెలిసింది కనుక, ఆ చనువును పురస్కరించుకుని ఆసనం నుంచి లేచి అంగదుని అనుసరించింది.

## తార లక్ష్మణునిచేరి సంభాషించుట

పినతండ్రి చేస్తున్నపని అంగదునకు అప్రియం కలిగించింది. అసహ్యం వేసింది. "ఇతడింత క్షుద్రజీవా?" అనిపించింది "భార్యా వియోగం, రాజ్యభ్రష్టత్వం శ్రీరామ చంద్రునకులేవా? ఆయన ఇంత వికృష్టుడు కాలేదే భార్యను వదలి అన్నతో వనవాసంచేస్తున్న లక్ష్మణుని కింత క్షుద్రకామాసక్తి లేదే? ఈ భోగం నా తండ్రి పొందలేదా? ఆయన శత్రుమిత్ర పరిపాలనా విషయంలో ఎన్నడు అప్రమత్తుడు కాలేదే? ఐశ్వర్యం ఎక్కడికి పోతుంది? అనుభవం ఎక్కడికి పోతుంది? ఈ తలతిక్కతనం. ఆగడం ఇంతకాలం ఏమూలదాగింది? అన్నాదిని దూరమైనవాడు అన్నంచూచి ఆబగొన్నట్లు అంతఃపురంలో ఆడవాళ్ళ మధ్య బ్రతుకుతున్నాడేమి? ఛీఛీ! అప్పుడైన హనుమంతుడు అసహ్యించుకున్నాడంటే ఆ బ్రతుకునకు అర్థం ఏమిటి? ఇంత దుశ్శీలుడు ఆ మహాత్ములు వెళ్ళిపోగానే నన్ను యువరాజుగా మన్నిస్తాడా?" అని తలంచుకుంటూ నడుస్తున్నాడు. లంబమాన రత్నస్థగితరశనయై, నమితాంగ యష్టియై, సహజ శోభతో తార అడుగులో అడుగుపెడుతూ అంతఃపురి ప్రవేశించింది. ఆమె రాక చూచి సౌమిత్రి అవాఙ్ముఖుడైనాడు నిప్పుపై నీరుచల్లినట్లు కోపం కొంత తగ్గించుకున్నాడు.

నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై,
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీకభవాయ తస్మై.

ఇతి శ్రీరామచంద్రార్పణమస్తు.

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



Volume Six

Price Rs. 5/-

cover printed at nandini art printers, hyd-29